30

# అపరాధ పరిశోధన

రు. 6 | అక్టోబరు '84

సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం—130

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మానవత్వం ఎలుక కెందుకు?

రచన: చంద్రశేఖర అజాద్

## ఊహించని అదృష్టం

రచన: టెంపోరావ్

## సత్యభామ శపథం

రచన: ఎమ్. డి. చైతన్య

## తీవ్రవాది

రచన: ఎమ్. వి. వి. సత్యనారాయణ

అగ్ని కిరీటం - రెండవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—130
అక్టోబరు, 1984
వెల: రు. 6-00
ఏడాది చందా: 72 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# మానవత్వం ఎలుక కెందుకు?

చంద్రశేఖర అజాద్

కళ్ళనిండా నిప్పులు కణకణ మండి పొగలు సెగలు క్రక్కుతున్నాయి.

నిప్పులు .... ఎండలు .... యెండలు పెరిగే నిప్పుల్లో పోటీగా, సూటిగా చూస్తున్నాడతను. రావిచెట్టు నీడ. నీడక్రింద వెచ్చటి వడగాలిలో మరింత వెచ్చగా ఉన్నాడతను.

కళ్ళు దేన్నో పరికిస్తున్నాయి.

ఆలోచన మనస్సుతో పోటీ పడుతుంది.

ఆవేశంతో శరీరం ఎగిరెగిరి పడుతోంది.

ఖాళీ చేతులు, ఖాళీ కడుపు, యెటు చూసినా శూన్యం! ప్రక్కనే పడుకున్న మనుష్యుల్ని చూశాడు.

వారందరిలా తనూ "అనాధ" "దిక్కులేనివాడు"

ఆలోచన కాల్చేస్తోంది.

తను భోంచేసి ఎన్నాళ్ళయింది?

ఆకలి వెయ్యటంలేదు. ఎందుకని?

కరడు గట్టుకుపోయింది గుండె, మనస్సు.

కసి....పగ...

ఎవరిమీద?

ఎందుకు? ఎందుకు?

"నీ పేరేమిటి?"

"సృజన్."

"చాల బాగుంది."

"అవును. అందుకే మా బాబు పెట్టుకున్నాడు."

"నీలో ఏదో కళ ఉంది. సృజనాత్మకమైన నీలోని కళల్ని సమాజానికి అంకితం చేయాలని ఆయన ఆశయం కావచ్చు."

"అవును. నాలో జీవకళ ఉండేది ఒకప్పుడు. ఇప్పుడది పోయింది ఆయనతోపాటే. నాలో సృజనాత్మకత యే విషయంలోనూ, యెక్కడా విజయం పొందలేదు. చివరకు ఇలా ఈ రావిచెట్టు నీడలో..ఎండిన డొక్కల్లో శూన్య హస్తాల్లో...."

"బాధపడకు."

"బాధా....కాదు....కసి తీర్చుకుంటాను."

గతం కళ్ళముందు పరుచుకుంటోంది....

## 2

రేణుక కళ్ళల్లోకి చూశాడు రవి.

"సృజన్ పడుకున్నాడా."

"ఆఁ."

"వాడ్ని ఈ రోజు సినిమా హాల్లో చూశాను" అన్నాడు రవి.

"ఇంటికి త్వరగానే వచ్చేశావే" అంది రేణుక అనుమానంగా.

"నన్ను చూచి లేచి వచ్చాడు."

"అందుకే కాబోలు ఈ రోజు మౌనంగా ఉన్నాడు."

"రేణుకా...వాడ్ని గురించి నేననుకున్నవేవీ జరగవు" అన్నాడు రవి.

"ఏమిటలా అంటున్నారు?" కంగారుగా అంది.

"అవును. వాడ్ని గమనించాను. వాడి జీవితంలో డాక్టర్ కాలేడు. ప్రతి చిన్న విషయానికే కదిలిపోయే మన స్తత్వం వాడిది. వాడు డాక్టర్ కావటం చాలా కష్టం. వాడ్ని డాక్టర్ ను చేయాలని నే నెంతగా ఆశ పడ్డానో నీకు తెలుసు. కాని వాడు ఆ పద్ధతిలో పోవటం లేదు. ఆలోచించటంలేదు. ప్రతి విషయం సీరియస్ గా తీసుకుంటాడు. ప్రతిదాన్ని తనతో పోల్చుకుంటాడు. వాడెలా మారతాడో ఊహించటం కష్టంగానే ఉంది" అన్నాడు రవి.

"ఏమిటో నాకేమీ అర్థం కావటం లేదు" అంది రేణుక.

"లేదు. నీ కర్థంకాదు. వాడి భవిష్యత్ లోకి నేను చూస్తున్నాను. నా ఆశయం నీకు తెలుసు. నా బిడ్డను ఈ సమాజానికి యేదో విధంగా ఉపయోగపడేలా చెయ్యాలనేది నా కోర్కె...." అన్నాడు పడుకుంటూ.

తను పడుకున్నాడన్నమాటే గాని, తండ్రి మాటలు వింటూనే వున్నాడు.

రేణుక నిట్టూర్చింది.

రవి రచయిత. కలంతో మాత్రమే యుద్ధం ప్రకటించకుండా అతను జనంలోకి వెళ్ళి పని చేస్తూంటాడు. కొండలు....కోనలు చుట్టివస్తుంటాడు. ఆ అనుభవాల్తో రచనలు చేస్తుంటాడు.

# 3

"అబ్బా!" అనుకున్నాడు సృజన్.

గండుచీమ కసిగా కరిచింది. ఎర్రటి రక్తపుబొట్టు అప్పుడే వెలిసింది. చీమ కొంచెంసేపు గిలగిలలాడింది. తిరిగి బయలుదేరింది. సృజన్ కళ్ళు మిలమిలలాడాయి. చిరు దరహాసం ఒకటి పెదవులమీద వెలిసింది.

రక్తంవంక గండుచీమవంక మార్చి మార్చి చూశాడు. అది వెళ్తోంది.

టప్పున దానిమీద చెయ్యి పడింది.

నలిగిపోయిందది.

నవ్వుకున్నాడు సృజన్.

"మనిషిని మనిషే కాదు. జంతువులు కూడా బలహీనుల్ని నాశనం చేస్తున్నాయి. ఇది ప్రకృతి ధర్మమా" అనుకున్నాడు.

కడుపులో పేగులు అరుస్తున్నాయి. లేచి నిలబడ్డాడు. బద్ధకంగా ఓసారి వళ్ళు విరుచుకున్నాడు. అంతే....

నోటివెంట మాట రావటంలేదు.

గుండె పట్టేసింది.

కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి.

ఒకటి.... రెండు నిమిషాలు.... గుండె సర్దుకుంది.

నిట్టూర్చాడు.

కడుపు ఖాళీగా ఉన్నప్పుడు అలా చేయటం పొరపాటే. మెల్లగా నడుస్తున్నాడు. బట్టలన్నీ భయంకరంగా మాసిపోయి ఉన్నాయి. తలమీద వెంట్రుకలు రాగి వెంట్రుకల్లా ఉన్నాయి. వాటికి నూనెరాసి ఎన్నాళ్ళయిందో... వంటికి బిగుతుగా అంటుకుపోయిన బట్టల్లో

సృజన్ నడుస్తున్నాడు.

దూరంనుండి చూస్తే హాలివుడ్ హీరోలా ఉన్నా డతను. ఆ నడకలో పట్టుదల కనిపిస్తోంది.

ఖరీదయిన కారొకటి ప్రక్కనుండి దూసుకుపోయింది.

ఆలోచనల్లో ఉన్న సృజన్ ఉలిక్కిపడి చూశాడు. ఆ కారులో ఉన్న వ్యక్తి రూపం మనసులో మెదులు తోంది. అతను! అతను!

అడుగులు వడివడిగా పడుతున్నాయి.

ఆగాడు. ఎదురుగా బ్రహ్మాండమయిన భవనం.

ఇంద్రభవనం అనబడే దానికి దీటుగా ఉంది. బయట నుండి చూస్తుంటే అందమయిన పచ్చికబయలు కనపడు తోంది. అందులో రకరకాల పూల మొక్కలు వాటి నడుమ వాటర్ ఫౌంటెన్ మరింత అందంగా వుంది. దూరంగా గ్యారేజ్...అందులో అత్యాధునికమైన కారు కనిపిస్తోంది.

సృజన్ నేమ్ బోర్డువంక చూశాడు.

"రాజారావ్ బిల్డింగ్స్."

పెదవులు మెల్లగా విచ్చుకున్నాయి.

గేటుముందు ప్రహారా కాస్తున్న ఘూర్కా ఇందాకటి నుండి గమనిస్తున్నాడు.

"క్యాహోనా."

ఉలిక్కిపడ్డాడు. ఏం మాట్లాడాలో అర్థంకాలేదు. అతను దొంగను చూసినట్లు చూస్తున్నాడు.

వెనక్కి తిరిగాడు సృజన్. గుండెల్లో అగ్నిపర్వ తాలు రగులుతున్నాయి. ఎత్తుగా నిలబడ్డ భవనం వికటాట్టహాసం చేస్తోంది. మెల్లగా నడుస్తున్నాడు. రంగు రంగుల దుస్తులు ధరించిన అందమైన యువతీయువకులు

వెళుతున్నారు. వారి కళ్ళలో అంతులేని ఆనందం తొణికిసలాడ్తోంది.

యువ్వన ప్రాంగణంలోకి అడుగిడుతున్నారు వారంతా. వారి ఆలోచనలు ఆ ముఖల్లో ప్రతిబింబిస్తున్నాయి.

సృజన్‌కు చాలా దిగులనిపించింది. భోరున యేడ్చేయాలనిపించింది చల్లని ఒడిలో, గుండెల్లో తాపం తీరేదాకా.

అమ్మ ఒడిలో తాను....తన జుట్టు నిమురుతూ కళ్ళలోకి చూసే అమ్మ....తన బట్టల్ని సైతం తానే సెలక్ట్ చేసి బడికి పంపించే అమ్మ....తన రాకకోసం యెదురు చూసే అమ్మ....తన భవిష్యత్‌ను గురించి గొప్పగా ఊహించిన అమ్మ....

“అమ్మా” మెల్లగా పెదవులు విచ్చుకున్నాయి

ఆ మాటల్లో ఆవేదన, దుఃఖం మిళితమయ్యాయి.

“అమ్మా, ఎందుకిలా చేశారు. మీరు నన్ను ఒంటరి వాడ్ని చేశారు” గొణుక్కున్నాడు.

“నేను యేకాకిని.”

కళ్ళనిండా నీరు గిరుక్కున తిరిగి బుగ్గలమీద జారిపోయింది. మోచేత్తో ఓసారి కళ్ళు తుడుచుకున్నాడు. చేతికి తడి అయింది. ఆ మేర ఎర్రటి శరీరం కనపడింది. మర్రిచెట్టు కిందకు చేరాడు. చీకట్లు పడుతున్నాయి.

ఒక్కొక్కరే ఆ చెట్టు నీడకు చేరుతున్నారు— జోలెలు పుచ్చుకొని. వీధి కుక్కలు రెండు కీచుకుంటున్నాయి. సృజన్ వెళ్ళి కూర్చున్నాడు. శూన్యంలోకి చూస్తూ.

జోలె తెరిచి అందులో ఉన్న పదార్థాల్ని తీస్తున్నాడు ఆ బిక్షగాడు. అతని దగ్గర అదోరకమైన వాసన

వేస్తోంది. నల్లటి బొచ్చెలో వేశాడు ఓ అన్నం గడ్డ. దానిమీద పులుసో, చారో పోశాడు. కలిపి నోట్లో పెట్టుకుంటూ చూశాడు.

స్రృజన్ తనవంకే చూస్తున్నాడు.

ఆ చూపుల్లో యే భావంలేదు. నిస్తేజంగా వున్నాయి కళ్ళు.

"రా.... ఓ ముద్ద తిందువు" అడిగాడు.

స్రృజన్ యేం మాట్లాడలేదు.

"నిన్నే."

"ఆc."

"బువ్వ తిందువు."

"బువ్వా."

"వన్నమయ్యా."

అతను లేచి వచ్చాడు.

"చేయిపట్టు."

స్రృజన్ కు తెలియకుండానే అతని చేయి చాచబడింది.

చేతినిండుగా పెట్టాడు.

"తిను."

స్రృజన్ మాట్లాడలేదు. చేతిలో ముద్దవంక ఓ సారి చూశాడు. కళ్ళవెంట నీరు గిరుక్కున తిరిగింది.

"తినంటే...."

గబగబ తినేశాడు.

అతని కళ్ళలో ఆనందం కనపడింది.

ఇంకో ముద్ద చేతిలో ఉంచాడు.

కాలం గడిచిపోతూనే వుంది.

స్రృజన్ ప్రక్కకు చూశాడు.

తనకు అన్నం పెట్టిన వ్యక్తి కాళ్ళు ముడుచుకొని

పడుకొని ఉన్నాడు.

అతనెవరో తనకు తెలియదు. తాను బలవంతం చేసి అన్నం తినిపించాడు. యేమిటీ అనుబంధం అనుకున్నాడు.

తన జీవితంలో తనకున్న అతి తక్కువ అనుభవాల్లో మానవుల్లోని కుట్రల్ని, మోసాల్ని, అవకాశ వాదాన్ని చూశాడు. అమ్మ, నాన్నలను తప్పించి ఇతర త్రా ప్రేమానుబంధాల గురించి తెలియదు. కానీ మానవుల్లోని అవలక్షణాల స్థానంలోనే ప్రేమ.... అనుబంధం.... అన్నీ ఉన్నాయి. ఈ మనిషే ప్రేమిస్తాడు! ఈ మనీషే ప్రాణాలు తీస్తాడు! ఎంత విచిత్రం అనుకున్నాడు. మనిషి మనిషిగా బ్రతికితే ఎంత బాగుంటుంది....అనుకున్నాడు.

"మనిషి మనిషిగా బ్రతకాలి. కానీ కొన్ని మృగాలు మనుషుల్ని కాపలా కాస్తున్నాయి. దోచుకుంటున్నాయ్. పీక్కుతింటున్నాయ్. ఇప్పుడు నా కర్తవ్యం యేమిటో చెప్పు" నాన్న కంఠం గంభీరంగా పలుకుతోంది.

సృజన్ కళ్ళు చూస్తున్నాయి.

ఆ కళ్ళలోని వెలుగు దగ్గరకు రావటానికి భయ పడ్తోంది చీకటి.

# 4

అర్థరాత్రి ఎందుకో మెలకువ వచ్చింది సృజన్‌కి.

తలుపు ఉండి ఉండి మ్రోగుతోంది సంకేతంలా. వింటూ పడుకున్నాడు. అమ్మ వెళ్ళి తలుపుతీసింది. ఎవరో వ్యక్తి లోపలకు వచ్చాడు. అమ్మ వెంటనే తలుపు మూసింది. యెవరా వ్యక్తి? గడ్డం బాగా పెరిగి ఉంది. తల వెంట్రుకలు నల్లగా ఉన్నాయి. ఆ వ్యక్తి నిలబడ టంలో పోలిక వుంది. ఎవరతను?

"రండి" అంటోంది అమ్మ.

"సృజన్ నిద్రపోయాడా" అంటున్నాడతను.

ఎవరు? తన పేరు తెలిసిన వ్యక్తి తనకు తెలియకుండా యెవరున్నారు?

"నిద్రపోతున్నాడు" అమ్మ సమాధానం.

అతను తన వైపుకు నడిచి వస్తున్నాడు.

గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

ఆయన వచ్చి ఓసారి ఆప్యాయంగా జుట్టులోనికి వ్రేళ్ళు పోనిచ్చాడు.

ఆ స్పర్శతో భావకందని మమకారం ఉంది.

"నాన్న వచ్చారు" అనుకున్నాడు లేవకుండానే.

"రండి భోజనం చేద్దురు" అంది అమ్మ.

అమ్మ వెంట బయలుదేరాడు. ఈ నడుమ నాన్న సరిగా యింటికి రావటం లేదు. యెప్పుడో అర్ధరాత్రి వస్తాడు. అమ్మనడిగితే యేమేమో చెబుతోంది. అసలు నాన్న రూపమే మారిపోయింది. తనుకూడా గుర్తుపట్ట లేనంతగా... అసలు నాన్న ఏం చేస్తున్నట్లు....!

వంటింట్లో శబ్దాలు అవుతున్నాయి.

భోంచేస్తూ మాట్లాడుకుంటున్నారు. సృజన్ మెల్లగా నడిచి వంటగది ప్రక్కన నిలబడ్డాడు.

"సృజన్ ఎలా చదువుతున్నాడు?"

"ఫర్వాలేదు."

"వాడి బాధ్యత నీదే."

"మీకు బాధ్యత లేదా."

"రేణూ" అన్నాడు రవి. "నా సంగతి నీకు తెలుసు. రాను రానూ పరిస్థితులు విషమిస్తున్నాయి. ఇంక ఇలా రావటం కూడా సాధ్యపడక పోవచ్చు."

"ఎందుకని?" రేణుక గొంతు వణికింది.

# 12

"త్వరలోనే మేం ఓ కార్యక్రమం నిర్వహించబో తున్నాం.... దానికి చెందిన పనులున్నాయి."

"ఏమిటా పని?"

"అది రహస్యం."

"నా దగ్గరకూడానా."

"రేణూ....అది పెద్ద రహస్య విషయం. అది మరొ కరికి తెలియచేయకూడదనేది మా నియమం. నన్ను అర్థం చేసుకో. ఆ విషయం చెప్పనందుకు నన్ను క్షమించు."

"పోనీ మీరు చేసేపని యేమిటో చెప్పండి."

రవి కొంచెం ఇబ్బందిగా చూశాడు.

చేయి కడుగుతూ మెల్లగా అన్నాడు.

"నాటు బాంబులు తయారుచేయటం."

సృజన్ ఉలిక్కిపడ్డాడు. మెల్లగా మంచం దగ్గరకు చేరాడు.

రేణుక చాలా సేపు మాట్లాడలేదు. ఆమెకు భవిష్యత్ అంతా శూన్యంలా కనిపిస్తోంది.

"ఏమిటి మాట్లాడవు."

"ఏం మాట్లాడను. మీరు మాకు అందనంత దూరం లోకి వెళుతున్నారు."

"రేణూ....నువ్వు మన గురించి ఆలోచిస్తున్నావు. లక్షలాది ప్రజానీకం గురించి ఆలోచించలేవు. ఎంత సేపూ నీ భర్త....నీ బాబూ....నీ సంసారం...."

"తప్పా?"

"కానీ ఈ దేశంలో ఎందరు మానవులుగా బ్రతుకు తున్నారు. ఆలోచించు."

"అది మనకెందుకు?"

"మరెవరికి కావాలి. సృజన్ గురించి నీ కెందుకు

బాధ్యత."

"అమ్మను కనుక."

"నాకూ అంతే. ఈ గడ్డపై పుట్టి పెరుగుతున్నాను. నా ప్రజలంతా సుఖంగా, సంతోషంగా బ్రతకాలి. వాళ్ళ అమాయకత్వాన్ని ఆసరాగా తీసుకొని భూస్వాములు, ధనవంతులు, వాళ్ళని దోచుకుంటున్నారు. చిత్రవధ చేస్తున్నారు. వాళ్ళ ఆటలు అరికట్టాలి."

"అందుకు మీరేం చేస్తారు."

"నరికేస్తాను."

"ఎవర్ని."

"దుర్మార్గుల్ని,"

"ఒకడు పోతే ఇంకోడొస్తాడు."

"కాదు. ఒకడ్ని నరికితే మరొకడికి బుద్ధివస్తుంది. అప్పుడే ప్రజల్లో కదలిక వస్తుంది. దాన్ని విప్లవంగా మార్చుకుంటాం. ఈ దేశపు చీడపురుగుల్ని నాశనం చేసి మరో సమాజం నిర్మించుకుంటాం."

"మనుష్యుల్ని చంపటమా? దారుణం. రాను రానూ మీరు మరీ రాక్షసంగా మారిపోతున్నారు. హింసించటం మానవత్వం కాదు."

"రేణూ....మానవత్వం గురించి మనకెందుకీ వివాదం. నువ్వు చెప్పే మానవత్వం జనాన్ని పీక్కుతింటున్న తోడేళ్ళకు లేదు. పిచ్చిదానా! ఎలక్కి మానవత్వం ఎందుకుండాలి? పిల్లి కుంటుంది గనకనా! మానవత్వం అంటే ఏమిటి? విలాసాలు ఓ ప్రక్క....దుర్భరంగా బ్రతకటం మరో ప్రక్క....హింసకు హింసే మార్గం" ఆవేశంగా అన్నాడు.

రేణుక ఏం మాట్లాడలేదు.

"ఐయామ్ సారీ" అన్నాడు రవి కంట్రోలవుతూ. "రేణూ! తిరిగి గంటలో వెళ్ళిపోవాలి. డబ్బుకు నీవేం ఇబ్బంది పడాల్సిన అవసరంలేదు. నేను వచ్చేదాకా ఈ అయిదువందలుంచు. సృజన్ చదువు విషయం గురించి జాగ్రత్త. నా గురించిన వివరాలేవీ వాడికి తెలియ గూడదు. మరలా త్వరలో నే కలుసుకోగలమనే ఆశిస్తాను."

రేణుక ఏం మాట్లాడలేదు.

తిరిగి రవి సృజన్ దగ్గరకొచ్చాడు. ఓసారి ఆప్యా యంగా తడివాడు.

"వస్తాను" రేణుకతో అన్నాడు.

ఆమె ఏం మాట్లాడలేదు.

"ఏమిటి మాట్లాడవు. భారత దేశంలో వీర నారు లున్నారు. వారిని ఆదర్శంగా తీసుకో."

"త్వరగా రండి."

"ప్రయత్నిస్తా."

మెల్లగా తలుపు తెరుచుకుంది. కొద్ది క్షణాల తర్వాత మూసుకుంది.

అమ్మ వెక్కిళ్ళు వినపడుతున్నాయి.

# 5

ఆ రోజు ఉదయం సృజన్ పేపర్ చూస్తున్నాడు.

విప్లవకారుల చేతుల్లో భూస్వామి హత్య!

"ప్రముఖ భూస్వామిగా పరిగణించబడుతున్న శ్రీ ధర్మారావును కొందరు వ్యక్తులు దారుణంగా హత్య చేశారు. అంతకుముందు ధర్మారావు ఇంటిలోని ప్రాంసరీ నోట్ల నిన్నింటినీ కుప్పగా పోసి తగులబెట్టారు. ధర్మా రావు భార్య కళ్ళముందే అతన్ని చిత్రవధ చేస్తుంటే

చూడలేక ఆమె స్పృహ తప్పింది.

ఈలోపు ధర్మారావు కేకలకు ప్రోగయిన జనాన్ని బెదిరించటానికి వారు నాటు బాంబులు వేశారు. విప్లవ నినాదాలు ఇచ్చారు. ప్రజలంటే తమకు కోపంలేదనీ, ప్రజల్ని మోసంచేస్తూ వారి ధన ప్రాణాల్ని దోచేవారిని చంపి, ప్రజల్ని రక్షించటమే తమ ధ్యేయం అని వారు చెప్పారు.

"విప్లవం వర్ధిల్లాలి" అంటూ నినాదాలు చేసుకుంటూ వారంతా పారిపోయారు. మొత్తం అయిదు లక్షల విలువ చేసే బంగారం, రెండు లక్షల కరెన్సీ దోచుకోబడిందని 'ధర్మారావు' గారి భార్య తెలుపుతున్నా, వాస్తవానికి ఇంకా యెక్కువ ఉండవచ్చని అనధికార అంచనా. వెంటనే పోలీసులు రంగంలోకి దిగారు."

అదే పత్రికలో మరోచోట ఇంకో వ్యాఖ్యానం ఉంది.

"ధర్మారావు హత్యచేయటం అనేది ఏరకంగానూ సమర్థనీయం కాదు. అయితే ఆ పరిస్థితుల్ని కల్పించటంలో ఆయన పాత్ర ఉందనిపిస్తుంది. ఆయన ఇదివరకు అనేకమందిని గూండాలతో చంపినట్లు తెలుస్తోంది. ప్రజల్ని బెదిరిస్తూ ఎక్కువ వడ్డీలు గుంజటం, భూముల్ని ఆక్రమించటంలాంటి పనులు చేశాడు. మొత్తంగా ఆ గ్రామంలో ధర్మారావ్ పట్ల వ్యతిరేకత ఉంది. అయినా సరే ధర్మారావును హత్యచేయటంతో పరిస్థితులు మరింతగా విషమించటం తప్పించి, ఆ పరిస్థితుల్లో యే మార్పు ఉండబోదు."

సృజన్ కు అర్థమయింది.

అయితే ఒకటే అనుమానం.

నాటు బాంబులు విసిరింది నాన్నేనా? ధర్మారావును చంపింది నాన్నేనా? అసలు ఈ సంఘటనలో నాన్న ఉన్నాడా? బంగారం, డబ్బు యేమయ్యాయి?

ఆలోచిస్తున్నాడు. మనస్సంతా అయోమయంగా ఉంది. అమ్మకేమయినా తెలుసా? ఊహుఁ తెలిసినా చెప్పదు. యేం చేయాలి? ఎలా తెలుసుకోవాలి?

ఈ సంఘటన జరిగి దాదాపు నెల కావస్తుంది. అయితే ఈ విషయంమీద అనుమానంమీద కొందరిని అరెస్టు చేయటం జరిగిందని పత్రికల్లో రాసినా అందులో రవి పేరు లేదు. అసలు ఈ నడుమ రవి ఇంటికి రావటం మానేశాడు.

రేణుక మాత్రం దిగులుగా ఉంటోంది. ఆమెలో ఓ రకమైన నిరాస క్తత ఏర్పడింది. ఏ క్షణాన యే ఘోరం వినాల్సి ఉంటుందో ఆమె ఆలోచించటంలేదు. ఆ పరిస్థితికి అలవాటుపడిపోయింది.

సరిగ్గా నెల తర్వాత అర్ధరాత్రి తలుపు చప్పుడయింది.

సృజన్ ఉలిక్కిపడి లేచాడు.

అమ్మ నిద్రపోతోంది.

మెల్లగా మంచం దిగి లైటు వేశాడు. ఆ తర్వాత తలుపు తీశాడు. లోపలకు దూసుకొచ్చాడు రవి. ఆ నిశ్శబ్దంలో అతని గుండె చప్పుడు వినిపిస్తోంది.

"నాన్నా."

"తలుపెయ్."

తలుపు మూశాడు సృజన్.

రేణుక కంగారుగా లేచి వస్తోంది.

"నాన్నా."

"సృజీ."

"ఏమిటిలా ఉన్నారు."

ఇప్పుడు రవి ఆకారం పూర్తిగా భిన్నంగా ఉంది. నున్నటి గుండు. లాల్చీ .... పంచె .... అదో తరహాలో ఉన్నాడు. ప్రత్యేకించి చూస్తేనేగాని గుర్తుపట్టడం కష్టం.

"ఇది వేషం. ఆ వివరాలు తర్వాత చెబుతాను. నీ స్టడీస్ ఎలా ఉన్నాయి?"

"నిజం చెప్పాలంటే ఐ డోంట్ లైక్" అన్నాడు సృజన్.

"ఏమిటది?"

"చదువుకోవటం."

"అదేమిటి?"

"చదువుకొని ఏం చెయ్యాలి? ఎవడిస్తాడు ఉద్యోగం. ఐ డోంట్ లైక్ దిస్ బ్లడీ ఎడ్యుకేషన్. గుమస్తాగాళ్ళను తయారు చేస్తుందిది."

"అఫ్‌కోర్స్.... చదువును తిట్టకు."

"ఇంటికి రాగానే మొదలా. ముందు స్నానం చేసి రండి. ఈలోపు నేను వంట చేస్తాను."

"అలాగే" స్నానాల గదిలోకి నడిచాడు. స్నానం చేసి వచ్చాక కుర్చీలో కూర్చుని—

"యస్. మెడియర్ సన్" అన్నాడు రవి.

"మీరు కనిపించి చాలా రోజులయింది."

"అవును."

కొంచెంసేపు నిశ్శబ్దం.

"మీరు తయారు చేస్తున్న నాటుబాంబులు ధర్మారావ్ మీద విసరారా?" చాలా మెల్లగా అడిగాడు.

ప్రక్కనే బాంబు పడినట్లు త్రుళ్ళిపడ్డాడు రవి.

"సుజీ...."

"అది నా అనుమానం అంతే."

"వెల్. ఆ దాడి గురించి నీ అభిప్రాయం యేమిటి?"

"సాహసం....గొప్ప సాహసం."

"అంతేనా?"

"నాకనిపించింది అదే."

"కానీ ఆ దాడి సాహసంకోసమో, సరదాకోసమో కాదు. ప్రజలకోసం....విప్లవం కోసం,"

"కానీ...."

"అదో మార్గం. మేం ఎన్నుకున్నాం. అది చాలా కష్టతరమే. యేదో రోజున నేనూ పోవచ్చు. కాని విప్లవం ఆగదు ఒక్కటే గుర్తుంచుకో. ఈ దేశంలో ప్రజలందరూ సుఖంగా బ్రతకాలి. ఆ క్షణం కోసమే మా ఆరాటం."

"ఆ దాడిలో కొన్ని లక్షలు దోచుకోబడ్డాయని అంటున్నారు."

"ఆ లెక్కలు నాకు తెలియవు. ఉద్యమం బలపడాలంటే డబ్బు అవసరం."

"అందుకోసం బందిపోటు దొంగల్లా దోచుకోవటమా?"

"బందిపోట్లు వారికోసం చేస్తారు. మేం ప్రజలకోసం చేశాం. వాడి దగ్గరున్న నోట్లన్నీ తగలేశాం. ఆ గ్రామంలో ఎవరూ వాడికి బాకీలేరు. వారందరికీ స్వేచ్ఛ లభించింది. వాడి అధీనంలో ఉన్న పొలాలు ప్రజల స్వంతం అయ్యాయి. మా దాడిమూలంగా ఓ గ్రామం విముక్తి చెందింది. ఇలా ఒక్కో గ్రామాన్ని విముక్తి

చేస్తాం. ఈ దేశంలో విప్లవం విజయవంతమవుతుంది. ఆ రోజున కార్మికులూ, కర్షకులూ గర్వంగా బ్రతుకుతారు. అదే మా ఆశయం."

సృజన్ మాట్లాడలేదు.

"ఏది యేమయినా నువ్వు చదువు మానొద్దు. అమ్మకు డబ్బు ఇస్తున్నాను. మీకు యెటువంటి అవసరం కలిగినా నా మిత్రుల అడ్రసులిస్తున్నాను. వాళ్ళని కలుసుకుంటే మీకు సహాయం లభిస్తుంది. మైడియర్ సన్. మిమ్మల్ని వదిలి వెళ్ళాలని నాకనిపించటంలేదు. కానీ నా బాధ్యత నన్ను తట్టి లేపుతుంది."

"నాన్నగారూ, మీరనుసరిస్తున్న పద్ధతుల గురించి నాకు తెలియకపోయినా మిమల్ని చూస్తుంటే నాకు గర్వంగా వుంది."

"భోజనానికి రండి" రేణుక పిలుస్తోంది.

"అందరం భోంచేద్దాం."

"మేం భోంచేశాం."

"ఫర్వాలేదు."

రవి ముద్దలు కలిపి తినిపించాడు. సృజన్ కూ, రేణుకకూ. రేణుకకు తెలియకుండానే కన్నీళ్ళు కారిపోతున్నాయి.

"కన్నీళ్ళా."

"కాదు. ఇలానే ఉండిపోతే బాగుండుననిపిస్తోంది."

"ఆ రోజు కోసమే మా పోరాటం."

ఆ తర్వాత యెవరూ మాట్లాడలేదు. భోజనం పూర్తయింది. రేణుకతో కొంతసేపు యేకాంతంగా మాట్లాడాడు రవి. పన్నెండు గంటలు దాటిపోయింది.

"మరి నేను వెళ్ళి వస్తాను."

"సుజ్జీ" పిలిచాడు.

"నాన్నా."

ఆప్యాయంగా నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు.

"గుడ్ బై మై సన్."

"గుడ్ బై."

"వెళ్ళొస్తాను. రేణుకా."

తల ఊపింది.

తలుపు తెరుచుకుంది. ఒక్క నిమిషం. చీకట్లో కలిసిపోయాడు. భయంకరమైన నిశ్శబ్దం రాజ్యమేలుతోంది. సృజన్‌కు తండ్రితో జరిగిన సంభాషణ గుర్తుకొస్తుంది. మూసిన తలుపులకు చేరగిలబడ్డ రేణుక శూన్యంలోకి చూస్తోంది. సృజన్ మంచం దగ్గరికి చేరి కూర్చున్నాడు. రేణుక భారంగా నడుచుకుంటూ వచ్చి పడుకుంది.

తలుపుమీద దడ, దడ శబ్దం వస్తోంది.

ఉలిక్కిపడి లేచి వెళ్ళాడు.

తలుపుతీశాడు.

ఎదురుగా...

భుజానికి వ్రేలాడుతున్న తుపాకి .... దాని చివర బాయినెట్ మొన మెరుస్తూ కనపడింది. ఆ తర్వాత ఎర్ర టోపి కనపడింది.

"పోలీసులు."

తనకు తెలియకుండానే వచ్చాయా మాటలు.

అరగంట తర్వాత....

సృజన్ కళ్ళు ఆగ్రహంతో మండిపోతున్నాయి. ఇల్లంతా చిందర వందరగా ఉంది. అన్ని వస్తువులూ చెల్లాచెదరుగా పడివున్నాయి. పగిలిన సీసాలు, జాడీలు వెక్కిరిస్తున్నాయి. పోలీసులు 'రవి' ఆచూకి చెప్పమంటూ బలవంతం చేశారు. యింట్లో సామానంతా

ధ్వంసంచేశారు. కారం .... ఉప్పు .... పచ్చళ్ళు.... అన్నీ కుప్పలా పోశారు. మూలన ఉన్న పెట్టెను ఓ తాపు తన్నాడు. మూత ఎగిరిపోయింది.

అన్నీ పుస్తకాలు! వాటిని స్వాధీనం చేసుకున్నారు.

"రవి ఎక్కడ?"

"ఏమో మాకు తెలియదు. ఆయన్ని చూసి చాలా కాలమయింది."

"ఇంకా వివరాలు దొరుకుతాయేమో చూద్దాం" అన్నాడో పోలీసు.

టేబుల్ మీద రేడియో గాల్లోకి లేచి రెండు ముక్కలయింది.

కుర్చీలూ.... టేబుల్ అంతా ధ్వంసం.

సృజన్ పిడికిళ్ళు బిగుసుకుంటున్నాయి.

ఎక్కడో చిల్లర డబ్బులు....నాలుగు పదులూ దొరికాయి. వాటిని జేబులో వేసుకున్నారు.

"జాగ్రత్త మళ్ళా వస్తాం. మీరు చెప్పకపోతే దొరకడా....పిట్టను కాల్చినట్టు కాలుస్తాం."

హెచ్చరించి వెళ్ళిపోయారు.

ఇంటి నడుమ నిలబడి ఉన్నాడు సృజన్.

వాళ్ళు ధ్వంసంచేస్తుంటే తనెందుకలా రాతిబొమ్మలా ఉన్నాడో అర్థం కావటంలేదు. ఆమెకు ఒకటే మాట చెవుల్లో మారుమ్రోగుతోంది.

"పిట్టను కాల్చినట్టు కాలుస్తాం."

దాదాపు ఇంటిలోని సామానంతా ధ్వంసం కాబడింది. రవి అంతకుముందు ఇచ్చిన డబ్బు బొడ్లో దాచుకుంది కాబట్టి సరిపోయింది. లేకుంటే అవి సైతం తీసుకుపోయేవారే. ఆమెకు ఏం చేయాలో అర్థం కావటంలేదు.

ఇలా పదే పదే వాళ్ళు రావటం జరిగితే....ఆ తర్వాత రోజులెలా గడపాలనే సమస్య ఉదయించింది....

"మానవత్వం ఎలుక కొందువు. పిల్లి వుంటుంది కనుకనా."

రవి మాటలే ఆమెకు గుర్తొస్తున్నాయి.

తర్వాత రెండు రోజులకే బాకీలన్నీ కట్టేసి వేరే చోటికి వెళ్ళిపోయారు. వెళ్ళేముందు రేణుక యింటి ఓనర్‌కు చెప్పింది.

"ఓ వేళ ఆయన రావటం జరిగితే మా విషయం చెప్పండి. ఇంకెవరు అడిగినా దయచేసి చెప్పొద్దు."

ఆ ఇల్లు ఖాళీచేసి బయటపడ్డాక, వున్న డబ్బుతోనే జీవించటం ప్రారంభించారు. దాదాపు రెండు నెలలు గడిచిపోయాయి. ఈ లోపు రెండుసార్లు సృజన్ పాత ఇంటికి వెళ్ళి వచ్చాడు. 'రవి' రాలేదని చెప్పారు.

ముఖ్యంగా అడవి ప్రాంతాలన్నీ కల్లోలంగా మారిపోయాయి. యెక్కడో చోట భూస్వామి హత్య చేయబడ్డాడనో బాంబులు పేలాయనో వార్తలు వస్తున్నాయి. పోలీసు నిఘా తీవ్రతరమయింది. వారి రహస్యాలకోసం ఎందరో అమాయకుల్ని బలిపెడుతున్నారు.

రవి జాడ మాత్రం తెలియలేదు.

# 6

రవి ఇచ్చిన డబ్బు అయిపోయింది. ఏం చేయాలో అర్థం కావటంలేదు. సృజన్ కాలేజీకి వెళ్ళటం మానేశాడు. పోలీసులు ఇంటికి వచ్చిన నాటినుండి అతనిలో అంతులేని మార్పు వచ్చింది. ప్రతిక్షణం దేన్ని గురించో ఆలోచిస్తున్నట్లు కనపడతాడు. గడ్డం బాగా పెరిగిపోయింది. అలాంటి స్థితిలో కొడుకును చూసినా ఆమెకు

స్పృజన్‌లో యేదో వెలుగు కనబడుతోంది. ఇప్పుడిప్పుడే యవ్వనంలోకి అడుగుపెడుతున్నాడు స్పృజన్. ముఖంలో లేతదనం ఇంకా పోలేదు.

మెరుస్తున్న కళ్ళు, కొనదేరిన నాసిక, నొక్కుల జుత్తు యెంతో అందంగా కనిపిస్తాడు. కానీ స్పృజన్ జీవితం యెలా ఉంటుందో అర్ధంకావటంలేదు.

రేణుకకు రవి వెళ్ళే రోజు అతని మిత్రుల గురించి చెప్పిన విషయం జ్ఞాపకం వచ్చింది.

స్పృజన్‌కు వారి అడ్రసులిచ్చింది. వారిలో యెవరి నయినా కలుసుకొని నాన్నగారి గురించి కనుక్కొని, పరిస్థితి చెప్పి, డబ్బేమయినా యిస్తే తీసుకురా అని పంపింది.

అడ్రసులు తీసుకొని బయలుదేరాడు స్పృజన్. ఆ అడ్రసు తాలూకు ఇంటిముందు ఆగాడు. అదో పెద్ద భవనం. దాన్ని చూడగానే ఆశ్చర్యపోయాడు. నాన్నకిలాంటి స్నేహితులున్నారా అనుకున్నాడు.

"క్యాహోనా" ఘూర్కా అన్నాడు.

"రాజారావుగార్ని కలుసుకోవాలి."

"నీ పేరు."

"స్పృజన్."

"ఠీక్. కనుక్కొస్తా."

"రవిగారబ్బాయని చెప్పు."

అతను లోనికెళ్ళాడు.

ఆ భవనం తాలూకు అందాలు చూస్తుండిపోయాడు.

ఘూర్కా వచ్చి...."అందర్ జావ్" అన్నాడు.

లోనికి అడుగుపెట్టాడు. ముఖద్వారం దాటేక పైకి పోటానికి మెట్లున్నాయి. మెట్లకు కుడిప్రక్కగా ఓ గది

ఉంది. దానిలోనుండే శబ్దాలు వస్తున్నాయి. అటువైపు నడిచాడు. తలుపు వేసివుంది. తట్టాడు సంశయంగానే.

"రా" గంభీరంగా వినిపించింది.

లోనికి అడుగువేశాడు సృజన్—తలుపు తెరుచుకొని.

"నువ్వు రవి కొడుకువేనా?" ఒకాయన అడిగాడు.

తలూపాడు.

"ఏమిటి?"

"నాన్న గురించి తెలుసుకుందామని."

"మీ నాన్న గురించి మాకేం తెలుస్తుంది."

"నాన్న మీ అడ్రసిచ్చారు."

"ఎందుకు?"

"ఏమైనా అవసరమైతే కలుసుకొమ్మని."

"ఏ అవసరం?"

సృజన్‌కు విసుగేసింది. వాళ్ళలో ఓ రకమైన నిర్లక్ష్యం కనిపిస్తోంది. వీరితో తన తండ్రికి యే రకమైన స్నేహం ఉందో తెలియటంలేదు. ఆ భావాల్ని తన మొఖంలో కనపడకుండా జాగ్రత్తపడ్డాడు.

"కొంచెం డబ్బు కావాలి."

అతను ఒక్కసారిగా అసహ్యంగా చూశాడు. ప్రక్కన ఇంకా ఇద్దరున్నారు. ఇందాకటినుండి వారు మెల్లగా గ్లాసులో ఉన్న మందు త్రాగుతూ వింటున్నారు. వారి కళ్ళు కూడా సృజన్ వంక యేహ్య భావంతో చూస్తున్నాయి.

అతను జేబునుండి రెండు వంద కాయితాలు తీసి ఇచ్చాడు.

సృజన్ అందుకున్నాడు.

"ఇంకెప్పుడూ ఇలా రాకు" కంగున మ్రోగింది అతని

కంఠం....

సృజన్‌కు అంతులేని అవమానమనిపించింది.

"నీ నాన్న ఇంకెవర్ని కలవమన్నాడు."

"రమణ....రఘు."

"వాళ్ళిక్కడే ఉన్నారు. వాళ్ళింటికి కూడా వెళ్ళకు. యేదో పనిచేసి బ్రతకటం నేర్చుకో. మీ బాబుకెటూ బ్రతకటం చేతకాదు" అన్నాడు.

సృజన్ తీక్షణంగా చూశాడు అతనివంక.

"నువ్వు వెళ్ళవచ్చు."

ఆ కాయితాలు విసిరి ఆయన మొఖంమీద కొడదామనుకున్నాడు. బలవంతాన నిగ్రహించుకున్నాడు.

గిరుక్కున వెనక్కు తిరిగాడు.

గ్లాసుల శబ్దంతో పాటు తిడుతున్న శబ్దాలు వినిపిస్తూనే వున్నాయి.

కోపంగా వచ్చిన బిడ్డను చూసి అడిగింది రేణుక.

"బాబూ, వెళ్ళి వచ్చావా?"

"వెళ్ళాను."

"నాన్నగారు...." ఆగిపోయిందామె.

"ఆయన సంగతి తెలియదు కానీ ఇంకోటి చూశాను."

"ఏం చూశావ్."

"విప్లవాన్ని."

"బాబూ."

"అవును, ఖచ్చితంగా విప్లవాన్నే. మందు విప్టవాన్ని."

"నువ్వు మాట్లాడేదేమిటో నాకర్థం కావటంలేదు."

సృజన్ తమాయించుకున్నాడు.

"ఇవిగో ఇవిచ్చి, మరెప్పుడూ రావద్దని చెప్పారు."

రెండువందలిచ్చాడు.

వాటివంక అయోమయంగా చూసింది రేణుక.

"పని చేసి బ్రతకటం నేర్చుకొమ్మన్నారు."

"బాబూ" రేణుక గొంతులో అపశ్రుతి.

"బాధపడకమ్మా వాళ్ళు నిజం చెప్పారు. నేనుండగా ఎవరో్న డబ్బు అడుక్కోవటం నేరంకదూ. నాకు ఒకటే విషయం అర్థం కావటంలేదు. కనీసం సాను భూతి లేకుండా మాట్లాడారు. వారితో నాన్నకుగల సంబంధం ఏమిటి?"

"ఏమో నాకు తెలియదు బాబూ."

# 7

సృజన్ గుండెలు బిగబట్టుకొని ఆ వార్త చదువు తున్నాడు.

విప్లవకారుల అరెస్టు!

"నిన్న పోలీసులు అకస్మాత్తుగా జరిపిన దాడివల్ల విప్లవకారులుగా చెప్పబడుతున్న కొందరు దొరికి పోయారు. వారంతా తమ రహస్య స్థావరంలో నాటు బాంబులూ, తుపాకులు తయారు చేస్తుండగా పట్టుబడి పోయారు. పట్టుబడిన వారిలో రవి అనే ప్రముఖ విప్లవకారుడు....అతని అనుచరులు ఉన్నారు. వీరిలో లోగడ ధర్మారావ్ అనబడే భూస్వామి హత్యలోనూ, మరికొన్ని దోపిడీలతో, హత్యల్తో సంబంధం ఉందని తెలుస్తోంది. వీరికోసం పోలీసులు తీవ్రంగా గాలిస్తు న్నారు. తుదకు వారిని నేడు పట్టుకోవటం జరిగింది."

సృజన్‌కు నోటివెంట మాటరావటంలేదు.

మెల్లగా లేచి ఇంటివైపుకు నడిచాడు. ఈ విషయం తల్లితో చెప్పాడు. అంతే ఆమె ఒక్కసారిగా విరుచుకు

పడిపోయింది. సృజన్‌కు ఏం చేయాలో అర్థంకాలేదు. కంగారుగా నీళ్ళు తీసుకొచ్చి తల్లి మొఖంమీద చల్లాడు. ఆమె తేరుకుంది. ఆ వార్తను 'అసాంతం' చదివి రోదించటం మొదలుపెట్టింది.

"అమ్మా, యేడవకు" సృజన్ వెక్కుతూ అన్నాడు.

"నీకు తెలియదు బాబూ. ఇంక మీ నాన్న మనకు దక్కడు."

"అమ్మా."

"అవున్రా. ఆ రోజు పోలీసులేమన్నారు. పిట్టను కాల్చినట్లు కాలుస్తానన్నారు. గుర్తుందా?"

"అమ్మా."

"బాబూ.... వెంటనే వెళ్ళు.... ఆ రాజారావుగారితో మాట్లాడిరా. నాన్నగారిని ఎలా అయినా విడిపించమని చెప్పు. వాళ్ళ కాళ్ళు పట్టుకో. వెళ్ళిరా" ఏడుస్తోంది.

"అమ్మా" సంశయంగా అన్నాడు.

"వెళ్ళు బాబు. త్వరగా వెళ్ళు."

సృజన్ ఇంక ఏం ఆలోచించలేదు.

రాజారావు బిల్డింగ్స్ ముందు ఘూర్ఖా హైరో.... హైరో అంటూ అరుస్తున్నాడు. సృజన్‌కవేం వినిపించటంలేదు. రాజారావు యేవో కాయితాలు చూసుకుంటున్నాడు.

"సార్!"

"ఎవరు?" అంటూ చూశాడు.

"ఏమిటి?" కఠినంగా అన్నాడు.

"సార్, మా నాన్నను పోలీసులు పట్టుకున్నారు."

"అయితే."

"నాన్నని మీరు కాపాడాలి!"

"అది నావల్ల ఎలా అవుతుంది?"

"సార్ మీరు తలుచుకుంటే చెయ్యగలరు. సార్ మా నాన్న లేకపోతే మా అమ్మ చచ్చిపోతుందండి. మీరెలాగయినా సాయం చేయాలి" సృజన్ కంఠంలో యేడుపుజీర.

"నేనేం చెయ్యగలనయ్యా" ఆయన కంఠంలో చాలా స్పష్టంగా విసుగూ, కోపం వ్యక్తం అవుతున్నాయి. బయట ఘూర్ఖా లోపలకు రావాలా, వద్దా అనేది తేల్చుకోలేక చేతులు నలుపుకుంటున్నాడు.

సృజన్ అమాంతం ఆయన కాళ్ళమీద పడ్డాడు.

"మీరెలా అయినా నాన్నని రక్షించండి."

భోరున యేడుస్తున్నాడు.

"లే.... లే" దాదాపు అరిచాడు.

"చూడు బాబు. మీ నాన్నమీద ఖూనీ కేసులున్నాయి. నాటు బాంబులు తయారు చేస్తున్నాడనీ ఆరోపణలున్నాయి. కాబట్టి మేం చేయగలిగిందేం లేదు. మీ నాన్న నిర్దోషయితే ప్రభుత్వంవారే వదిలేస్తారు. వెళ్ళు."

"సార్!"

"గెటవుట్ బడ్డీ....ఇదివరకోసారి చెప్పాను. ఈ ఇంటి ఛాయలకు రావద్దని. మీ బాబుతోపాటు మమ్మల్నికూడా ఇరుకో(?)మంటావా? ఇదేమన్నా క్రిమినల్ కేసా? వాళ్ళంతా విప్లవకారులు. యేమైనా మాట్లాడితే అందర్నీ తోస్తారు. దిసీజ్ ది లాస్ట్ వార్నింగ్. ఇంకెప్పుడూ ఇలా రాకు. దేఖో సింగ్ డోంట్ ఎలౌ దిస్ ఫెలో ... గెటవుట్" అరిచాడు కోపంగా.

సృజన్ నిరుత్తరుడయ్యాడు.

ఓ క్షణం చూశాక.

"సింగ్" అరిచాడు రాజారావు.

"అవసరంలేదు."

సృజన్ బయటకు నడిచాడు.

రఘు ...రమణలనుండికూడా అదేవిధమైన రెస్పాన్స్. వారి కళ్ళలో ప్రతిబింబించిన అసహ్యాన్ని జీవితంలో తొలిసారిగా చూస్తుండిపోయాడు. మనుషుల్లో ఉన్న వివిధ రకాల ప్రవృత్తుల్ని అర్థం చేసుకోవటానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు. తనకు తెలియకుండానే మంచు హస్తమేదో గుండెల్ని ప్రాకుతోంది.

సృజన్ హృదయం కరడుగట్టుకుపోతోంది!

నిరాశగా ఇంటికి తిరిగి వచ్చాడు. కళ్ళలో వత్తులు వేసుకు చూస్తున్న అమ్మ ముఖం పాలిపోయి వుంది. శవాన్ని గోడకు నిలబెట్టినట్టుంది. నిస్తేజమైన ఆ కళ్ళలో ఎక్కడో చిగురంత ఆశ తళుక్కుమంటోంది.

"బాబూ."

సృజన్ ఓసారి తల్లివంక చూసి తలక్రిందకు దించుకున్నాడు.

"ఏమన్నారు?"

"నాకు ముందే నమ్మకంలేదు. నీ మాట కాదనలేక వెళ్ళాను."

"అఁ" ఒక్కసారిగా భరించలేనంతగా నిరాశ, నిస్పృహలు గుండెల్ని ఆవరించగా ఆమె చేత్తో గుండెల్ని రాసుకుంటూ కూలిపోయింది.

"అమ్మా" అంటూ ఆర్తనాదం చేశాడు సృజన్.

# 8

ఎదురు కాల్పుల్లో మరణం!

"నిన్న అరెస్టు చేయబడ్డ విప్లవకారుల్ని రాజధానికి

తరలిస్తున్న సందర్భంలో పారిపోవటానికి విఫలయత్నం జరిగింది. ప్రముఖ విప్లవకారుడు రవి, తన అనుచరులతో పోలీసుల దగ్గర తుపాకి లాక్కొని అడవుల్లోకి పరిగెత్త బోగా పోలీసు బలగం వెంటాడింది. ఆ సందర్భంగా ఇరుపక్షాలనుండి తీవ్రమైన పోరాటం జరిగింది. ఆ పోరా టంలో ఇరువురు పోలీసులు గాయపడ్డారు. రవి అతని అనుచరులు ఈ కాల్పుల్లో మరణించారు....”

పేపరులోని వార్త చదవటం పూర్తయింది. అయినా సృజన్‌లో యెలాంటి కదలిక లేదు. అతని కళ్ళవెంట నీళ్ళు రావటంలేదు. ఆ వార్తలోని సత్యాసత్యాలను గురించి అతను ఆలోచించటంలేదు. నిన్నటినుండి “కోమా”లో ఉండిపోయిన తల్లివంక చూస్తున్నాడు.

ప్రభుత్వ ఆసుపత్రిలో ఓ మూలగా పడుకున్న ఆమెను చూస్తున్నాడు. ఆమెకింతవరకు బెడ్ లభించనే లేదు. అక్కడి డాక్టర్లు, నర్సులూ, సిబ్బంది మూర్తీభవించిన నిర్లక్ష్యానికి ప్రతీకగా ఉన్నారు.

వారిని సంతృప్తిపరచటానికి సృజన్ దగ్గర డబ్బు లేదు.

డాక్టరొకాయన తన వార్డునుండి నడిచి వస్తున్నాడు.

“సార్....సార్” సృజన్ అతనివెంట ప్రాధేయ పడ్తూ అడుగుతున్నాడు.

ఆయన ఆగి ఓ క్షణం సృజన్ వంక చూశాడు.

సృజన్ని చూడగానే నిర్లక్ష్యంగా వెళ్ళలేక పోయాడు.

“యస్” అన్నాడాయన ప్రశ్నార్థకంగా.

“నా మదర్ నిన్నటినుండి స్పృహ లేకుండాపడుంది. ఇంతవరకూ బెడ్ యివ్వలేదు. అసలు యెవరూ పలకటం

లేదు. ఓసారి చూస్తారా" ఆశగా అడిగాను.

ఆయన రేణుక దగ్గరకు నడిచాడు.

నాడిపట్టుకు చూశాను.

కంగారుగా స్టెతస్కోపు తగిలించుకొని గుండెలమీద ఉంచాడు.

ఒకసారి నిట్టూర్చాడు.

సృజన్ కంగారుగా చూస్తున్నాడు.

"ఐయామ్ వెరీ సారీ" అన్నాడు.

సృజన్ కళ్ళు నిర్జీవంగా చూస్తున్నాయి.

"షి ఈజ్ డెడ్."

సృజన్ బిగుసుకుపోయాడు.

డాక్టర్ భుజం తట్టాడు.

"ఆమెను పోస్టుమార్టం చేశాక సాయంకాలం శవం అప్పగిస్తారు."

సృజన్ నవ్వాడు.

"దేనికి సార్. ప్రతిఘటించగా పలకరించనివారు చచ్చాక పోస్టుమార్టమ్ అంటూ శవాన్ని కోస్తారెందుకు సార్. ఆమె గుండె కోత యెప్పుడో మొదలయింది. ఈ కోత మీరు కోయాల్సిన పనిలేదు డాక్టర్. కానీ డాక్టర్ ఇక్కడకు వచ్చేది మనుషులే డాక్టర్. ఈ నర్సులు.... ఈ డాక్టర్లు .... యిక్కడ సిబ్బంది వాళ్ళకి గుండెలున్నాయా? ముందా విషయం పోస్టుమార్టం చేసి కనుక్కోండి. ఇక్కడకు వచ్చేవాళ్ళకు మందులివ్వకపోయినా కనీసం చల్లని మాటయినా మిగల్చండి సార్."

ఆయనకు ఏం మాట్లాడాలో తెలియలేదు.

"ఐయాం సారీ" అని మాత్రం అన్నాడు.

"ఇక్కడ మిమ్మల్నొకర్నే చూశాను. మీకు గుండె

ఉందనిపిస్తోంది. సార్ నాకు హెల్ప్ చెయ్యగలరా? నా గుండెను తొలగించండి. జాలి, మమత, మానవత్వం ఇవేవీ ఈ గుండెను చేరనీయకుండా ఆపరేట్ చెయ్యండి సార్" సృజన్ స్వరంలోని తీక్షణతకు అతను దిగ్భ్రమ చెందాడు.

"కంట్రోల్ యువర్ సెల్ఫ్."

భుజంతట్టి వెళ్ళిపోయాడాయన.

సృజన్ తల్లివంక చూశాడు.

నిశ్చలంగా నిద్రపోతున్నట్లుంది ఆమె.

ఆమె మీదికి వాలిపోయాడు.

ఎవరో తట్టిలేపుతుంటే మెలకువ వచ్చింది.

ఎదురుగా "స్ట్రెచ్చర్" వుంది.

దానిమీద రేణుకను తీసుకెళ్ళిపోయారు.

శవాల గదిలో రేణుక శవం ఉంది.

ఆ శవాన్ని బయటికు తెచ్చి దహనం చెయ్యాలి. ఎలా?

ఇంట్లో మిగిలిన సామానంతా మూటకట్టుకొని మార్కెట్‌కెళ్ళాడు సృజన్. మొత్తం లెక్కకట్టి వంద రూపాయలు ఇస్తానన్నాడు మార్వాడీ. మనిషి అవసరాన్ని మరో మనిషి ఎలా ఉపయోగించుకుంటాడో అర్థమయింది.

డబ్బు తీసుకున్నాడు.

ఇంటికి చెందినాయన నలుగుర్ని తీసుకొచ్చాడు.

వాళ్ళు శవాన్ని ఎత్తుకున్నారు.

స్మశానంలో తీసుకెళ్ళి దించారు.

కొరివి చేత్తో అందుకున్నాడు.

"అమ్మా....ఇన్ని సంవత్సరాలు నన్ను నీ కళ్ళలో

పెట్టుకు సాగావు. నాకోసం కన్నీరు కార్చావు. నాకోసం ఆరాటపడ్డావు. కానీ ఈ రోజున నీకు నిప్పు అంటి స్తున్నాను. అమ్మా ఒక్క విషయంలోనే నువ్వు అదృష్ట వంతురాలివి.... నాన్న పోయాడనే వార్త నీ గుండెల్ని బ్రద్దలు చేయకముందే వెళ్ళిపోయావు. నన్ను మాత్రం మిగిల్చావు."

"అంటించు బాబు" అంటున్నారెవరో.

కొరివి అంటించాడు.

గుప్పున ఎగిశాయి మంటలు.

సృజన్ ఈ లోకంలో లేడు.

అతని ముఖంలో యే భావాలూ కనపడటంలేదు.

నాలుకలు చాచుకొని మండుతున్న ఆ మంటలు సృజన్ హృదయంలోని మిగిలివున్న మానవత్వపు ఛాయల్ని దహించి వేస్తున్నాయి.

అలా ఎంతసేపున్నాడో తెలియదు.

ఎవరూ లేరు. అందరూ వెళ్ళిపోయారు.

ఆకాశంలో చందమామ వెలుగులు విరజిమ్ముతోంది.

స్మశానంలో తనొక్కడు మిగిలాడు.

బూడిదగా మారిన 'అమ్మ' వుంది.

## 9

"ఇంకా పడుకోలా" అన్నం పెట్టినతను అంటున్నాడు.

ఉలిక్కిపడ్డాడు సృజన్.

"చల్లంగా వుంది. పడుకోరాదూ."

సృజన్‌కు చల్లదనం అనుభూతి కలగటంలేదు.

శరీరం మహా వేడిగా వుంది.

కళ్ళు మూసుకున్నాడు. నిద్ర పట్టేసింది.

సూర్యకిరణాలు మొఖంమీద పడుతుంటే బద్ధకంగా లేచాడు. దాదాపు తొమ్మిదిగంటలవుతోంది. లేచి ఓ పుల్ల విరుచుకొని పళ్ళు తోముతూ వెళ్ళాడు. పైపు దగ్గరకు వెళ్ళి మొఖం కడుక్కున్నాక కొంచెం రిలీఫ్ ఫీలయ్యాడు. ప్రపంచమంతా ప్రశాంతంగా వున్నట్లనిపించింది.

మెల్లగా నడవటం ప్రారంభించాడు.

తన ప్రక్కనుండి ఓ కారు దూసుకుపోయింది.

సృజన్ నిర్లక్ష్యంగా నడుస్తున్నాడు.

వెంటనే ఆ కారు రివర్స్ అయి వచ్చింది.

డ్రైవింగ్ సీట్లో ఒకాయన కూర్చుని వున్నాడు.

అక్కడినుండే వంగి డోర్ తెరిచి "గెటిన్" అన్నాడు.

సృజన్ లిప్తపాటు శంకించాడు.

మరుక్షణం కారు యెక్కటం, తలుపులు మూసుకోవటం.... కారు కదలటం ఒక్కసారే జరిగాయి.

సరాసరి కారు వెళ్ళి "సెలూన్" ముందు ఆగింది.

"దిగు."

సృజన్ దిగాడు.

"కమాన్."

లోనికి నడిచారు. సృజన్ వంక అదోలా చూస్తూ, సెలూన్ ప్రొప్రయిటర్ సాదరంగా ఆహ్వానించాడు.

"క్రాఫ్ చేయించు."

"స్పెషలా."

"యస్ నాకు షేవ్ చెయ్యి" అన్నాడాయన.

సృజన్ వెళ్ళి కూర్చున్నాడు. మెత్తటి కుషన్ ఛెయిర్

ఎయిర్ కండీషన్డ్ సెలూన్ అది. స్టీరియోలో హిందీ పాట వినపడుతోంది.

ఒకతను దగ్గరకొచ్చి "ఎలా చేయమంటారు" అనడిగాడు.

"రాజూ....నువ్వాగు" అన్నాడు ప్రొప్రయిటర్.

అతనే స్వయంగా వచ్చాడు. దాదాపు గంట టైము తీసుకున్నాడు. బాగా డ్రై చేసి, ముఖం నీళ్ళతో కడిగి పౌడర్ వేశాడు.

"తలంటుకున్నాక మళ్ళీ రండి డ్రై చేద్దాం" అన్నాడాయన.

"ఓ.కె. సార్. మీరు లేవొచ్చు."

వెంట్రుకలు కనపడకుండా శుభ్రంగా క్లీన్ చేశాడు.

సృజన్ 'అతని' ముందుకొచ్చి నిలబడ్డాడు.

ఆయన లేచి నిలబడుతూ షాపు ఓనర్ చేతిలో డబ్బు ఉంచటాన్ని గమనించాడు సృజన్.

తిరిగి కారులో ఎక్కారు.

ఈసారి వెళ్ళి పెద్ద రెడీమేడ్ షాపు ముందాగింది.

ఇద్దరూ దిగారు.

సృజన్ కొలతలు తీసుకోవటానికి ఓ మనిషి రావటం జరిగింది.

"అతను" గబగబ రాక్ అంతా పరిశీలించి నాలుగు జతలు సెలక్టు చేశాడు. ఓ పాకెట్ బనీన్లు మరో పాకెట్ డ్రాయర్లు తీసుకున్నాడు.

"అర్జెంటుగా ఈ కొలతలకు సరిపోయే జీన్స్ యివ్వండి. నెక్స్ట్ ఆ బట్టలు రెండు రోజుల్లో తయారు చేసి ఇవ్వండి" అన్నాడు.

"అలాగే సార్. సాయంకాలం ట్రయల్ ఇస్తాను."

"వెరీగుడ్" అన్నాడు వాలెట్ తెరుస్తూ.

సృజన్‌కంతా ఆశ్చర్యంగా వుంది.

కొన్ని వందల కాయితాల్ని నిర్లక్ష్యంగా ఇచ్చాడు. పాకెట్లు తీసుకొని కారులో పడేశాక, గుర్తు వచ్చిన వాడిలా "కమాన్" అన్నాడు ప్రక్కనే ఉన్న షూ స్టోర్స్‌లోకి నడుస్తూ.

రెండు మూడు రకాలు చూశాక లేటెస్టువి సెలక్టు చేశాడు.

నాలుగు జతల సాక్స్‌తోసహా పాక్ చేయించాడు.

ఇద్దరూ కారెక్కారు. పెద్ద స్టార్ హోటల్ ముందు కారాగింది.

'బాయ్' వచ్చి పాకెట్స్ అందుకున్నాడు.

లిఫ్ట్‌లో రూమ్‌కెళ్లారు.

తాళంతీసి తలుపు నెట్టాడు.

కండిషన్ చేయబడ్డ చల్లటిగాలి మృదువుగా తాకింది.

లోనికి అడుగువేశాడు ఉక్కిరి బిక్కిరి అవుతూ.

"నువ్వు వెళ్ళి స్నానంచేసిరా" అన్నాడు బాత్ రూం చూపిస్తూ.

సృజన్ లోనికెళ్ళాడు. బాత్‌రూం అద్దంలో తన మొఖం చూసుకొని ఆశ్చర్యపోయాడు. అప్పుడే తనలో అంతులేని మార్పు కనబడుతోంది.

అసలిదంతా ఆశ్చర్యంగా వుంది. ఆయనెవరు? యెందుకిలా చేస్తున్నాడు? ఏం అర్థం కావటంలేదు. బాత్ టబ్ వుంది. దానిలో పడుకున్నాడు. చల్లగా నీరు తగులుతుంటే. అంతులేని ఆనందంగా వుంది. కొంచెంసేపు శరీరం నానాక ఉండలు ఉండలుగా మట్టి రావటం జరుగుతోంది.

ఎగ్ షాంపోతో తల శుభ్రంగా రుద్దేశాడు. శరీర మంతా తోమి తోమి స్నానం చేశాడు. క్రొత్త టవల్ స్టాండ్ మీదుంది. ఇప్పుడు శరీరం కాంతితో మెరుస్తోంది. తల తుడుచుకుంటూ బాత్ రూంలో నుండి బయటకు వచ్చాడు.

ఆయన సిగరెట్ కాలుస్తూ కూర్చుని వున్నాడు.

"డ్రెస్ చేసుకో" అన్నాడు.

పాకెట్స్ విప్పి డ్రెస్ చేసుకున్నాడు. జీన్స్ కరెక్టుగా సరిపోయాయి. అద్దంముందు నిలబడి చూసుకుని ఆశ్చర్యపోయాడు. తనింత అందంగా ఉంటాడనే విషయం మొదటిసారి తెలుసుకున్నాడు. జుట్టంతా చిక్కులు విడిపోయి, పాయలు పాయలుగా ఉండి హాయిని కలిగించింది. పౌడర్ తీసి లైట్ గా అద్దుకున్నాడు.

"కమాన్" అన్నాడాయన.

సర్వర్ అప్పుడే రెండు మీల్స్ తెచ్చి ముందుంచాడు.

"తిను."

సృజన్ మాట్లాడకుండా తింటాని కుపక్రమించాడు. సృజన్ కిష్టమయిన నాన్ వెజిటేరియన్ ఫుడ్ అది. చాలా రుచిగా ఉంది. కడుపునిండా తినేశాడు. ఆ తర్వాత బోయ్ వచ్చి క్లీన్ చేశాడు.

సృజన్ కళ్ళు మూతలుపడుతున్నాయి.

"నిద్ర వస్తుందా?"

"ఆఁ లేదు. లేదు."

"పర్వాలేదు. పడుకో."

సృజన్ మాట్లాడకుండా వెళ్ళి బెడ్ మీద పడుకున్నాడు. మెత్తగా ఉందది.

ఆయన సిగార్ వెలిగించుకుంటూ ఓ స్విచ్ ఆన్ చేశాడు.

మెల్లగా సంగీతం మొదయింది.

ఆ శబ్దాలు జో కొడుతుండగా సృజన్ నిద్రలోకి జారిపోయాడు.

సృజన్ లేచేటప్పటికి ఆయన యేవేవో కాయితాలు చూసుకుంటున్నాడు. సృజన్ లేచి బాత్‌రూంలోకి వెళ్ళాడు. మొఖం కడుక్కుని వచ్చాడు. బట్టలు కొంచెం నలిగి వట్లున్నాయి.

"సాయంకాలం నాలుగు లుంగీలు తెచ్చుకుందాం" అన్నాడు ఆయన సృజన్ని చూస్తూ. అంతకుముందే ఆర్డరిచ్చాడు కాబోలు లైట్ టిఫిన్, పొగలు క్రక్కుతున్న టీ వచ్చింది. అవి తీసుకున్నాక.

"బయటకు వెళదాం" అన్నాడు.

కారులో బయలుదేరారు. సృజన్ కారులోనుండి బయట ప్రపంచాన్ని చూస్తున్నాడు. నేటి జీవితానికి, నిన్నటి జీవితానికి నడుమ తేడాను గమనిస్తున్నాడు. ఇదంతా కలలా వుంది. కానీ అది కలకాదు. వాస్తవం. ఆ సంగతి సృజన్‌కు తెలుస్తూనే ఉంది.

"ఏమిటి ఆలోచిస్తున్నావు."

"ఏమీ లేదు. నిన్నటికీ నేటికీ తేడా గురించి."

ఆయన నవ్వాడు.

"పెట్టుబడిదారీ ప్రపంచంలోని అద్భుతాలివి. ఇక్కడ ఏం జరిగినా అర్ధరాత్రే జరుగుతుంటాయి."

"కానీ నా జీవితంలో పట్టపగలే ఈ మార్పు జరిగింది. మీ కభ్యంతరం లేకుంటే మీ రెవరో నేను తెలుసుకోవచ్చా."

"ఐయాం రాబర్ట్" అన్నాడు బ్రేక్ వేస్తూ.

అప్పుడు చూశాడు. పెద్ద ధియేటర్ ప్రాంగణంలోకి వచ్చి ఆగింది కారు. ఇద్దరూ దిగారు. అందులో ఇంగ్లీషు సినిమా ఆడుతోంది. మార్షల్ ఆర్ట్సుకు చెందిన ఇంగ్లీషు సినిమా.

"ఎవరీ రాబర్టు" అనుకుంటూ లోనికి నడిచాడు.

ఆ చిత్రం నిండా కరాటే, కుంగ్ ఫూయొక్క ప్రాధాన్యత కనబడుతోంది. ఆ వ్యక్తుల కదలికల్లో వేగం, సమయస్ఫూర్తి. సృజన్ని విపరీతంగా ఆకర్షించాయి.

సినిమా వదిలాక హోటల్ కెళ్ళారు.

"డ్రెస్ .... ఛేంజ్ చేసుకో .... నువ్వు చూడాల్సిన వింకా ఉన్నాయ్."

రాబర్టు ఫారిన్ స్ప్రే చల్లుకున్నాక సృజన్ కందించాడు.

గదంతా పరిమళభరితం అయింది.

రూమ్ లాక్ చేసి క్రిందకు నడిచారు.

# 10

ఓ మూలగా రిజర్వ్ చేయబడిన సీట్లలో ఇద్దరూ కూర్చున్నారు. "స్టీవార్టు" వచ్చాడు ఆర్డర్ బుక్ తీసుకొని.

"టు ఆమ్లెట్స్ .... చిప్స్ .... కూల్ డ్రింక్స్."

విచిత్రంగా వారివంక చూసి వెళ్ళిపోయాడు.

స్టేజిమీద ఆర్కెస్ట్రా వుంది. అత్యంత ఆధునికమైన ఇన్స్ట్రుమెంట్సున్నాయక్కడ. సంగీతం మొదలయింది. ఓ గాయకుడు పాడుతున్నాడు మధురంగా. అతని ప్రక్కన ఓ గాయని వుంది. ఆమె కొంచెం లావుగా వున్నా అందంగానే కనిపిస్తోంది. పైగా యుక్త వయ

సుఖో సైతం వున్నట్లనిపించుతుంది. ఆ పాట ఆగాక కేవలం ఆర్కెస్ట్రా మాత్రమే పనిచేయటం ఆరంభించింది. గిటార్ ధ్వనులు వింత అనుభూతిని కలిగిస్తున్నాయి.

లిఫ్ట్‌లో ఓ ఆర్టిస్టు వచ్చింది.

"మిస్ రీటా."

ఆర్కెస్ట్రా తీవ్రస్థాయి నందుకుంది.

డయాస్ మీద ఒక్కసారిగా ప్రత్యక్షమయింది.

"హాయ్" అరుస్తున్నారెవరో.

ఆమె అయిదు నిమిషాలు నర్తించి డయాస్ దిగింది. అందరి టేబుల్స్ వద్దకూ వచ్చి తన అంగాల్ని ప్రదర్శిస్తోంది.

ఇంతలోనే మరో నర్తకి, ఆ తర్వాత మరొకరు వచ్చి వరుసగా అందర్నీ విష్ చేయటానికొస్తున్నారు. వారు మృదువుగా తప్పించుకుంటూ వస్తున్నారు.

అందర్నీ విష్ చేశాక కార్యక్రమం మొదలయింది.

రీటా డ్యాన్స్ మొదలయింది. "ముజ్రా" డ్యాన్స్. ఖాన్ పాడుతున్నాడు. అనుగుణంగా అడుగులు వేస్తోంది. చూస్తున్న జనమంతా వెర్రెక్కిపోతున్నారు. వందలూ, యేభైలు వుండలు చుట్టి విసురుతున్నారు. అవేవీ ఆవిడ నిమగ్నతను చెడగొట్టడం లేదు.

సృజన్ కూర్చున్న టేబుల్ వెనుక అద్దం వుంది. దాని వెనక గది వుంది. అటువైపు యధాలాపంగా చూశాడు.

లోపలనుండి త్రాగుతూ మాస్తున్నారు ముగ్గురు. వారి నడుమ బికినీలో ఓ యువతి వుంది. ఆమె వారి నడుమ కూర్చుని ఇరువురి భుజాలమీద చేతులు వేసి గలగలమంటూ

మాట్లాడుతోంది.

ఆమె భుజంమీద చెయ్యి వేసింది రాజారావ్!

ఆ ప్రక్కన వున్నది "రమణ" "రఘు."

స్పృజన్ శరీరం సలసలా కాగసాగింది.

"కంట్రోల్ మై బోయ్" అన్నాడు రాబర్ట్ భుజం తడుతూ.

"ఆమ్లెట్ తిను."

సీరియస్‌గా ఆమ్లెట్ తినటం ప్రారంభించాడు. క్షణాల్లో అయిపోయింది. వెంటనే కూల్ డ్రింక్ త్రాగేశాడు. కళ్ళు ఎర్రగా వున్నాయి.

స్టేజివంక చూశాడు.

చివరి అంశం....మ్యూజిక్ తారస్థాయి నందుకుంది.

శరీరంమీద ఒక్కొక్కటీ వలిచేస్తుంది.

ఎదురుగా కూర్చుని చూస్తున్న తల నెరిసిన మనిషి వుద్రేకంగా చూస్తున్నాడు. వారివంక చూస్తూ రెచ్చగొడుతోంది.

"వా, వా, వా" అరుస్తున్నాడు.

లైట్లు వెలుగుతూ ఆరిపోతున్నాయి.

ఆ వెలుగులో కనిపించీ కనిపించక మిలమిల మెరుస్తోంది. ఆమె గుండెలమీద ఏ ఆచ్ఛాదనలేదు. ఒక్క క్షణం లైట్లు ఆరిపోయి వెలిగాయి. ఆమె లేదు. అరుస్తున్న వారంతా కూర్చుని రొప్పుతున్నారు.

"వాడు చీఫ్ ఇంజనీరు. మరొకడికి బ్యాంకులో పెద్ద ఉద్యోగం. వాళ్ళందరినీ తీసుకొచ్చింది మాత్రం ఆ లావాటి కంట్రాక్టర్" రాబర్టు చెప్పాడు.

"క్యాబ్రా డ్యాన్స్ వుంది చూడు" అన్నాడు.

నిజంగానే దాదాపు పదడుగుల కోబ్రాను మీద

వేసుకొని నర్తిస్తుంది. ఆమె శరీరంమీద అది ప్రాకు తుంటే అది గుర్రొప్పుతుస్తుంది.

సృజన్ యథాలాపంగా వెనక్కి చూశాడు.

అక్కడ ఎవరూ లేరు.

అంతలోనే స్టేజీమీద రగడ మొదలయింది. ఆ డ్యాన్సర్‌ను కౌగలించుకొని ముద్దుపెట్టుకోవాలని ప్రయత్నిస్తున్న ఓ వ్యక్తిని అడ్డగించాడు ఓ లావాటి వ్యక్తి. అతన్ని ఊహించలేనంత వేగంతో కడుపులో పొడిచాడు. ఆ లావాటి వ్యక్తి కళ్ళు తిరిగి "అబ్బా" అంటూ మోకాళ్ళమీద కూలబడ్డాడు.

ఆ వ్యక్తి డ్యాన్సర్‌ను ఒక్క పెట్టున లాగాడు.

ఆమె విసురుగా వెళ్ళి కుర్చీకి కొట్టుకొని బాధగా అరిచింది.

సృజన్ విసురుగా లేచాడు. రాబర్టు వారించేలోగానే ఆ వ్యక్తి దగ్గరకు వెళ్ళిపోయాడు.

పిడికిలి బిగించి కడుపులో ఢ దేల్ మంటూ గుద్దాడు.

ఆ వ్యక్తి నోటివెంట మాటరాలేదు.

అదే వేగంతో "పెడీ" "పెడీ" గుద్దుతూ నే వున్నాడు రాబర్టు వచ్చి ఆపేదాకా.

అతను వెనక్కి విరుచుకు పడిపోయాడు. మరుక్షణం లోనే వాంతి చేసుకున్నాడు.

"ఎవరతను, ఎవరతను" అంటున్నారెవరో.

"మనిషిని" అరిచాడు సృజన్.

కళ్ళు తెరిచిన డ్యాన్సర్ సృజన్ వంక కృతజ్ఞతతో చూసింది.

అప్పటికి తేరుకున్నాడు లావాటి వ్యక్తి.

కంగారుగా సృజన్ని రాబర్టు లాక్కుపోయాడు,

"ఏమిటి అంత ఆవేశపడ్డావు" అన్నాడు రాబర్టు.

"లేదు సార్. ఈ రోజే నేను మనిషినయ్యాను. ఇన్నాళ్ళు ఏం జరిగినా యేదో మా న్సం కట్టిపడవేసింది. యెన్నో అవమానాలు భరించాను" అన్నాడు చేతిని సవరించుకుంటూ.

"సృజన్. నీ వెవరో అని ఇంతవరకు ఆలోచిస్తూ వున్నావు. ఆ సంగతి నాకు తెలుసు. కానీ నా ఆలోచనలు వేరుగా వున్నాయి. ఈ రోజు నిన్ను గమనించాక నాకు తృప్తి కలిగింది.

సృజన్....రవీ నేనూ స్నేహితులం. నాకు చాలా వ్యాపారాలున్నాయి. రవి రాజకీయాల్లోకి ప్రవేశించటంతో వాడి జీవితంలో గొప్ప మార్పు వచ్చింది. అనతి కాలంలోనే వాడు మరీ తీవ్ర వాదంలోకి జారిపోయాడు. ప్రజలు చేయాల్సిన పనిని తాను చేయటానికి నిర్ణయించుకున్నాడు. ఈ విషయంలోనే నాకూ, వాడికీ అభిప్రాయ భేదాలొచ్చాయి.

నేను విప్లవానికి ద్రోహం చేస్తున్నానన్నాడు. వాడికి నాటుబాంబులూ, తుపాకులు తయారుచేయటంలో గొప్ప నేర్పు వుంది. రాను....రానూ రవి రహస్యంగా తన కార్య కలాపాల్ని సాగించటానికి పూనుకున్నాడు.

దాదాపు సంవత్సరకాలం నేను దేశంలో లేను. మా ఇద్దరిదీ ప్రాణ స్నేహం. నేను దేశంలో లేని సమయంలోనే అంతా జరిగిపోయింది. నేను వచ్చాక స్వయంగా విచారించాను.

అత్యంత దారుణమైన విషయాలు వెలుగులోకి రావటం జరిగింది. మీ నాన్నతో పాటు మరికొందరు

విప్లవకారులుగా బయలుదేరి అంతులేని ధనాన్ని మూడ గానే తమ కార్యక్రమానికి స్వస్తి చెప్పారు. రవిని కూడా బయటకు రమ్మని కోరారు. అందుకు వాడు ససేమిరా అంగీకరించలేదు.

అసలు యే దోపిడీతోనూ....హత్యతోనూ వాడికి సంబంధంలేదు. లైసెన్సు లేకుండా బాంబులూ, తుపా కులు తయారుచేయటం ఒక్కటే వాడి నేరం. వ్యాపారం చేస్తూ ఉద్యమానికి సహాయం చేస్తానని కొందరు మాట ఇవ్వటం జరిగింది. ఆ తర్వాత వారు మారిపోయిన తీరు రవిని ఆశ్చర్యపరిచింది.

ధర్మారావ్‌ను హత్యచేయటంతో సమస్య పూర్తవు తుందనుకున్నారు. కానీ ఆయన పోయాక అతని కొడు కొచ్చాడు. ఊళ్లో వారిలో కొందరు స్వచ్ఛందంగా నోట్లు రాసిచ్చారు. మరికొందరు బలవంతంగా రాసి చ్చారు.

తన ఉద్యమంవల్ల యేర్పడిన ఫలితాల్ని స్వయంగా గమనించాడు రవి. అయినా మనస్సు రాజీపడటానికి అంగీకరించలేదు. బయటనుండి ఉద్యమానికి సహకరిస్తా నన్న వారి దగ్గరకు అంతులేని సంపదలు చేరాయి! ఎలా! ఉద్యమానికి సహాకరిస్తున్నారనే పేరుతో వందలాదిమంది యువకుల్ని చిత్రహింసలు పెట్టారు. కాల్చి చంపారు.

రవి పశ్చాత్తాపపడ్డాడు. ప్రజలు కదలాల్సిన అవసరం గుర్తించనందుకు, వారి ప్రాముఖ్యం తగ్గించినందుకు బాధ పడ్డాడు. తమ ఉద్యమం దారుణంగా దెబ్బతింది.

బయటనున్న తన సహచరుల దగ్గరకు పంపిన వారి నుండి విన్న వార్తలకు పూర్తిగా చలించిపోయాడు. వాళ్ళు విప్లవాన్ని యే రకంగానూ సమర్థించకపోగా,

అప్పుడప్పుడూ అందిస్తున్న ఆర్థిక సహాయం కూడా నిలిపి వేశారు. ఇలా చీటికీ, మాటికీ రావటం మూలంగా తామకూడా ఇరుక్కు పోగలమని చెప్పారు. రవి దెబ్బ తిన్న పక్షిలా గిలగిల లాడిపోయాడు.

పెళ్ళాం, బిడ్డల్ని, యవ్వనాన్ని త్యజించి కొండల్లో, కోనల్లో ఆశయంకోసం పనిచేస్తున్న వారుండగా, వారి ఆశయాల్ని డబ్బు చేసుకున్న వారిపట్ల ఆగ్రహంతో కదిలిపోయాడు. తమ వారందరినీ సమావేశపరిచి తమలోని నిజమైన శత్రువు నెదుర్కోవటానికి నిశ్చయించాడు. ఈ వార్త వారికి తెలిసిపోయింది.

దాడికి కావలసిన అమ్యూనిషన్ తయారుచేస్తుండగానే పోలీసులు వచ్చారు. అందర్నీ బంధించారు. రవిని, మరి కొందరు ముఖ్యమైన వారిని తీసుకెళ్ళి చెట్లకు కట్టి కాల్చి చంపారు. ఎదురు కాల్పుల్లో చనిపోయారని ప్రచారం చేశారు. తమకు అడ్డు తొలిగిపోయిందని సంబరపడ్డారు.

ఇదంతా జరిగిన తర్వాత నేను వచ్చాను. మీకోసం వెతికాను. అమ్మ చచ్చిపోయిందని, నువ్వు మతి నిమిత్తం లేకుండా తిరుగుతున్నావని చెప్పారు. రవి నీ గురించి తరచుగా చెబుతుండేవాడు. నీమీద ఆయన చాలా ఆశలు పెట్టుకున్నాడు. ఈలోపే బలయిపోయాడు.

ఇది ఖచ్చితంగా ద్రోహం. తడిగుడ్డలతో గొంతులు కోయటం. "సృజన్" నీకు తెలియదు. రవి గొప్ప వ్యక్తి. అతని సిద్ధాంతాలతో నాకు విభేదాలుండవచ్చు. కానీ అతనిలోని పట్టుదల కార్యదీక్ష మాత్రం ఈ దేశానికి కావాలి."

సృజన్ కళ్ళవెంట నీళ్ళు కారిపోతున్నాయి.

"మీపట్ల గర్వంతో కూడిన భావం నాలో కలుగు

తోంది సార్. ఒక్క కోరిక. మా నాన్నను పోలీసులు పట్టుకోవటానికి సహాకరించింది ఎవరు?"

రాబర్టు సృజన్ కళ్ళలోకి చూశాడు.

మండే అగ్నిపర్వతంలా వున్నాడు.

"రాజారావ్. రఘు....రమణ."

రాబర్టు మాటలు విన్న సృజన్ బిగుసుకుపోయాడు.

"సర్....నా కర్తవ్యం ఏమిటి?"

"నీ అభిప్రాయం చెప్పు."

"ఐ వాంట్ టు డిస్ట్రాయ్ దెమ్ సార్" అరిచాడు సృజన్.

అంతలో నే తమాయించుకున్నాడు.

గొంతు వణికింది.

నిలువెల్లా ఊగిపోతున్నాడు.

రాజారావు రూపం కళ్ళముందు మెసులుతోంది. ఆ రోజు తాను వారందరి ఇళ్ళకు వెళ్ళటం....కడుపు కోతతో తన తండ్రి మరణానికి కారణం మీరే అని అంటుంటే....బలవంతంగా ఘూర్ఖాతో బయటకు నెట్టించి .... ఓహ్ .... అంతులేని దుఃఖంలో తానుండి మౌనంగా రోదించటం మినహాయించి ఏం చెయ్యగలిగాడు? రావిచెట్టు నీడలో బిచ్చగాళ్ళ చెంతన విశ్రమించటం తప్పించి....పగ, ప్రతీకారం దహించివేస్తుంటే, చేతకానితనం కట్టిపడవేస్తుంటే, వంటరిగా, పిచ్చిగా.... కలవరింతలు....!

గుండెలు జలదరింప చేస్తున్న ఈ సత్యం విన్నాక.... ఇంకా మౌనంగానే వుండటం తనకు సాధ్యమవుతుందా? ఈ అగ్ని గోళాల్ని యెలా భరించగలడు తను. ఈ వేడికి తలలో నరాలు చిట్లి .... తల వ్రేయి ముక్కలై

పోదా? ఏం చేయాలి? ఏం చేయాలి?

సృజన్ కణతలు నొక్కుకున్నాడు.

రాబర్టు అతనినే గమనిస్తున్నాడు.

ఆయనకు వ్యక్తిగత హింసావాదం మీద నమ్మకం లేదు. ఆ విషయంలోనే రవితో అతనికి తీవ్రంగా భేదాభిప్రాయలు రావటం జరిగింది. 'రవి' మరణానికి కారకులయిన వారిపట్ల అతనికి కసిగా వుంది. కానీ వారిపై పగ సాధించే విషయంలో ఆయన ఓ అభిప్రాయానికి రాలేకపోతున్నాడు. ఆయన దృక్పథం మరింత విశాలంగా వుంది.

సృజన్ వయసుకు అలాంటివి ఆలోచించేటంత పరిణతి లేదు. అతను ఉడుకు నెత్తురుతో వున్నాడు. దిక్కులేని చావుకు గురయిన తన తల్లితండ్రుల గుర్తొచ్చి మరీ ఉగ్రుడై పోతున్నాడు.

సృజన్ భుజంమీద చెయ్యిపడింది.

కళ్లెత్తి రాబర్టువంక చూశాడు.

"ఏమిటి ఆలోచన."

"సర్" గొంతు గాద్గదికమయింది.

కళ్ళ వెంట నీళ్ళు టప, టప రాలాయి.

"నీ బాధ నాకు తెలుసు" అన్నారాయన.

"సర్. ఈ ప్రపంచంలో నాకున్న ఇద్దర్ని బలి తీసుకున్నారు. మా నాన్నను చంపినపుడు....డబ్బుకోసం మా అమ్మను నిర్దాక్షిణ్యంగా హత్య చేసినపుడు యెవరికి మానవత్వం వుంది. నమ్మకద్రోహం కళ్ళముందు నిలబడి వుంటే చూస్తూ ఎలా కూర్చోను."

రాబర్టు నిట్టూర్చాడు.

"ఇట్సాల్ రైట్. ఈ విషయంలో నిన్ను కంట్రోల్

చేయదలుచుకోలేదు. ఈ విషయంలో నువ్వేలా ప్రవ
ర్తించినా నాకభ్యంతరంలేదు."

సృజన్ కళ్ళు మిలమిలలాడేయి.

"కృతజ్ఞతలు సార్" అన్నాడు సృజన్. "నాకు కొన్ని టైంబాంబ్స్ కావాలి సర్."

"ఓ.కె. మై బోయ్" అన్నాడు రాబర్టు. "అలాగే ఓ వారం రోజులు నీకు శిక్షణ ఇప్పిస్తాను."

## 12

వారం తర్వాత ఎయిర్ బ్యాగ్ లో పవర్ ఫుల్ టైంబాంబులు పేర్చుకొని సృజన్ బయలుదేరాడు.

రాజారావు ఇంటికి దూరంగా నిలబడి పరిశీలించాడు. ఆ వీధి అంతా నిర్మానుష్యంగా వుంది. కొంచెంసేపు ఆలోచించాడు. పరిస్థితులు అనుకూలించేటట్లున్నాయి. ఇంటిముందు కాపలా ఎవరూ లేరు.

సృజన్ హుందాగా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

తలుపు మూసి వుంది.

బజర్ నొక్కాడు.

లోన ఎక్కడో మ్రోగుతూనే వుంది.

ఎవరో నడిచివస్తున్న చప్పుడు వినిపించింది.

తలుపు తెరుచుకుంది.

రాజారావ్ ప్రశ్నార్థకంగా చూశాడు.

సృజన్ అతన్ని నెట్టుకుంటూ లోనికి వెళ్ళాడు.

"ఎవర్నువ్" కంగారుగా అంటున్నాడు రాజారావ్. సృజన్ లోని మార్పు గుర్తించలేనంతగా వుంది.

సృజన్ తలుపు గడియవేశాడు.

చిరునవ్వులో రాజారావువంక చూశాడు.

"ఇఫ్ యూ డోంట్ మైండ్ .... మీ రూంలో

కూర్చొని మాట్లాడుకుందాం."

రాజారావ్ సృజన్‌వంక విచిత్రంగా చూస్తూ లోనికి నడిచాడు.

సృజన్ అతనితో పాటు లోనికి వెళ్లాడు.

రాజారావ్ సంభ్రమించిపోయాడు.

"నీకేం కావాలి?"

"అది తర్వాత చెబుతాను. ఈ ఇంట్లో యెవరున్నారింకా."

"ఏమిటిదంతా."

"ప్రశ్నలు వేయకు. నాకు సమాధానం కావాలి."

"నీ పద్ధతి బాగుండలేదు."

"ఇంతకంటే స్మార్ట్‌గా వుండటం నా స్టైయిల్ కాదు. నాకు జవాబు రాలేదు."

రాజారావుకు కోపంతో పిడికిళ్ళు బిగుసుకున్నాయి. అయితే అతన్ని చూస్తుంటే ధైర్యం చాలటంలేదు. ఈ రోజు ఇంట్లో ఎవరూ లేకపోవటం తన గురదృష్టం అనుకున్నాడు. మరో గంటలో తనూ బయలుదేరి వెళ్ళాల్సి వుంది. ఈ లోపు వీడెవడో దాపురించాడు.

ప్రక్కనే ఫోన్ వుంది. అది అందుకుని రింగ్ చేసే లోపు యేమైనా చేయగలిగేటట్లున్నాడు. అసలు యేమిటతని ఉద్దేశ్యం? అతనికి డబ్బుకావాలా? బంగారం కావాలా? పిచ్చివాడా?

"ఊఁ" గద్దించాడు సృజన్.

"ఎవరూ లేరు."

"వెల్ .... ఇప్పుడు చెప్పండి .... మీకు రవి గుర్తున్నాడా."

"ఏమిటి నువ్వంటున్నది" కంగారుగా అన్నాడు.

"అదే రవి తెలుసా అని."

"ఎవరతను?"

"చ్చొచ్చొచ్చొ....ఆ నడుమ అడవుల్లో పోలీసులు పట్టుకొని పిట్టలా కాల్చారు చూశావ్....ఆ రవే."

"ఓ, అతనా" అన్నాడు రాజారావ్.

"అవును. అత నే. నీకెలా తెలుసు?"

"చందాలకోసం నా దగ్గరకు వచ్చాడు. అతని కుటుంబానికి కూడా నేను సహాయం చేశాను. అతని కొడుక్కి నేను డబ్బు ఇచ్చాను."

"ఎంత?"

"బహుశా రెండువందలు."

"ఎక్కడివి?"

"యూ ఆర్ టాకింగ్ నాన్సెన్స్....రెండువందలు ఎక్కడి వేమిటి....?"

"నువ్వు సంపాదించావా?" సృజన్ కఠినంగా అడిగాడు.

"ఏమిటీ ప్రశ్నలు?"

"నేను ప్రశ్నలే అడుగుతానని ఇందాక చెప్పాను."

"నీ అడ్డమయిన ప్రశ్నలకు సమాధానం చెప్పాల్సిన అవసరం నాకు లేదు. ఇదేం కోర్టు కాదు" మొండిగా అన్నాడు రాజారావ్.

"చక్కగా గుర్తించావ్. ఇది కోర్టు కాదు. నువ్వు నీ డబ్బుతో లాయర్ల చాటునుండి తప్పుకోవటానికి....నువ్వు సమాధానం చెప్పటం నీకే మంచిది...." జేబు లోనికి చెయ్యి పోనిస్తూ అన్నాడు.

"నీ ప్రశ్నలు అర్థరహితంగా వున్నాయి."

స్ప్రజన్ జేబులోనుండి రివాల్వర్ తీశాడు.

"ఏ సమాచారం అందచేస్తే నీకు లభించింది."

"సమాచారం ఏమిటి?" రివాల్వర్ వంక భయంగా చూస్తూ అన్నాడు.

"మిష్టర్ రాజారావ్ అమాయకత్వం నటించకు. నీకింత డబ్బెలా వచ్చిందో....నీ గత జీవితం యేమిటో... ఇన్ని సౌఖ్యాల్లో ఎలా మునిగి తేలుతున్నావో నాకు తెలుసు. కాకుంటే ఒకటే. ఇలాంటి జీవితం కోసం నిర్దాక్షిణ్యంగా నుకొందరి జీవితాల్ని బలిచేయటానికి మీరు సిధపడ్డారు. రాజారావ్....మనుషులు మరణిస్తారు. కానీ, వారి ఆశయాలు మాత్రం బ్రతికుంటాయి. రవి చివరి కోరిక ఏమిటి?"

"నాకేం తెలుస్తుంది."

"ఆయన ఊహించుకున్న విప్లవానికి వెన్నుపోటు పొడిచిన వారిని, దాని ద్వారా బలపడి మరింత దుర్మార్గంగా ప్రవర్తిస్తున్న వారిమీద దాడి చేయటం. తన తొందరపాటుతో, సహజమైన ఆవేశంతో, ఓ వైపునే ఆలోచిస్తూ, విప్లవంకోసం నిజాయితీగా పనిచేసి, తనూ, తనలాంటివారు బలయింది నీలాంటివారి బాగుకోసం కాదు. యే ప్రజలకోసం వారు రక్తం చిందించారో అది వృధా అయింది. దాన్ని మలినం చేస్తూ క్రొత్త రూపాంలో మీరు ముందుకొచ్చారు. ఆయన తుది కోర్కెను అమలు చేయటమే నా లక్ష్యం."

రాజారావ్ మొఖం మాడిపోయింది. అతను పూర్తిగా భయపడిపోయాడు. బహుశా 'రవికి చెందిన పార్టీ కార్యకర్త కావచ్చుననుకున్నాడు.

అతని చేతిలోని రివాల్వర్ నిగనిగలాడుతోంది.

"కమాన్ ఫోన్ చెయ్యి. రమణ .... రఘుల్ని పిలి పించు. అర్జంటుగా ఇక్కడకు రమ్మని చెప్పు. కంఠంలో యే మాత్రం మార్పు కనిపించినా ...తూటా గుండెల్లో నుండి దూసుకెళ్తుంది. వేరే ఎవరికైనా ఫోన్ చేసినా సరే. అదే నీకు ఆఖరి క్షణం. షూటింగ్ లో నా నైపుణ్యం గురించి తెలియాలంటే ఓ కన్ను ఖర్చవుతుంది. చూస్తావా?"

"నో" అరిచాడు రాజారావు భయంగా.

"కమాన్ రింగవ్."

రాజారావ్ పటుక్కున ఫోన్ అందుకున్నాడు.

రివాల్వర్ కంఠానికి సూటిగా ఎయిమ్ చేయబడి వుంది.

రింగవుతోంది.

అవతల ఎవరో ఎత్తారు.

"నువ్వా రఘూ .... నేను రాజారావుని మాట్లాడుతున్నాను. అర్జెంటు పనుంది. యిక్కడకు వచ్చాక చెబుతాను. ఇంటికే రా. వెంటనే రావాలి. బయలుదేరుతున్నావా .... ఓ.. కె."

ఫోన్ పెట్టేశాడు చెమటలు కక్కుతూ.

"రమణకూడా చెయ్యి."

సృజన్ కళ్ళు ఎర్రగా మారిపోయాయి.

శరీరం ఆవేశంతో దహించుకు పోతుంది.

చెట్టుకు కట్టబడి గిలగిలలాడుతున్న తండ్రి కనపడుతున్నాడు.

దిక్కులేక చచ్చిపోయిన అమ్మ శవం కనపడుతోంది.

కళ్ళవెంట నీళ్ళు కారిపోయాయి. తనకు తెలియకుండానే.

రాజారావ్‌కు ఈ పరిస్థితి పిచ్చెక్కేలా చేస్తోంది. యాంత్రికంగా రమణ నెంబర్ రింగ్ చేయటం జరిగింది.

"ఎవరు....రమణా.... నేను రాజారావ్‌ని మాట్లాడుతున్నాను. నువ్వు వెంటనే బయలుదేరి రా.... మందు కోసం కాదయ్యా....అర్జెంటు పనుంది. ఇక్కడ చెబుతాను. రఘు కూడా వస్తున్నాడు. అలాగే.... వెంటనే బయలుదేరు" రిసీవర్ క్రెడిల్ చేశాడు.

ఫోన్‌కున్న వైరుకు తిరించి, భుజాన తగిలించుకున్న ఎయిర్ బ్యాగ్ క్రిందకు దించాడు సృజన్.

"ఎవరున్నవ్?" రాజారావ్ కంఠం వణికింది.

"గుర్తుపట్టలేదా? నీ కాళ్ళు పట్టుకున్నాను మా నాన్నను కాపాడమని. దారుణంగా తిరస్కరించావ్. తరిమికొట్టావ్. మీ బాబుకు బ్రతకటం చేతకాదు. నువ్వు బ్రతకటం నేర్చుకోమన్నావు. అందుకే రాజారావ్ బ్రతకటం నేర్చుకొని మరీ వచ్చాను."

"నువ్వు .... నువ్వు ..." ఆశ్చర్యంగా అంటున్నాడు రాజారావ్.

"నేనే... ఐయామ్ సృజన్...రవి బిడ్డని."

రాజారావ్ సృజన్‌ను అప్పుడు గుర్తుపట్టాడు. ఎంత మార్పు! తనను యాచించటానికి వచ్చిన పిల్లవాడు.... రక్షించమంటూ ప్రాధేయపడ్డ కుర్రవాడు....ఈ రోజు పరిస్థితుల్లో ఎలాంటి మార్పులు....!

"సృజన్....ప్లీజ్....లెట్ మి లివ్."

సృజన్ నవ్వాడు తెరలు తెరలుగా.

"ఇదేమాట నేను అడిగాను. మా నాన్నను రక్షించ

మంటూ నీ కాళ్ళు పట్టుకున్నాను. ఏం చేశావ్ నువ్వు? అదే చెయ్యబోతున్నాను."

రివాల్వర్ ప్రక్కన పెట్టాడు.

ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తున్నాడు.

"సృజన్. నాకు బ్రతకాలని వుంది."

"ఎవరికుండదు రాజారావ్ .... చచ్చిపోయే తుదిక్షణం కూడా బ్రతుకు కోసం ఆరాటపడతాడు మానవుడు. జీవితంలోని మాధుర్యం అలాంటిది. కానీ మీ జీవితాల విషయంలో యెలాంటి దారుణాలు చెయ్యటానికైనా మీరు సిధపడ్డారు. మీలాంటి రాక్షసులు ఈ సమాజంలో బ్రతకకూడదు. మృగాలు అడవుల్లో నే బ్రతకాలి. అవి సమాజంలోకి వస్తే.... మాన్ ఈటర్ గా మారితే ఒకటే ముగింపు.... చంపటమే."

"సృజన్ .... ప్లీజ్ .... నీకెంత డబ్బు కావాలంటే అంత ఇస్తాను" రాజారావు యేడుస్తున్నాడు.

"ఏం చేసుకోమంటావ్. నువ్విచ్చే పాపిష్టి డబ్బు ఎక్కడిది? ధర్మారావ్ లాంటి వారు జనాన్ని దోచి సంపాదిస్తుంటే, అలాంటివారినుండి మీరు దోస్తున్నారు. వెరసి అంతా ప్రజల డబ్బే. నువ్విచ్చే డబ్బు నా తండ్రిని, తల్లిని బ్రతికించగలదా."

రాజారావ్ ముందుకొచ్చాడు.

సృజన్ బిగిసిన పిడికిలి వేగంగా కదిలింది.

"అమ్మో" అంటూ పొట్టపట్టుకు కూలబడ్డాడు.

చేతుల్ని చెక్కలా బిగించి ప్రక్కటెముకలమీద కొట్టాడు. రాజారావు నోటినుండి సన్నటి ధ్వని వెలువడింది.

స్పృహతప్పి పడిపోయాడు.

నిమిషం అలా నే నిలబడి చూస్తుండిపోయాడు సృజన్.

కర్తవ్యం గుర్తుకొచ్చింది.

వెనక్కి తిరిగి బ్యాగ్ అందుకున్నాడు.

బయటనుండి తలుపు గడియ వేశాడు.

సరిగ్గా అరగంట తర్వాత ప్రేలేటట్లుగా టైంబాంబును ఎరేంజ్ చేశాడు. ఇంటిలోనికి నడిచి అన్ని ప్రాంతాల్లో అమర్చాడు. చివరి బాంబు అమర్చి నిలబడుతుండగా బజర్ మ్రోగటం వినపడింది.

సృజన్ మెట్లు దిగి తలుపు దగ్గరకు నడిచాడు.

తలుపుతీశాడు.

రమణ....

అప్పుడే కారు వచ్చి ఆగింది. డ్రైవింగ్ సీట్లోనుండి రఘు దిగివచ్చాడు.

"అర్జెంటు పనుంది రమ్మన్నాడే" అంటూ సృజన్‌ని చూసి ఆశ్చర్యంగా ఆగిపోయారు ఇద్దరూ.

"ఆయన పైగదిలో వున్నారు" అన్నాడు సృజన్.

"అలాగా" అంటూ మెట్లెక్కి వెళ్లారు.

సృజన్ తలుపు మూసి వచ్చాడు.

తలుపు తెరవగానే వారిద్దరికీ మతిపోయింది. రూమంతా చిందరవందరగా వుంది. ఓ మూల రాజారావ్ స్పృహతప్పి పడిపోయి వున్నాడు.

"ఏమిటిది?" కంగారుగా అన్నారు తమకు తెలియకుండానే.

"విప్లవం!" గాల్లో వినిపించాయి మాటలు.

కంగారుగా వెనక్కి తిరిగారు

"ఎవరు నువ్వు?"

"లోపలకు పదండి."

తమకు తెలియకుండానే లోనికి అడుగువేశారు.

"రవి....రవి మీకు గుర్తున్నాడా?"

వారి మొఖాలు పాలిపోయాయి.

"కొంతమంది సిద్ధాంతాలు నమ్ముకొని ఛస్తారు. మరి కొందరు వాటిని చంపి బ్రతుకుతారు. మీకిష్టం వచ్చిన మార్గంలో మీరు బ్రతకొచ్చు. కానీ అందుకు కొందర్ని బలిపెట్టడం సమర్థనీయం కాదు. హింసకు...హింసే మార్గం."

"ఏమిటి నువ్వంటున్నది?"

"చాలా స్పష్టంగా వుంది. మీరు చావబోతున్నారు."

"నీకెందుకు మామీద కక్ష. ఆయన చనిపోవటానికి మాదేం తప్పులేదు. మమ్మల్ని విడిచిపెట్టు...."

"నేను రవి బిడ్డను."

వారి కళ్ళలో ఆశ్చర్యం తొంగిచూసింది.

వారు మాట్లాడుతున్నా ఆ గదినంతా పరిశీలిస్తూనే వున్నారు.

"మమ్మల్ని క్షమించు" అంటూనే రఘు సృజన్ గుండెలమీద తన్నాడు. వెనక్కి తూలాడు సృజన్.

గాల్లోకి లేచిన సృజన్ కాలు విసురుగా రఘు నదుమును త్రాకింది.

అడ్డం వచ్చిన సోఫాతో పాటు విసురుగా వెళ్ళి గోడకు గుద్దుకొని పెద్దగా అరిచాడు. మరుక్షణం స్పృహ కోల్పోయాడు.

రమణకు నోటివెంట మాట రావటంలేదు.

స్ప్రజన్ అతనిపై పుష తిరిగాడు.
"ఫట్"మంటూ కడుపులో ఓ పంచ్ ...
ప్రేగులు ఉండలు చుట్టుకొని వుంటాయి ఆ దెబ్బకు.
మోకాళ్ళమీద కూలబడ్డాడు.
గాల్లోకి లేచిన స్ప్రజన్ హస్తం....
రమణ తలమీద పడింది....
రంగుల ప్రపంచం ఒక్కసారి గిరుక్కుమంది.
ఆ తర్వాతేం జరిగిందో అతనికి తెలియదు.
టైం చూసుకున్నాడు. ఇంకా పదినిమిషాలుంది.
బ్యాగ్ భుజానికి తగిలించుకొని బయటకొచ్చాడు.
రూమ్ తలుపులు వేసి బయటనుండి తాళంవేశాడు.
మెట్లు దిగివచ్చాడు.
ముఖద్వారం తలుపులు మూసి గడియపెట్టాడు.
అతని మనసులో ఎలాంటి ఆలోచనలేదు.
నిర్వికారంగా నడుచుకుంటూ ఆ రోడ్డు చివరకెళ్ళాడు.
రోడ్డు నిర్మానుష్యంగా వుంది.
నిలబడి వాచివంక చూసుకున్నాడు.
ఇంకా మూడు నిమిషాలుంది.
క్షణాలు గడుస్తున్నాయి.
"ఢాం."
భవనం ఊగిపోయింది.
రాళ్ళు గాల్లోకి లేచాయి.
శబ్దాలు వినిపిస్తూనే వున్నాయి.
ముగ్గురి శరీరాలు గాల్లోకి లేచి....ముక్కలుగా విసిరివేయబడ్డాయి.
ఆ భవనం కూలిపోయి రాళ్ళగుట్టగా మిగిలింది.

వాటి నడుమ ముగ్గురూ సమాధికాబడ్డారు.

స్పృజన్ డ ఇంకా శబ్దాలు వినిపిస్తూనే వున్నాయి.

కంగారుగా జనం అటూ, ఇటూ పరిగెత్తటం చూస్తూనే వున్నాడు. ఓ క్షణం అతనిలోని అంతరాత్మ నిలదీసింది.

"నువ్వు చేసిందేమిటి?"

అంతలోనే మామూలు మనిషయ్యాడు.

అక్కడినుండి బయలుదేరాడు.

—:అ యి పో యి ం ది:—

# ఊహించని అదృష్టం

టెంపోరావ్

హోటల్ బేరర్ యూనిఫామ్‌లో వున్నాడు రాజు.

అతడిలో ఏదో ఆకర్షణ వుంది. తెల్లటి యూనిఫామ్‌లో, లైట్ల కాంతిలో అతడి మొహం తళతళ మెరుస్తోంది.

అతడి వయస్సు ఇరవైలోపున వుంటుంది. నాలుగేళ్ళనుంచి సీవ్యూ హోటల్లో అతడు పనిచేస్తున్నాడు. టిప్స్ రూపంలో రోజూ యిరవై పైన వస్తోంది. జీతం ఎక్కువ రాకపోయినా అక్కడే టిఫిన్, భోజనం వగైరా లభిస్తున్నాయి.

హాల్లో లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి. ఎవరో తను చూసే టేబుల్ వైపు నడవడం గమనించి రాజు వేగంగా అక్కడకు చేరుకున్నాడు.

ఒక విదేశీయుడు కుర్చీలో ఒంటరిగా కూర్చుని వున్నాడు. అతడివైపు నవ్వుతూ చూసి రాజు శల్యూట్ చేశాడు.

"యువర్ ఆర్డర్ సార్" అన్నాడు వినయంగా.

విదేశీయుడు అతడివైపు కళ్ళు చిట్లించి చూశాడు.

"ఫుల్ బాటిల్ వాట్ 69, సోడా, ఐస్ క్యూబ్స్, ఆమ్లెట్లు, చిప్స్" అన్నాడతను.

"యస్సార్" అని రాజు వెనక్కి వెళ్ళాడు.

విదేశీయుడు విస్కీ సేవిస్తూ చిప్స్ నవుల్తున్నాడు. ఆమ్లెట్ తింటున్నాడు. రాజు మెల్లిగా అతడి టేబుల్ దగ్గరకు వెళ్ళాడు.

"టైమెంత?" అడిగాడతను.

"8-30 సార్" అన్నాడు రాజు.

అతడి మాటల్నిబట్టి అమెరికన్ అయివుంటాడని, రాజు తన అనుభవం మూలంగా గ్రహించాడు.

"నా పేరు విల్కిన్స్, జానీ విల్కిన్స్" అన్నాడతను.

"గుడ్ నేమ్ సార్" అన్నాడు రాజు.

"నీ పేరు?"

"జై రాజా, సార్."

"నువ్వు డ్యూటీలో ఎంతవరకూ వుంటావు?"

"తొమ్మిదిదాకా, సార్."

విల్కిన్స్ అతడివైపు నవ్వుతూ చూశాడు.

"నీ డ్యూటీ అయ్యాక నా గదికిరా. రూమ్ నంబర్ 333."

"ఎందుకు సార్?" ప్రశ్నించాడు రాజు.

విల్కిన్స్ గంభీరంగా నవ్వాడు.

"వచ్చి చూడు! యూ మే బి లక్కీ!" అన్నాడతను.

"వస్తాను, సార్" అన్నాడు రాజు.

విల్‌కిన్స్ తాగుతూ, న్యూస్ పేపర్ చూస్తూ కూర్చు న్నాడు. తొమ్మిది కాగానే అతడు బేరర్‌ని పిల్చాడు.

"గెట్ మి ది బిల్" అన్నాడు రాజుతో.

కాస్సేపట్లో రాజు బిల్లు తెచ్చాడు. అతడు బిల్లుమీద తన గది నంబరు రాసి సంతకం పెట్టాడు. ప్లేటులో 10 రూపాయిలనోటు పడేశాడు.

"థాంక్స్ సార్" అన్నాడు రాజు ప్లేటును తీసుకు పోతూ.

తొమ్మిది దాటింది. రాజు తన పాంట్, స్లాక్ ధరించాడు. మెల్లిగా 333 గదికి వెళ్లాడు. తలుపుమీద తట్టాడు. తలుపు తెరవబడింది.

జానీ విల్‌కిన్స్ అతడివైపు నవ్వుతూ చూశాడు.

"వెల్‌కమ్ టు మై రూమ్" అన్నాడతను.

రాజు లోపలకు వెళ్ళాడు. విల్‌కిన్స్ తలుపును మూసి లాక్ చేశాడు. గదిలో మూడు సోఫాలు వున్నాయి.

"సిట్!" అన్నాడు విల్‌కిన్స్.

రాజు కూర్చోలేదు. సోఫా పక్కనే వినయంగా నిల బడ్డాడు.

"ఇప్పుడు మనం ఫ్రెండ్స్! ప్లీజ్ సిడౌన్!" అన్నాడు విల్‌కిన్స్.

సోఫాలో రాజు కూర్చున్నాడు. నవ్వుతూ అతడివైపు చూశాడు.

"విస్కీ తాగుతావా?"

"వద్దు, సార్" అన్నాడు రాజు.

విల్‌కిన్స్ ఒక గ్లాసులో విస్కీ పోసి, సోడా కలిపి, ఐస్ వేసి అతడికిచ్చాడు.

భయపడ్తూ అతడు గ్లాసును అందుకున్నాడు.

"ఈ గదిలో నువ్వు ఏం చేసినా మేనేజర్ దాకా వెళ్ళదు. డోంట్ బాదర్" అన్నాడు విల్కిన్స్.

గ్లాసులోని విస్కీని రాజు మెల్లిగా తాగసాగాడు.

"నీ సహాయం నాకు కావాలి" అన్నాడు విల్కిన్స్.

"ఎందుకులో సార్?" అడిగాడు రాజు.

విల్కిన్స్ క్షణకాలం ఆలోచిస్తూ విస్కీ తాగాడు. సిగరెట్ పొగ పీలుస్తూ అతడివైపు చూశాడు.

"నీకెన్ని రోజులు సెలవు యిస్తారు?"

"పదిరోజులు దాకా యిస్తారు."

"రాజ్, నువ్వు నాకోసం పని చేస్తే యెక్కువగా డబ్బు వస్తుంది!"

"ఏం చెయ్యాలో చెప్పండి."

"నీకు నేనొక సూట్కేస్ యిస్తాను. నువ్వు గోవా వెళ్లాలి. దాన్ని హోటల్ సెంటినల్లోని ఒక వ్యక్తికి యిచ్చి తిరిగిరావాలి."

"వెళ్ళి యిస్తాను, సార్."

"నువ్వు చాలా జాగ్రత్తగా వెళ్లాలి. ట్రెయిన్లో వెళ్తూండగా చెకింగ్ వుండొచ్చు. సూటుకేసులో వున్నది ఎవరికంటా పడకూడదు. పడితే నువ్వు ప్రమాదంలో యిరుక్కుంటావు!"

"ఇదంతా సవ్యంగా చేసి తిరిగివస్తే మీరు నాకెంత యిస్తారు?"

"పదివేలు" అన్నాడు విల్కిన్స్.

రాజు ఉలిక్కిపడ్డాడు. అంత డబ్బు తన జీవితంలో ఎన్నడూ చూడలేదు!

"రాజ్, ఇది ప్రమాదంతో కూడుకున్న పని. అన్నీ సవ్యంగా జరిగితే నీ డబ్బు నీకొస్తుంది. యేమేనా

అడ్డంకాలు యేర్పడితే నష్టం నాది. యెవరేనా నిన్ను పట్టుకుంటే నా గురించి చెప్పకూడదు!"

"చెప్పను, సార్."

రెండు ఖాళీ గ్లాసుల్లోనూ విల్ కిన్స్ విస్కీ పోసి సోడా కలిపాడు. ఐస్ క్యూబ్స్ పడేశాడు.

"నువ్వు జయప్రదంగా తిరిగివస్తే యీ గదిలో పెద్ద పార్టీ నీకిస్తాను. ఇటుపైన అనేక పనులకు నిన్ను నేను వుపయోగిస్తాను. ఈ బేరర్ జాబ్ నువ్వు వదిలేయవచ్చు."

కాసేపు రాజు మాట్లాడలేదు. లోలోపల ఆలోచిస్తున్నాడు. తనకు డబ్బు కావాలి. చెల్లెలు పెళ్ళి చేయాలి. కనీసం ఇరవై వేలు కావలసి వుంటుంది.

నాలుగేళ్ళపాటు బేరర్ గా పనిచేసి అతడు విసుగెత్తిపోయాడు. విల్ కిన్స్ మూలంగా తన జీవితం మారాలి!

"మీరు ఏం చెప్పినా చేస్తాను, సార్. అవసరమైతే యీ జాబ్ వదిలేస్తాను" అన్నాడతను.

"గుడ్, మైడియర్ రాజ్! జీవితంలో ఎప్పుడోగాని అవకాశాలు రావు. వచ్చినపుడు నువ్వు వాటిని వదులుకోకూడదు!"

"నేను వదులుకోను సార్" అన్నాడు రాజు.

ఆ రాత్రి రాజు తన యిల్లు చేరుకునేసరికి పన్నెండు దాటింది.

## 2

తట్టగానే తల్లి తలుపు తెర్చింది.

"రాజూ, ఇంత ఆలస్యంగా వచ్చేవేమిట్రా?" అడిగిందామె.

"మరొకడి పని చెయ్యవలసి వచ్చింది. నేను భోజనం చేసేశాను. వెళ్ళి పడుకుంటాను" అన్నాడతను.

తల్లి పక్కనే పడుకుని నిద్రపోతున్న చెల్లెలువైపు అతను చూశాడు. హాయిగా పడుకుంది. అతను తన గదికి వెళ్ళాడు. నేలమీద పక్క వేసుకొని వాలాడు.

పక్కమీద ఇటూ అటూ దొర్లుతూ వుండిపోయాడు. నిద్ర రావడంలేదు. అతడు తన జీవితాన్ని గురించి సింహావలోకనం చేసుకోసాగాడు.

తండ్రి మరణించాక రెండేళ్ళపాటు జీవితం సాగిపోయింది. తర్వాత కష్టాలు ఎదురయ్యాయి.

ఆదాయం లేదు. తండ్రి వదిలిన డబ్బంతా అయిపోయింది. ఇల్లు నడవడం కష్టమయింది.

"అమ్మా నేను చదువు మానేస్తాను. ఏదో చేసి డబ్బు గడిస్తాను" అన్నాడతను.

పరిస్థితి బాగా తెలిసిన తల్లి మానందాల్చింది. దృఢ నిశ్చయంతో అతడు బయటకు పోయాడు. ఆలోచిస్తూ రోడ్డమ్మట నడవసాగాడు.

ఈ లోకంలో డబ్బు యెక్కడుంది? డబ్బుకోసం తను ఏం చెయ్యాలి?

రోడ్డమ్మట నడుస్తూన్న ఒక వ్యక్తివైపు అతడు చూశాడు. ఆ వ్యక్తి ఖరీదైన దుస్తుల్లో వున్నాడు. నాలుగు పెట్టెలను ఎంతో కష్టంతో అతడు మోసుకుపోతున్నాడు.

"సార్, పెట్టెలను నేను మోస్తాను" అన్నాడతను.

"సరైన టైములో వచ్చావు" అని అతను పెట్టెలను రాజు నెత్తిమీద పెట్టాడు.

అతడి వెనకనే రాజు పెట్టెలను మోసుకుపోయాడు. బస్టేండులో వాటిని దింపాడు. ఆ వ్యక్తి రాజువైపు నవ్వుతూ చూశాడు. రెండు రూపాయలు అతడి చేతిలో

పెట్టాడు.

రాజు సంతోషంగా అక్కడినుండి కదిలాడు. ఒక చోట నిలబడి ఆలోచించాడు. బస్సులో వచ్చేవాళ్ళకు కూలీలు కావాలి. తనక్కడే వుండడం మంచిది!

చిత్తూరు బస్సు వచ్చి ఆగింది. ఒక ముసలామె కిందకు దిగింది. ఆమె పెట్టెలను రాజు తీసుకున్నాడు.

"ఎక్కడికి కళ్ళాలమ్మా?"

"దగ్గరలోనే వుంది మా ఇల్లు. పద!" అందామె.

ఆమె పెట్టెలను యింటికి చేర్చాడతను. ఆమె మూడు రూపాయిలిచ్చింది. ఆ రోజు ఒంటిగంట లోపల అతడు పన్నెండు రూపాయలు గడించాడు.

బియ్యం, కూరలు, పప్పు వగైరా కొని అతడు ఇంటికి చేరుకున్నాడు. గంట తర్వాత అందరూ భోజనాలు చేశారు.

అప్పటినుంచీ అతడి కష్టార్జితం మీదే యిల్లు నడుస్తోంది.

జీవితంలో అవకాశాలు అనేకమందికి వస్తూంటాయి. అలాగే ఒకనాడు రాజుకి గొప్ప అవకాశం సంభవించింది.

సీవ్యూ హోటల్ మేనేజర్ కారు నడిరోడ్డుమీద ఆగిపోయింది. రాజు మేనేజర్‌కి యెంతగానో సహాయపడ్డాడు.

అతడి వినయ విధేయతలు మేనేజర్ని బాగా ఆకర్షించాయి.

"అబ్బాయి నీ పేరు?" అడిగాడు మేనేజరు.

"రాజు సార్."

"హోటల్ సీవ్యూకి వచ్చి రేపు నన్ను కలుసుకో. నేనా హోటల్ మేనేజర్ని."

"వస్తాను, సార్."

మేనేజరు అతడికి 10 రూపాయలనోటు యిచ్చాడు.

"ఎక్కువిచ్చారు సార్" అన్నాడు రాజు.

"ఫరవాలేదు. వుంచుకో," అని మేనేజర్ కారులో వెళ్ళిపోయాడు.

మరో ఐదురూపాయలు గడించి అతడు ఇంటికి చేరుకున్నాడు. పదిహేను రూపాయలనూ తల్లికిచ్చాడు.

మర్నాడు అతడు హోటల్ సీవ్యూకి వెళ్ళాడు మేనేజర్ని కలుసుకున్నాడు.

"రాజా నువ్విక్కడ బేరర్ గా వుండు. నీకు జీతం 200 ఇస్తాం. భోజనం, టిఫిన్ అన్నీ ఇక్కడే ఇస్తాం. జీతం తక్కువని బాధపడకు. రోజుకు యిరవైపైన నీకు టిప్స్ వస్తూ టాయి" అన్నాడు మేనేజరు.

"వెంటనే చేరాను, సార్" అన్నాడు రాజా.

మేనేజర్ బజ్జర్ నొక్కాడు. అందమైన యువతి లోపలకు వచ్చింది.

"మిస్ లిల్లీ, యితడిని బాత్రూమ్‌లో పని చేయమను. మన యూనిఫామ్స్‌లో అతడికి సరిపడేది చూసి వేసుకోమను. అంతా అతడికి చెప్పి పుట్ హిమ్ ఇన్ ది జాబ్" అన్నాడు మేనేజర్.

మేనేజర్ కి నమస్కరించి రాజా ఆమెతో వెళ్ళిపోయాడు. ఆ రోజునుంచీ ఆ హోటల్లో బేరర్ గా వున్నాడు.

పక్కమీద నుంచి రాజు లేచి కూర్చున్నాడు. విల్ కిన్స్ యిచ్చిన అమెరికన్ సిగరెట్ పాకెట్ తెర్చి

సిగరెట్ తీసి వెలిగించాడు.

విల్ కిన్స్ మూలంగా తన జీవితం బాగుపడుతుందా? సిగరెట్ పొగ పీల్చి వదుల్తూ అతడు ఆలోచించ సాగాడు.

తల్లి గదిలోకొచ్చింది. అతడి వైపు ఆశ్చర్యంగా చూసింది.

"ఇంకా నిద్రపోలేదట్రా?"

"నిద్ర రావడంలేదమ్మా. ఒక అమెరికన్‌తో నాకు పరిచయం అయింది. ఏదో పనిమీద అతడు నన్ను గోవా వెళ్ళమన్నాడు."

"వెళ్తే నీకేమిటొస్తుంది?"

"పదివేలు!"

ఆశ్చర్యంతో ఆమె అతడివంక చూసింది.

"నువ్వు చేయవలసిన పనేమిటి?"

"ఒక సూట్‌కేసు భద్రంగా తీసుకెళ్ళి పనాజీ పట్నంలో వున్న ఒక హోటల్ మేనేజర్‌కి యిచ్చి తిరిగి రావాలి."

"ఆమాత్రం దానికి పదివేలు ఇస్తాడా? ఇది నాకు మంచి పనిగా కనపడ్డంలేదు. నువ్వు యే కష్టాల్లోనో యిరుక్కోవచ్చు. ఇది వద్దని చెప్పు!"

"అమ్మా, పదివేలు చేతికొస్తే మనం చెల్లెలు పెళ్ళి చేసేయొచ్చు. మన దగ్గర కొంత డబ్బు వుందిగా! ధైర్యం చేస్తేగాని లక్ష్మి మన దగ్గరకు రాదు!"

"నీకు పదివేలు యివ్వడానికి బదులు ఆ అమెరికన్ గోవాకు వెళ్ళొచ్చుగా?" అందామె.

"అతడు వెళ్ళలేడు. అతను విదేశీయుడు. అనేక మంది అతడి రాకపోకలను గమనిస్తూ వుంటారు. అందు

వలన నాలాంటి వాడికి ఆ పని అప్పగించాడు."

"నీ ఇష్టం!" అని ఆవులిస్తూ ఆమె హాల్లోకి వెళ్ళి పోయింది.

ఆమె వెళ్ళిపోయాక రాజు మరో సిగరెట్ వెలిగించాడు. తల్లి మాటలు అతడి మెదడులో తిరుగుతున్నాయి. తను జీవించే యీనాటి లోకం గురించి తన తల్లికంతగా తెలియదు. ఇంటిపట్టున బ్రతికే వాళ్ళకు బయటకెళ్ళడం ప్రమాదకరంగా గోచరిస్తూ వుంటుంది.

తను గోవా వెళ్ళాలి. జయించి తిరిగి రావాలి! పది వేలు! సిగరెట్ పీకను గోడవారగా పారేసి అతడు పరుపుమీద వాలాడు. కాస్సేపట్లో అతడికి నిద్ర పట్టేసింది.

# 3

హోటల్ మేనేజర్‌తో మాట్లాడి పదిరోజులు సెలవు పెట్టాడు రాజు!

రహస్యంగా జానీ విల్‌కిన్స్ గదికి వెళ్ళాడు. ఒక పాత సూటుకేసును విల్‌కిన్స్ అతడికిచ్చాడు. దాని తాళం చెవి కూడా ఇచ్చాడు. అతడికి ఐదువందలు ఇచ్చాడు.

"ఈ డబ్బు నీ ఖర్చులకు. భద్రంగా వెళ్ళిరా. హోటల్ సెంటినల్ మేనేజరు నీకొక సూటుకేసు యిస్తాడు. అది పట్టుకుని వచ్చేయి!"

"యస్సార్" అన్నాడు రాజు.

ఆనాడు మధ్యాహ్నం రాజు ట్రెయిన్‌లో కూర్చున్నాడు. పై బర్త్ మీద పడుకొని సూటుకేసును తలకింద పెట్టుకున్నాడు.

ఎక్స్‌ప్రెస్ వేగంగా ప్రయాణం చేస్తోంది. అతడు బొంబాయిలో క్షేమంగా దిగాడు. సమీపంలో వున్న

ఒక హోటల్లో గది తీసుకున్నాడు.

హోటల్ గది తలుపు మూసి లోపలనుంచి తాళం వేశాడు. ఆ సూట్ కేసులో వున్న అంత విలువైన వస్తువు ఏమిటి?

రాజు మెల్లిగా సూటుకేసును తెరిచి చూశాడు. లోపల క్రపెట్టె వుంది. పెట్టెను తెరిచాడు, పోలిథీన్ పాకెట్ లో వున్న పదార్థమువైపు ఆశ్చర్యంగా చూశాడు.

మోర్ఫిన్!

పాకెట్ ను అతడు చేతో పట్టుకు చూశాడు. దాని బరువు రెండు కిలోలు వుండొచ్చు! పాకెట్ ను సూట్ కేసులో పెట్టి అతడు తాళం వేసేశాడు. దాన్ని బీరువాలో పెట్టి, అతడు బాత్ రూమ్‌లోకి నడిచాడు.

స్నానం ముగించి అతడు బ్రేక్ ఫాస్టుకి డైనింగు హాల్లోకి వెళ్ళాడు. సూట్ కేసును కూడా పట్టుకెళ్ళాడు. యెక్కడైనా వదిలే సూటుకేసు యేమవుతుందో అని అతడి భయం!

సూట్ కేసులో వున్న మత్తుపదార్థాన్ని చూశాక అతడు గాభరాపడసాగాడు. యే పోలీసు ఆఫీసరేనా చూస్తే తనని అరెస్టు చేస్తారు!

బ్రేక్ ఫాస్టు అయ్యాక గదిలో కూర్చుని అతడు అర బాటిల్ రమ్ తాగేశాడు. ఇప్పుడతనికి ధైర్యంగా వుంది.

గది ఖాళీచేసి అతడు స్టేషన్ కు ఆటోలో చేరుకున్నాడు. గోవా కెళ్ళే ట్రెయిన్ లో కూర్చున్నాడు. ఇరవై నిమిషాల తర్వాత అది బయల్దేరింది.

అతడు సీటులో కూర్చుని బయటకు చూస్తున్నాడు. ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ కూర్చున్నాడు.

ఎదురుగా కూర్చుని వున్న వ్యక్తి పేపరు చదవడం ముగించి అతడివంక చూశాడు. లావుగా, పొట్టిగా వున్నాడతను. గ్రే సూటు ధరించాడు.

రాజు అమెరికన్ సిగరెట్ వెలిగించి పొగ వదుల్తూ బయటకు చూడసాగాడు.

"ఈ సిగరెట్లు మీకెక్కడ దొరుకుతున్నాయి?" ప్రశ్నించాడతను.

రాజు తీయగా నవ్వాడు.

"మద్రాసులో బర్మాబజార్ వుంది. అక్కడ మీకన్నీ దొరుకుతాయి" అన్నాడతను.

"మీరు గోవా వెళ్తున్నారా?"

రాజు తల ఆడించాడు.

"బొంబే ఎందుకొచ్చారు? కర్ణాటకా రాష్ట్రం ద్వారా వెళ్ళడం దగ్గరగా?"

"బొంబేలో పనుండి వచ్చాను."

అతడు రాజుతో కరచాలనం చేశాడు.

"నా పేరు కలేల్కర్. నేనొక మందుల కంపెనీకి కాలింగ్ సేల్స్‌మన్ని."

"నా పేరు ప్రదీప్. పిల్లల పుస్తకాల వ్యాపారంలో వున్నాను నేను" అన్నాడు రాజు.

"పనాజీలో మీరు ఎక్కడుంటారు?"

"ఏదో హోటల్లో."

"హోటల్ హెవన్ బాగుంటుంది. మధ్యతరగతి వాళ్ళకు చక్కటి హోటల్."

ఏదో స్టేషన్‌లో ట్రెయిన్ ఆగింది. సూట్ కేసుతో సహా రాజు బయటకు నడిచాడు. ఒక కూల్ డ్రింక్ తాగాడు. రెండు అరటిపళ్ళు తిన్నాడు. ట్రెయిన్ కూత

వినపడగానే తన కంపార్టుమెంట్‌లోకి చేరుకున్నాడు.

అంతకుముందు తనతో మాట్లాడిన వ్యక్తి యెక్కడా కనపడలేదు. అతడు యేమయ్యాడు?

ఆలోచిస్తూ రాజు సిగరెట్ వెలిగించాడు. టాయిలెట్‌లోంచి బయటకొచ్చి ఆ వ్యక్తి అతడికెదురుగా మళ్లా కూర్చున్నాడు. రాజు అతడివైపు నవ్వుతూ చూశాడు.

"నెలకు 20 రోజులు తిరగడం చాలా టైర్‌సమ్ జాబ్" అన్నాడతను.

## 4

గేటు దాటి రాజు హోటల్ కాంపౌండులోకి నడిచాడు. హోటల్ సెంటినల్ చాలా పెద్దది. హోటల్ వెనకవైపున సహజమైన బీచ్, అరేబియన్ సముద్రం వున్నాయి.

హోటల్లో కూర్చుంటే సముద్రపు హోరు లీలగా వినిపిస్తూ వుంటుంది.

హోటల్లోని ఫ్లోరసెంట్ లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. హోటల్ కాంపౌండు నలువైపులా సోడియం వాపర్ లాంప్స్ ప్రకాశిస్తున్నాయి.

తన డిజిటల్ వాచ్‌లో రాజు టైమ్ చూశాడు. 8-33 అయింది. ఒకనాడు బార్రూమ్‌లో బాగా తాగిన జర్మన్ ఆ వాచ్‌ని రాజుకు యిచ్చాడు. బార్రూమ్‌లో తాగే కస్టమర్స్ ఏవైనా యిస్తే బేరర్స్ తీసుకోకూడదు. అందువలన రాజు మొదట్లో ఆ వాచ్‌ని తీసుకోలేదు. కాని ఆ జర్మన్ మేనేజర్ అనుమతితో వాచ్‌ని రాజుకు బహూకరించాడు.

హోటల్ రేంజిలోకి వెళ్లాడు రాజు. నలువైపులా

చూశాడు. మేనేజర్ గదిముందు ప్లాస్టిక్ బోర్డు వుంది. ఆడమ్‌డిసూజా, మేనేజర్, అని వుంది.

రాజు మేనేజర్ గదిముందుకు వెళ్ళి స్వింగు తలుపు మీద తట్టాడు.

"కమిన్!" అందో బొంగరు కంఠం.

వినయంగా రాజు లోపలకు వెళ్ళాడు. అతడి చేతిలోని సూట్‌కేసువైపు ఆడమ్‌డిసూజా సూటిగా చూశాడు.

"మిష్టర్ ఏం కావాలి?"

"నా పేరు జైరాజ్. ఈ సూట్‌కేసు మీ కివ్వడానికి వచ్చాను."

"ఎక్కడినుంచి?"

"మద్రాసునుంచి."

"ఎవరు పంపారు?"

"జానీ విల్‌కిన్స్."

అతడు సూటుకేసును తీసుకున్నాడు. దాన్ని టేబుల్ మీద పెట్టి రిసీవర్ ఎత్తాడు.

"హాలో ఆపరేటర్, మళ్ళా నేను చెప్పినదాకా ఎవ్వరూ నా గదికి రాకూడదు."

"అందరికీ చెప్తాను, బాస్" అందామె.

అతడు రిసీవర్ పెట్టేసి రాజును కుర్చీలో కూర్చోమన్నాడు. అతడికి రాజు తాళంచెవిని యిచ్చాడు. సూట్‌కేసును తెర్చి, చూసి, అతడు తృప్తికరంగా రాజువైపు చూశాడు. నవ్వుతూ అతడితో కరచాలనం చేశాడు.

"మిష్టర్ రాజ్, మీరు ఎప్పుడు వెళ్ళిపోతారు?"

"రేపు."

"నా గెస్టుగా మీరు యీ హోటల్లో వుండండి. మీకు పైసా ఖర్చులేదు, ఏం కావలసినా మీరు తినొచ్చు

తాగొచ్చు. విల్‌కిన్స్‌లాగే నేనూ మిమ్మల్ని నమ్ముతున్నాను. నేనుచేసే యీ రహస్య వ్యాపారం గురించి ఎక్కడా మాట్లాడొద్దు."

"ప్రాణం పోయినా మాట్లాడను."

"మీకు బహుమతిగా ఐదువేలు రేపిస్తాను."

"థాంక్స్" అన్నాడు రాజు కష్టంగా.

అడమ్‌డిసుజా రిసీవర్ ఎత్తాడు. అటువైపునుంచి ఆపరేటర్ "హలో!" అంది.

"వెంటనే రిసెప్షన్‌లో వున్న బండోలీని ఇక్కడకు రమ్మను."

కాన్సెప్టులో బండోలీ గదిలోకి వచ్చాడు. మేనేజర్ రాజువైపు చూపించాడు.

"ఈయన నా డియర్ ఫ్రెండు జైరాజు. ఈయినకు మన హోటల్లోని ఎ.సి. రూమ్ యివ్వు. ఈయనకు ఏం కావలసినా వుచితంగా సప్లయి చెయ్యాలి" అన్నాడు మేనేజర్.

"యస్సార్" అన్నాడు బండోలీ.

మేనేజర్‌తో కరచాలనం చేసి రాజు బండోలీతో బయటకు నడిచాడు.

"మీ లగ్గేజి యెక్కడుంది సార్?" బండోలీ అడిగాడు.

"నాకెక్కువగా లగ్గేజిలేదు. అది నేను తర్వాత తెచ్చుకుంటాను" అన్నాడు రాజు.

మొదటి అంతస్థులో వున్న రూమ్ నంబర్ 55లోకి రాజు వెళ్ళాడు. డ్రాయింగ్ రూమ్ పక్కన బెడ్‌రూమ్. అంతా ఏర్‌కండిషండ్!

"మీరీ గదుల్లో వుండండి సార్. మీరు ఎక్కడికైనా

వెళ్ళాలంటే మా హోటల్ కార్లు వున్నాయి. వాటిలో వెళ్ళొచ్చు" అన్నాడతను.

సోఫాలో రాజు ఠీవిగా కూర్చున్నాడు.

"తమకు ఏదైనా కావాలా?"

"స్కాచ్, సోడా, ఐస్, సమ్ చిప్స్" అన్నాడు రాజు.

"వెంటనే పంపుతాను సార్" అని బండ్రోతు బయటకు వెళ్ళిపోయాడు.

టెలిఫోన్ మ్రోగింది. రాజు వెళ్ళి రిసీవర్ని ఎత్తాడు.

"హలో!" అన్నాడు.

"మైడియర్ ఫ్రెండ్, డిసూజా హియర్! గది మీకు నచ్చిందా?"

"స్వర్గంలా వుంది. మీకు చాలా థాంక్స్."

"రాత్రి పన్నెండింటికి మీ గదికి వస్తాను. అప్పుడు మాట్లాడుకుందాం. అంతవరకూ ఎంజాయ్ మై ఫ్రెండ్!" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

వాట్ 69 స్కాచ్ విస్కీ సేవిస్తూ రాజు సోఫాలో కూర్చున్నాడు. గోవాలో తనకింత రాజభోగం చేకూరుందని అతడు కలలో కూడా అనుకోలేదు.

రాజు మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. ఆడమ్‌డిసూజా తన్ని ఇంతగా ఎందుకు గౌరవిస్తున్నాడు? అతడు రహస్యంగా మోర్ఫిన్ కొని అమ్ముతున్నాడు. దాని మూలంగా అతడికి లక్షలకు లక్షలు లాభింవస్తూ వుండాలి. కాని తన పేరు బయటపడితే ఆ లాభాలన్నీ ఎగిరిపోతాయి. ఎన్నో సౌకర్యాలు తనకు సమకూర్చి తన గురించి ఎక్కడా మాట్లాడొద్దని ఆడమ్‌డిసూజా హెచ్చరిస్తున్నాడు.

టైమ్ పది దాటింది. రాజు గదిలోంచి బయటకు నడిచి తాళంవేశాడు. ఇప్పుడు తనకు బెంగలేదు. సూట్ కేసుని మేనేజర్‌కి అప్పగించాడు. హుషారుగా హోటల్ వెనక వైపునున్న బీచ్‌కి నడిచాడతను.

ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. చంద్ర కాంతికి తోడుగా బీచ్‌లో లైట్లు వెలుగుతున్నాయి.

బీచ్‌లో తిరిగేవాళ్ళలో సగంపైన విదేశీయులే!

ఆడవాళ్లూ, మగాళ్ళూ యిసుకలో దొర్లుతున్నారు. వాళ్ళ మొహాలుచూస్తే ఏదో మత్తుమందు సేవించినట్లు వున్నారు. బీచ్‌లో అనేకమంది హిప్పీలు సంచరిస్తున్నారు.

సముద్రపు ఒడ్డుకు నడచాడు రాజు. అరేబియన్ సముద్రంవైపు చూశాడతను. కెరటాలు భయంకరంగా దూసుకొచ్చి హోరుమంటూ పగులుతున్నాయి.

అమాంతంగా ఎవరో అతడి వీపుమీద చెయ్యివేశారు. త్రుళ్ళిపడ్డా అతడు వెనక్కితిరిగి చూశాడు.

కలేల్కర్! తనతో ట్రెయిన్‌లో ప్రయాణంచేసిన కలేల్కర్!

"మిష్టర్ ప్రదీప్, భూమి గుండ్రంగా వుంది. మనం మళ్లా కల్సుకున్నాం" అన్నాడతను.

"ఫైన్ నైట్" అన్నాడు రాజు.

రాజు అతడివైపు సూటిగా చూశాడు. అతడి కళ్ళు యెర్రగా వున్నాయి. యేదో అసహజమైన హుషారు కలేల్కర్‌ని ఆవరించినట్లుంది.

"హాట్ డ్రింక్స్ సేవించారా?" అడిగాడు రాజు.

"నాకవి చాలవు. మోర్ఫిన్ సేవిస్తేగాని నేను వుండ లేను. అందుకే యిక్కడికొస్తూ వుంటాను. యిక్కడ

సులువుగా మోర్ఫిన్ లభిస్తుంది" అన్నాడు కరేల్కర్.

"ఇక్కడ ఎవరు అమ్ముతారు?" ప్రశ్నించాడు రాజు.

"మీరు పోలీస్ ఆఫీసరు కాదుగా?" అన్నాడు కరేల్కర్ గంభీరంగా నవ్వుతూ.

అతడి చెయ్యి పట్టుకున్నాడు రాజు.

"నేనూ మీలాంటివాడినే కాని నాకింకా నార్కోటిక్స్ అలవాటులేదు. ఇక్కడకొచ్చి స్మాక్ సేవించి పోతూవుంటాను. ఇక్కడ స్వర్గంలా వుంటుంది. ఇంత హేపీ ప్లేస్ మన దేశంలో మరెక్కడా లేదు" అన్నాడు రాజు.

ఇద్దరూ యిసుకలో కూర్చున్నారు. కొంత సేపయ్యే సరికి కరేల్కర్ గురక పెడ్తూ నిద్రపోతున్నాడు.

రాజు టైమ్ చూశాడు. పదకొండు కావస్తోంది. పన్నెండింటికి ఆడమ్‌డిసూజా తన గదికి వస్తానన్నాడు.

రాజు లేచాడు. నిద్రపోతున్న కరేల్కర్‌కి గుడ్ నైట్ చెప్పి అతడు యిసుకలో నడవసాగాడు.

అమాంతంగా రెండు చేతులు అతడిని చుట్టేశాయి. తెల్లటి చేతులు. అతడు పక్కకు తిరిగి మధ్య వయసులో వున్న ఒక విదేశీ స్త్రీవైపు చూశాడు. ఆమె బ్రాశియర్ అండర్ వేర్‌తో వుంది. ఆమె వేసుకున్న డైమండ్ రింగ్ మెరుస్తోంది.

"లీవ్ మి!" అర్చాడతను.

"రికీ, ఐ లవ్ యు!" అందామె.

"నేను నీ రికీని కాను" అన్నాడతను.

"ఆస్ట్రియానుంచి నీతో కలిసి వచ్చాను. ఇక్కడ నన్ను వదిలేయకు! అబద్ధాలాడకు!" అందామె.

రాజు బలంగా ఆమెను తోసేశాడు. ఆమె ఇసుకలో

పడింది. అతడివైపు కళ్ళు చిట్లిస్తూ చూసింది.

"నువ్వు రికీకాదు! రికీ యెక్కడున్నాడు?" అడిగిం దామె.

"నువ్వే కనుక్కో!" అని రాజు వేగంగా హోటల్ వైపు వెళ్ళిపోయాడు.

వెనకవైపు నుంచి రాజు తన గదికి చేరుకున్నాడు. గ్లాసులో వాట్ 69 విస్కీ పోసుకొని సోడా కలిపి, ఐస్ క్యూబ్స్ వేశాడు. గ్లాసులోని విస్కీని గడగడ తాగేశాడు.

సిగరెట్ వెలిగించాడు. పొగవదులుతూ మళ్లీ గ్లాసును నింపుకున్నాడు.

ఎవరో తలుపును తట్టారు. రాజు వెళ్ళి తలుపు తెర్చి చూశాడు. బయట బండోలీ నిలబడి వున్నాడు.

"బాస్ కాస్సేపట్లో వస్తున్నారు. మీరిద్దరూ మీ గదిలోనే భోజనం చేస్తారు."

"ఫైన్" అన్నాడు రాజు.

"తలుపు లాక్ చేయకుండా వుంచండి."

"కావలిస్తే తలుపులు తెర్చి వుంచుతాను" అన్నాడు రాజు నవ్వుతూ.

బండోలీ వెళ్ళిపోయాడు. అడమ్‌డినూజా రాకకోసం రాజు ఎదురుచూస్తున్నాడు.

## 5

గదిలో అందమైన పీల్డ్ టేబుల్ అమర్చబడింది. పక్కపక్కన రెండు కుషన్డ్ కుర్చీలు వేయబడ్డాయి. బండోలీ, యిద్దరు యువతులు అంతా సిద్ధంచేశారు.

తలుపు తోసుకొని అడమ్‌డినూజా గదిలోకి వచ్చాడు. అమాంతంగా రాజుని కౌగలించుకున్నాడు.

బండోలీ బయటకు వెళ్ళాడు. ఇద్దరు యువతులు మాత్రం గదిలో వున్నారు. ఇద్దరూ స్కర్టు, టైట్ బ్లౌసెస్ ధరించారు.

"కమాన్ రాజ్, లెటస్ స్టార్ట్!" అన్నాడు ఆడమ్.

ఆడమ్, రాజు కుషన్ కుర్చీల్లో కూర్చున్నారు.

"మేరీ, టీనా, గ్లాసులు నింపండి!" అన్నాడతను.

మేరీ రెండు గ్లాసుల్లో షీవాస్ రీగల్ స్కాచ్ విస్కీ పోసింది. టీనా సోడా పోసి, ఐస్ క్యూబ్స్ పడేసింది.

"చీయర్స్!" అన్నాడు మేనేజర్.

"చీయర్స్!" అన్నాడు రాజు.

ఇద్దరూ తాగడం మొదలుపెట్టారు. ఓరగా రాజు వైపు చూశాడు ఆడమ్‌డినూజా.

"ఈ హోటల్‌కి మేనేజర్, ప్రొప్రయిటర్ నేనే!" అన్నాడు ఆడమ్.

ఆ మాటలు విని రాజు తృళ్ళిపడ్డాడు. తన పక్క కూర్చున్న ఆడమ్‌డినూజా కోటీశ్వరుడు! తను ఒక హోటల్లో బేరర్ అని అతడికి తెలిసివుంటే యింత ఘనంగా తనకు స్వాగతం యిచ్చేవాడా?

లోలోపల రాజు భయపడసాగాడు. తను పేదరికంలో పెరిగాడు. ఇప్పుడు ఎటుచూసినా ధనం కనిపిస్తోంది!

తర్వాత ఆడమ్ చెప్పిన మాటలు రాజుని బాగా కదిలించేశాయి.

"రాజ్, యీనాడు నేను కోటీశ్వరుడిని కావచ్చు. కాని చిన్నతనంలో నేను కొన్ని రోజులపాటు పస్తుండ వలసి వచ్చేది. అమ్మ నన్నూ, నా తమ్ముడినీ పెంచేది.

కూలిపని చేసి మమ్మల్ని పోషించేది. ఒకనాడు ఆకలి భరించలేక హోటల్ బయట డస్టుబిన్‌లో పడేసిన ఆకు లోని ఎంగిలి మెతుకులు నేను తినవలసివచ్చింది. బతకడం కోసం తిన్నాను. తర్వాత పాటుపడ్డాను. విజయాన్ని సాధించాను. కాని అమ్మా, తమ్ముడూ యీ పోటీని తట్టుకోలేక మరణించారు. నాది గట్టి చర్మం. అందుకే అన్నిటికీ తట్టుకొని, బతికి, జయించాను" అన్నాడతను వుద్రేకంతో.

అతడివైపు రాజు భక్తితో చూశాడు.

"మీరున్న స్థితిలో చాలామంది గతాన్ని మర్చిపోతారు. ఒకనాటి తమ పేదరికాన్ని గురించి చాటుకోరు! ఇంత పెద్దవారయినందుకు మిమ్మల్ని నేను మెచ్చుకుంటున్నాను" అన్నాడు రాజు.

ఒక గంటపైగా యిద్దరూ తాగుతూనే వున్నారు. తర్వాత యిద్దరూ డిన్నర్ సేవించారు. రెండు గంటలకు వాళ్ళ పార్టీ ముగిసింది.

ఇద్దరూ సోఫాల్లో కూర్చున్నారు.

రాజు అతడివైపు నవ్వుతూ చూశాడు.

"మీ జీవితంలో ఎన్ని మలుపులో వుండాలి. మీరిదంతా ఎలా సాధించారు?"

ఆడమ్‌డిసూజా పకపక నవ్వాడు.

"రాజ్, కూలిపని చేశాను. కూలిపని చేసేవాడి పొట్ట ఎన్నడూ పూర్తిగా నిండదని త్వరలో నేర్చుకున్నాను. కొన్ని పనులు రహస్యంగా చేస్తే కోట్లు చేతిలోకొస్తాయి. ఆ పనులు చేయడం ప్రారంభించాను."

ఇద్దరు యువతులూ వాళ్ళ ముందుకు వచ్చారు.

"బాస్, ఇంకా మేం చేయవలసిన పని యేదైనా

వుందా?" అడిగింది మేరీ.

"మేరీ, నువ్వు నా గదికి వెళ్ళివుండు. టీనా, నువ్వు నా ఫ్రెండుకి కంపానియన్‌గా యీ రాత్రి వుండు" అన్నాడతను.

మేరీ బయటకు వెళ్ళిపోయింది. ఆడమ్ అతిథితో కరచాలనం చేశాడు.

"మళ్ళా రేపు కల్సుకుందాం. గుడ్ నైట్" అని వెళ్ళిపోయాడు.

గదిలో వున్న టీనా అతడివైపు ఓరగా చూస్తోంది. అతడు ఆమె దగ్గరకు వెళ్ళాడు.

"మిస్ టీనా, ఆ తలుపులాక్ చేసిరా" అన్నాడు.

టీనా మౌనంగా వెళ్ళి తలుపు తాళంచెవిని తిప్పింది. సోఫాలో కూర్చున్న అతడి ముందుకు వచ్చి ఆమె నిలబడింది.

"టీనా, నాతో వుండడం నీ కిష్టమేనా?"

"కాదు" అందామె.

"అయితే ఎందుకు ఒప్పుకున్నావు?"

"నేనీ హోటల్లో చేరి రెండు నెలలే అయింది. ఇటువంటి పనులు చేయవలసి వస్తుందని నాకు తెలియదు" అందామె.

"మిస్ టీనా, నువ్వు నీ యింటికి వెళ్ళిపో!" అన్నాడతను.

"ఆడమ్‌కి తెలిస్తే?"

"నేను పొమ్మన్నానని చెప్పు!"

మిస్ టీనా అతడివైపు భక్తితో చూస్తూ నమస్కరించింది.

"మీకు నా ధన్యవాదాలు" అందామె.

"మిస్ టీనా, వెళ్ళిరా! ఈ చీటీలో నా పేరూ, అడ్రెసూ వున్నాయి. ఎప్పుడైనా ఏదైనా సహాయం కావలిస్తే నాకు ఉత్తరం రాయి" అన్నాడు రాజు.

అతడిచ్చిన చీటీని తీసుకొని ఆమె బయటకు వెళ్ళిపోయింది. అతడు తలుపు మూసి లాక్ చేశాడు. చాలా నిషాగా వుంది. మెల్లిగా వెళ్ళి పరుపుమీద వాలాడు. మరుక్షణంలో అతడికి నిద్రపట్టేసింది.

## 6

ఆకాశంలో విమానం దూసుకుపోతోంది. కిటికీలోంచి రాజు బయటకు చూస్తున్నాడు. ప్లేనులో ప్రయాణం చేయడం అతడికిదే మొదటిసారి!

పొద్దుట ఆడమ్‌డిసూజా అతడిని గదికొచ్చి కల్సుకున్నాడు. అతడికి ఐదువేలు రొక్కం యిచ్చాడు. మరో సూట్‌కేసును విల్‌కిన్స్‌కి అందజేయమని యిచ్చాడు. మద్రాసుకు ఒక ప్లేన్ టికెట్ కూడా అతడు అందించాడు. అదంతా చూసి రాజు చాలా ఆనందించాడు.

మద్రాసు చేరుకోగానే ఒక బూత్‌నుంచి అతడు సీవ్యూ హోటల్‌కి ఫోన్ చేసి 433 గదికి కనెక్షన్ ఇవ్వమన్నాడు.

టెలిఫోన్ మ్రోగుతూనే వుంది కాని యెవ్వరూ రిసీవర్ని ఎత్తలేదు.

"ఆయన లేనట్లున్నారు" అంది ఆపరేటర్.

"మళ్లా ఫోన్ చేస్తాను" అని అతడు రిసీవర్ని పెట్టేశాడు.

తను మోసుకెళ్ళే సూటుకేసులో కొన్ని లక్షలు వున్నాయి. ఆ సూట్‌కేసును విల్‌కిన్స్‌కి తను అంద

జేయాలి.

అతడు తనింటికి ఆటోలో చేరుకున్నాడు. అతడిని చూసి చెల్లెలు వుషారుగా వచ్చింది.

"అన్నయ్యా, నువ్వు లేకపోతే ఎంతో బోర్ కొట్టింది" అంది చెల్లెలు.

అతడామె బుగ్గను మెల్లిగా నిమిరి తల్లి వంక చూశాడు.

"ఏ ట్రెయిన్‌లో వచ్చావురా?" అందామె.

"ప్లేన్లో వచ్చానమ్మా. వాళ్ళే టికెట్ కొని యిచ్చారు. నాకు పైసా ఖర్చులేదు."

"వాళ్ళు మంచివాళ్ళయి వుండాలి" అందామె.

అతడు జవాబివ్వకుండా తన గదిలోకి వెళ్ళాడు. చెల్లెలు గదిలోకొచ్చింది.

"అన్నయ్యా, యీ సూట్‌కేసు బాగుంది. ఇది నీదేనా? ఇందులో యేముంది?"

"చెల్లీ, ఇది వాళ్ళది. ఇందులో ఏవో ఆఫీసుపత్రాలు వున్నాయి. అవి మనం చూడకూడదు" అన్నాడతను.

రాజు స్నానం చేశాడు. భోజనం ముగించి అతడు బయటకు వెళ్ళాడు. మళ్ళా ఫోన్ చేశాడు. ఆపరేటర్ కంఠం అటువైపునుంచి వినపడింది.

"రూమ్ నంబర్ 333" అన్నాడతను.

"మిష్టర్, జానీ విల్కిన్స్ గది ఖాళీచేసి వెళ్ళిపోయారు" అందామె.

"ఎప్పుడు తిరిగొస్తారు?"

"తెలియదు. మీ పేరు చెప్పండి. ఆయన వస్తే చెప్తాను."

"డోంట్ బాదర్" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

సూట్ కేసును అతడు భద్రంగా బీరువాలో దాచాడు. తన సెలవు అయిపోయింది. అతను మళ్ళీ తన పనిలో చేరిపోయాడు.

రోజులు గడిచిపోతున్నాయి. పదిరోజులు దొర్లిపోయాయి. రోజూ రాజు సీవ్యూ హోటల్ కి వెళ్ళి తన పని ముగించుకుని తిరిగి వస్తున్నాడు.

ఆనాడు శనివారం. బార్రూమ్‌లో లైట్లు వెల్గుతున్నాయి. ఒక వ్యక్తి నడుస్తూ వచ్చి టేబులుముందు కూర్చున్నాడు.

రాజు అతడి దగ్గరకు వెళ్ళాడు.

"ఆర్డర్స్, సార్" అన్నాడు రాజు.

అతడు కళ్ళు చిట్లించి రాజువైపు చూసాడు. కాని రాజు మౌనంగా వుండిపోయాడు.

"రాజ్, విల్ కిన్స్ నేనే!"

రాజు గుండె దడదడలాడింది. అతడివైపు రాజు పరీక్షగా చూశాడు. ఎక్కడా పోలిక లేదు. పూర్తిగా అతడి రూపం మారిపోయింది.

"నీ పని ఎంతకు అయిపోతుంది?"

"ఇవాళ తొమ్మిదింటికి, సార్"

"నా గదికిరా. రూమ్ నం. 32, హోటల్ మిడ్లాండ్."

"అలాగే సార్."

"ప్రస్తుతం నా పేరు విలియమ్ స్ట్రాంగ్."

"గుర్తుంటుంది."

"ఒక బడా పెగ్ స్కాచ్ విస్కీ, చిప్స్ పట్రా."

రాజు అక్కడనుంచి కదిలాడు. గ్లాసును అతడిముందు పెట్టాడు. చిప్స్‌ను వుంచాడు.

"ఎందుకింత మార్పు?"

"మనం కల్సుకున్నాక నీకు చెప్తాను. ఇప్పుడు చెప్ప లేను."

"యస్సార్" అన్నాడు రాజు.

ద్వారంలో నిలబడి రాజు అతడివైపు చూస్తూ వుండి పోయాడు. కొంతసేపయ్యాక అతడు బిల్లు తెమ్మన్నాడు. రాజు బిల్లు పట్టుకెళ్ళాడు.

వందరూపాయిల నోటును అతను ప్లేటులో పడే శాడు.

"క్కీవ్ ది ఛేంజి" అని అతడు వెళ్ళిపోయాడు, నంటుతూ.

# 7

సరిగ్గా పదింటికి రాజు హోటల్ మిడ్లాండ్‌కు చేరు కున్నాడు. రిసెప్షన్ కౌంటరు ముందుకు వెళ్ళకుండా అతడు తిన్నగా రూమ్ నంబరు 32కి వెళ్ళాడు. తలుపును తట్టాడు.

తలుపు తెరవబడింది. రాజు లోపలకు వెళ్ళాడు. జానీ విల్‌కిన్స్ అతడిని కౌగలించుకున్నాడు.

"ఇదిగో మీ సూట్‌కేసు. ఇది కీ" అని రాజు అతడి కిచ్చాడు.

అతడు తాళం తెర్చాడు. లోపలున్న నోట్లకట్టలను చూసుకున్నాడు. పెట్టెని మూశాడు.

రెండు గ్లాసుల్లో విస్కీ పోసి, ఒక గ్లాసును రాజు కిచ్చాడు. సోఫాలో పక్కపక్కనే కూర్చుని యిద్దరూ తాగసాగారు.

విల్‌కిన్స్ అతడి చెయ్యి పట్టుకున్నాడు.

"మైడియర్ రాజ్, యూ ఆర్ ఎ గుడ్ అండ్ గ్రేట్ మేన్! నీకు పదివేలు ఇస్తానన్నాను. దాన్ని

కొద్దిగా మారుస్తున్నాను!" అన్నాడతను.

"మీరు తగ్గించి యిచ్చినా నేను బాధపడను" అన్నాడు రాజు.

జానీవిల్కిన్స్ గంభీరంగా నవ్వాడు.

"తగ్గించడమా, నెవ్వర్! నీకు పదివేలకు బదులు లక్షరూపాయిలు యిస్తాను."

రాజు నోటమ్మట మాట పెగల్లేదు.

"అంత ఎందుకు సార్?" అడిగాడు రాజు.

"మెడియర్ రాజ్, మేం పని చేసే రంగంలో మోసాలు ఎక్కువగా జరుగుతూ వుంటాయి. నీలాంటి ఆనెస్టు మెన్ ఎక్కడో గాని వుండరు. నువ్వు తిరిగివచ్చే సరికి నేను లేను. డబ్బుతో నిండిన యీ సూట్ కేసు నీ దగ్గర వుంది. అదంతా నువ్వు కొట్టేసే నేను ఏం చేయ గలను? నువ్వలా చెయ్యలేదు. నేను కనబడగానే నాకు తెచ్చి అప్పగించావు."

"బేరర్ పని రిసైన్ చేద్దామనుకున్నాను. కాని మీకోసం అందులో వుండవలసి వచ్చింది. నీవ్యూ హోటల్ బాత్రూమ్‌కి మీరు ఎప్పుడో వస్తారని నాకు తెలుసు" అన్నాడు రాజు.

"స్వీట్ వార్త యిప్పుడు చెప్తాను. నాకోసం ఇంటర్ పోల్ అన్వేషిస్తోంది. ఇంటర్ పోల్ పంపిన సమాచారం మూలంగా యిక్కడి పోలీసులు నాకోసం వెతుకు తున్నారు. అందువలన కొంతకాలంపాటు నేను స్వయంగా ఏదీ చెయ్యను."

గ్లాసులో అతడు మళ్లా విస్కీ పోశాడు.

"రాజ్, నీ ఉద్యోగం మారేయి. ఇటుపైన నువ్వు నాకు రైట్ హేండ్‌గా వుండాలి. స్మగ్లింగ్ అందరూ

చెయ్యలేరు. దానికి చాలా శక్తిసామర్థ్యాలు కావాలి. అందులో నీకు ట్రెయినింగ్ యిస్తాను. ఇటుపైన నా తరఫున నువ్వు అంతా చేస్తూ వుంటావు. నాకు అనేక పేర్లు వున్నాయి. అనేక పాస్‌పోర్టులమీద నేను ప్రయాణం చేస్తూ వుంటాను. ఈ ప్రపంచంలోని అనేక దేశాలకు నేను మోర్ఫిన్ రహస్యంగా పంపుతున్నాను."

ఆశ్చర్యంతో అంతా విన్నాడు రాజు. అతడు చేసే దానిలో కోట్లు వున్నాయి. అతడితో చెయ్యి కలిపితే తనూ ధనవంతుడు కావచ్చు!

"రాజ్, నాతో చేర్తావా?"

"చేర్తాను, సార్."

"ఇటుపైన నేను హోటల్లో వుండను. మద్రాసు పరిసరాల్లో వున్న ఏ ప్రదేశంలోనో ఒక చిన్న ఇల్లు అద్దెకు తీసుకుంటాను. అక్కడ వుంటాను. ఏం చెయ్యవలసిందీ అక్కడ నీకు చెప్తూ వుంటాను."

"అక్కడకూడా పోలీసులు మీకోసం వెతకొచ్చు" అన్నాడు రాజు.

"వాళ్ళు నన్ను పోల్చలేరు. ఒక ముసలిదానిరూపంలో అక్కడ వుంటాను."

రాజు నవ్వాడు.

"యూ ఆర్ టెరిఫిక్, సార్!" అన్నాడు రాజు.

"రాజ్, నాకోసం యిరవై దేశాల్లోని పోలీసులు గత యిరవై ఏళ్ళుగా గాలిస్తున్నారు. కాని వాళ్ళు నన్ను ఎన్నడూ పట్టుకోలేరు. పోలీసులు వస్తున్నారని తెలుసుకొని ముందుగానే నేను మరోచోటుకు పోయేవాడిని."

"మీ అంత అడ్వెంచర్ అందరికీ వుండదు!" అన్నాడు

రాజు.

"స్మగ్లింగ్ అడ్వాంచర్స్‌కు చాలా జ్ఞానం కావాలి. దేశాల జాగ్రఫీ బాగా తెలియాలి. ఇదంతా నేను నీకు నేర్పుతాను. ఇటువైపు వచ్చే లాభాలను యిద్దరం సమానంగా పంచుకుందాం" అన్నాడు జానీ విల్‌కిన్స్.

"సమ్మతిస్తున్నాను, సార్."

కొన్ని నోట్లకట్టలను అతడు ఒక బాగ్‌లో పెట్టి రాజుకిచ్చాడు.

"లక్ష నీకిస్తున్నాను."

"మీకు నా ధన్యవాదాలు, సార్."

"రాజ్, నాకోసం ఒక చిన్న యిల్లు చూడు. వెంటనే అక్కడకు మారాలి."

"చూస్తాను, సార్."

"సమీపంలో ఫోన్ వుండాలి."

"అలాగే, సార్."

రాజు తన బాగ్‌ను తీసుకొని బయటకు నడిచాడు. అంత డబ్బు తనకొస్తుందని అతడు కలలోకూడా అనుకోలేదు.

హోటల్ బయటకొచ్చి అతడు టాక్సీలో కూర్చుని తలుపు మూశాడు. ఎటు వెళ్ళాలో డ్రయివర్తో చెప్పాడు.

ఒక వైన్ షాపుముందు అతడు టాక్సీని ఆపాడు.

"డ్రయివర్, పీటర్ స్కాచ్ విస్కీ బాటిల్ పట్రా" అని డ్రయివర్‌కి డబ్బిచ్చాడు.

కాస్సేపట్లో డ్రయివర్ బాటిల్ని తెచ్చాడు.

చిల్లర్ని అతడికివ్వబోయాడు.

"కీపిట్!" అన్నాడు రాజు నవ్వుతూ.

అతడి యింటిముందు టాక్సీ ఆగింది. అతడు డబ్బు

చెల్లించి లోపలకు వెళ్ళాడు.

హాల్లో లైటు వెలుగుతోంది. అతడు కుర్చీలో కూర్చున్నాడు.

"అమ్మా, యీ యిల్లు వదిలేసి పెద్ద యింట్లోకి మారిపోదాం" అన్నాడతను.

"నీ దగ్గర బాగా డబ్బు వూరుతోందేమిట్రా?" అంది తల్లి.

"నేనొక వ్యాపారంలో పార్ట్నర్ గా చేరాను. మనకు ఆదాయం ఎక్కువగా వస్తుంది."

"పెద్దింటికి పోదాం" అంది చెల్లెలు.

అతడు తల్లివైపు చూశాడు.

"చెల్లెలు పెళ్ళి చేసేద్దాం రెండు మూడు నెలల్లో!"

"అంత తొందరెందుకు అన్నయ్యా? పెద్ద యింట్లో నేనుండకూడదా?" అడిగింది చెల్లెలు.

అతడు నవ్వుతూ చెల్లెలువైపు చూశాడు.

"నువ్వు, నీకాబోయే భర్తా నాతోనే పెద్దింట్లో వుండొచ్చు. నేను తిరుగుతూ వుంటాను. అమ్మకు మీరే సాయంగా వుండాలి" అన్నాడు రాజు.

"ఎక్కడికి వెళ్ళాలిరా?"

"ప్రస్తుతం తెలియదు. నేపాల్ వెళ్ళొచ్చు. వ్యాపారంమీద అనేకచోట్లకు వెళ్ళవలసి వుంటుంది" అని రాజు తన గదిలోకి మెల్లిగా వెళ్ళిపోయాడు.

చెల్లెలు అతడి వెనకనే గదిలోకి కదిలింది.

## 8

పాండీ సమీపంలో వున్న వినాయక నగర్ లో ఒక చిన్న యింటిముందు స్కూటర్ ఆగింది.

రాజు దిగాడు. పిట్టగేటు తెర్చుకుని లోపలకు

వెళ్ళాడు. ముందు మెట్లెక్కి తలుపును తట్టాడు.

తలుపు తెరవబడింది. బ్లూ గౌన్ ధరించిన ఒక ఆంగ్లో ఇండియన్ ముసల్ది అతడివైపు నవ్వుతూ చూసింది. ముందు పళ్ళు లేవామెకు.

ఆమె జుత్తు బాగా నెరిసింది. ఆమె వంగి నడుస్తోంది, బ్లూ గౌన్ మీద అక్కడక్కడ మరకలు వున్నాయి.

రాజు ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాడు.

"మిస్టర్ జానీవిల్‌కిన్స్, యూ ఆర్ గ్రేట్! మేకప్ మీ దగ్గర నేర్చుకోవాలి" అన్నాడు రాజు.

అతడు నవ్వాడు.

"ముందు తలుపు మూసిరా!" అన్నాడతను.

ముందు తలుపును రాజు మూశాడు. ఇద్దరూ పడగదిలోకి వెళ్ళారు. ఏర్‌కండిషండ్ రూమ్.

"ఈ గదిలో మనం ఏం మాట్లాడినా ఎవ్వరికీ వినపడదు. ఇది సౌండ్ ప్రూఫ్ గది" అన్నాడతను.

"అఖండంగా వుంది, సార్."

అతడు రాజువైపు చూశాడు.

"నువ్వు మళ్ళా గోవాకు వెళ్ళాలి. ఈసారి ప్లేనులో వెళ్ళు. ఎక్కువగా మన స్టఫ్ అడమ్‌కి రావాలి. దాన్ని అతడు గల్ఫ్‌దేశాలకు పంపబోతున్నాడు. మనకు ఈసారి యిరవై లక్షలు యిస్తాడు" అన్నాడతను.

"ఎప్పుడు వెళ్ళాలి?"

"వెంటనే ఏస్ టికెట్ రిజర్వ్ చేసుకో. అంతా రెడీగా వుంది."

"అలాగే సార్" అన్నాడు రాజు.

మర్నాడు విమానంలో అతడు గోవాకు చేరుకున్నాడు. పనాజీ పట్నంలో వున్న హోటల్ సెంటినల్‌కు వెళ్ళా

డతను.

మేనేజర్ని కల్సుకున్నాడు.

"మిస్టర్ రాజ్ మీరు మళ్ళా వచ్చినందుకు సంతోషం" అన్నాడతను.

"ఐయామ్ యాక్చ్యల్లీ హేపీ" అన్నాడు రాజు.

సూట్ కేసును అతడికిచ్చాడు. దాన్ని తెర్చి అందులోని మోర్ఫిన్ని అతను చేత్తో పట్టుకు చూశాడు.

"ఫైన్" అన్నాడతను.

"నేను రేపు వెళ్ళిపోవాలి!" అన్నాడు రాజు.

"పొద్దుటే అంతా రెడీ చేస్తాను. మీకు పదివేలు ప్రెజంటుగా యిస్తాను."

"థాంక్స్" అన్నాడు రాజు.

మేనేజర్ బజ్జర్ నొక్కాడు. మేరీ గదిలోకి వచ్చింది.

"ఈయనకు ఎ.సి. రూమ్ యివ్వండి. ఈయన నా గెస్టు" అన్నాడు ఆడమ్డిసూజా.

"అలాగే సార్" అందామె.

"రాత్రి కల్సుకుందాం" అన్నాడు ఆడమ్.

రాజు ఆమె వెనకనే వెళ్ళి అందంగా వున్న ఏర్ కండిషండ్ గదిలోకి చేరుకున్నాడు.

హాల్లో నిలబడి ఆమెవైపు చూశాడు.

"మునుపు యిక్కడ టీనా అనే యువతి వుండాలి. ఆమె యేమైంది?" ప్రశ్నించాడతను.

మేరీ నవ్వింది.

"అవకాశాలను ఉపయోగించుకోలేని మనిషామె. జాబ్ మానేసి వెళ్ళిపోయింది" అంది మేరీ.

"ఆమె యింటి అడ్రెసు తెలుసా?"

"మీకు కావలిస్తే రాసియిస్తాను" అంది మేరీ.

"కావాలి" అన్నాడతను.

హోటల్ లెటర్ హెడ్ మీద టీనా అడ్రెసురాసి ఆమె యిచ్చింది.

"మీకేదైనా కావాలా?" అడిగిందామె.

"స్కాచ్ విస్కీ" అన్నాడతను.

"వెంటనే పంపుతాను" అని ఆమె వెళ్ళిపోయింది.

టెలిఫోన్ మ్రోగింది. అతడు రిసీవర్ని ఎత్తాడు.

"హలో!" అన్నాడు.

"ఆడమ్ హియర్! కావలిస్తే మేరీని మీ గదిలో వుంచుకోండి" అన్నాడతను.

"నో, ప్లీస్.... నేనొక యువతిని ప్రేమిస్తున్నాను."

ఆడమ్ నవ్వాడు.

"ప్రేమ వేరు, కంపానియన్‌షిప్ వేరు."

"ఎనీ వే మీకు థాంక్స్" అని రాజు రిసీవర్ని పెట్టేశాడు.

ఒంటిగంటదాకా రాజు గదిలో కూర్చుని స్కాచ్ విస్కీ సేవించాడు. గదికి తాళంవేసి అతడు కిందకు దిగాడు. హోటల్ కారును తనే నడుపుతూ బయటకు పోనిచ్చాడు.

మాడన్ స్ట్రీట్‌లో వున్న ఒక యింటిముందు అతడు కారు ఆపాడు, కిందకు దిగాడు. ఇంటి నంబరువైపు చూశాడు. తనకు కావలసిన యిల్లు అదే!

అతడు మెట్లెక్కి ముందు తలుపును తట్టాడు. తలుపు తెర్చి టీనా అతడివైపు చూసింది.

"మీరా?" అందామె.

"గుర్తున్నానా?" అడిగాడతను.

"బాగా" అందామె.

"ఇంట్లో ఎవరున్నారు?"

"అమ్మ. ఆమె తప్ప నాకెవ్వరూ లేరు. ఆమె బెడ్ రిడెన్. లేవలేదు. అలాగే పడుకుని వుంటుంది" అందామె.

"నీతో మాట్లాడాలి. కారులో అలా వెళ్దాం రా."

"వుండండి" అని ఆమె లోపలకు వెళ్ళింది.

అతడు గుమ్మం ముందే నిలబడి వున్నాడు.

కాసేపట్లో ఆమె వచ్చింది.

"పదండి వెళ్దాం. నన్ను త్వరగా యింటి దగ్గర దింపేయాలి" అందామె.

ఆమె యింటిముందు తలుపు మూసి తాళం వేసింది. ఇద్దరూ కారులో కూర్చున్నారు.

"నువ్వు భోజనం చేశావా?" అడిగాడతను.

"ఇంకా తినలేదు."

"అయితే మనం హోటల్ ఫీస్టాలో లంచ్ తీసుకుందాం" అన్నాడతను.

"అక్కడ లంచ్ ఖరీదు చాలా ఎక్కువ!" అందామె.

"నిన్ను చౌకబారు హోటళ్ళకు తీసుకెళ్ళడం నాకు ఇష్టంలేదు" అన్నాడతను.

అతడు కారును పోనిస్తున్నాడు. ఓరగా ఆమెవైపు చూస్తున్నాడు. టీనా అందం అతడిని విపరీతంగా ఆకర్షిస్తోంది.

"ఆ హోటల్లో ఉద్యోగం ఎందుకు మానేశావు?" అడిగాడతను.

"వాళ్ళిచ్చే జీతంకోసం నేను నా శరీరాన్ని అర్పించదల్చుకోలేదు" అందామె.

"నువ్వు ఎవరినైనా ప్రేమిస్తున్నావా?"

"లేదు" అందామె.

"ఉద్యోగం కోసం వెతుకుతున్నావా?"

"అదీ మా నేశాను. అందమైన యువతులు ఉద్యోగం చేయడం కష్టతరమనిపిస్తోంది."

అతడామె చేయిని పట్టుకొని నిమిరాడు.

"టీనా, నువ్వు చాలా అందంగా వున్నావు. నీలాంటి యువతి ఉద్యోగం చేయకూడదు" అన్నాడతను.

హోటల్ ఫీస్టా కాంపౌండులో కారాపి యిద్దరూ దిగారు. డైనింగ్ రూమ్ లోకి వెళ్ళారు. వెస్టర్న్ మ్యూసిక్ శ్రావ్యంగా వినబడ్తోంది.

ఇద్దరూ యెదురెదురుగా కుర్చీల్లో కూర్చున్నారు. బేరర్ పరుగెత్తుకొచ్చాడు. అతడివైపు నవ్వుతూ చూశాడు రాజు. మెనూకార్డు చూసి కావలసినవి అతడు ఆర్డరిచ్చాడు. బేరర్ వెళ్ళిపోయాడు.

రాజు ఆమెవైపు నవ్వుతూ చూశాడు. ఆమె పెదిమలు సహజంగా యెర్రగా వున్నాయి. ఆమె విశాల నేత్రాలు అఖండంగా మెరుస్తున్నాయి.

రాజు ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"నిన్ను ఆ రోజు చూశాను. అప్పటినుంచీ నిన్నే ప్రేమిస్తున్నాను. ఐ లవ్ యు! నిన్ను నేను వెంటనే పెళ్ళాడ్తాను" అన్నాడతను.

ఆమె అతడి కళ్ళలోకి చూసింది.

"ఆనాడు మీతో నాకు వుండాలని వుంది. మీరు నన్ను అమితంగా ఆకర్షించారు. కాని మీరు వెళ్ళమంటే వెళ్ళిపోగలను" అందామె.

"టీనా, నేను వెళ్ళమనలేదు. నాతో వుండడం యిష్టంలేకపోతే వెళ్ళిపో..న్నాను" అన్నాడతను.

"మీరు మళ్లా వస్తారని నాకు తెలుసు. అందుకే ఆ ఉద్యోగం మానేశాను. మీ రాకకోసం ఎదురుచూస్తున్నాను" అందామె.

టేబుల్ నిండా బేరర్ ఎన్ని ప్లేట్లో పెట్టాడు.

"ఇంత తినగలమా?" అడిగిందామె.

"నీ ప్రేమ కథ విన్నాక నాకు చాలా ఆకలిగా వుంది. ఎంతైనా తినేస్తాను" అన్నాడతను.

"చూస్తాను" అందామె.

అరగంటలో టేబుల్ మీదున్న ప్లేటన్నీ ఖాళీ అయ్యాయి. బేరర్ బిల్లు తెచ్చాడు. రాజు రెండు వంద రూపాయిల నోట్లను ప్లేటులో పడేశాడు.

"మిగిలిన చిల్లర నీకు" అన్నాడు రాజు బేరర్‌తో.

"చాలా థాంక్స్ సార్" అన్నాడు బేరర్.

ఇద్దరూ కారు దగ్గరకు మెల్లిగా నడిచారు.

# 9

ఆడమ్‌డిసూజా రాజుకి సూట్‌కేసు, తాళంచెవి యిచ్చాడు.

"రాజ్, క్రితంసారి చిన్నతనంలో నేనెంత కష్టపడ్డానో నీకు చెప్పాను. ఇప్పుడు ఒక ముఖ్య విషయం చెప్తున్నాను. నా జీవితం మారడానికి ముఖ్య కారకుడు జానీవిల్‌కిన్స్. అతడి మూలంగా నేను కోటీశ్వరుడిని అయ్యాను" అన్నాడు ఆడమ్.

పదివేలు రొక్కంగా అతడు రాజుకిచ్చాడు.

"ఇది నీ ప్లేన్ టికెట్" అన్నాడు ఆడమ్.

రాజు అన్నీ తీసుకున్నాడు. ఆడమ్‌డిసూజాతో కరచాలనం చేశాడు.

"మీ హోటల్ కారులో నేనొకసారి అలా వెళ్ళి

వస్తా" అన్నాడు రాజు.

"గుడ్ లక్" అన్నాడు ఆడమ్.

ఆడమ్ తన ఆఫీసుకు వెళ్ళిపోయాడు. బీరు తాగుతూ కూర్చున్నాడు రాజు. జానీ విల్ కిన్స్ గురించి అతడు ఆలోచిస్తున్నాడు. ఆడమ్‌డినూజా పైకి వచ్చినట్లే జానీ విల్ కిన్స్ మూలంగా తను పైకి వెళ్ళొచ్చు.

గ్లాసులోని బీరు అయిపోయింది. అతడు బయటకు నడిచి గది తలుపుమూసి తాళం వేవాడు. కిందకు వెళ్లాడు.

ఒక హోటల్ బాయ్ రాజువైపు చూశాడు.

"మేనేజర్ గారు మిమ్మల్ని వెంటనే రమ్మన్నారు" అన్నాడతను.

సమీపంలో వున్న మేనేజర్ గదిలోకి రాజు వేగంగా వెళ్లాడు.

ఆడమ్‌డినూజా వెక్కి వెక్కి యేడుస్తున్నాడు....

"ఏమైంది?" అడిగాడు రాజు.

తన టేబుల్ మీదున్న టెలెక్స్ వార్తను ఆడమ్‌డి నూజా అతడికిచ్చాడు. అది చదివి రాజు విచారంతో యేడ్వసాగాడు.

ఇద్దరూ కొంతసేపు మౌనంగా నిలబడ్డారు.

"జానీవిల్ కిన్స్ ఆత్మకి శాంతి చేకూర్చమని దేవుడిని ప్రార్థించుదాం" అన్నాడు ఆడమ్.

టెలెక్స్ వార్తను రాజు మళ్లా చదివాడు. వినాయక నగర్ లో రహస్యంగా జీవిస్తున్న జానీవిల్ కిన్స్ యింటి మీద పోలీసులు దాడి జరిపారు. వాళ్ళకు దొరకడం యిష్టంలేక అతను పిస్టల్ తో షూట్ చేసుకు మరణించాడు. పోలీసులు యింటిని సోదా చేస్తున్నారు!

"మనల్ని గురించి యేదేనా వాళ్ళకు తెలుస్తుందా?"

అడిగాడు రాజు.

"విల్‌కిన్స్ అసాధ్యుడు. యెవర్ని గురించీ క్లూస్ వదలడు" అన్నాడు ఆడమ్.

ఆడమ్‌డినూజా అతడివైపు సూటిగా చూశాడు.

"రాజ్, ఆ సూట్‌కేసులో వున్న డబ్బును మీరు ఏం చేయదల్చారు?"

"ఏం చేయమంటారు?" అడిగాడు రాజు.

"అది మీది. మీ యిష్టం" అన్నాడు ఆడమ్.

"దాన్ని సద్వినియోగం చేస్తాను" అన్నాడు రాజు.

ఆడమ్‌తో కరచాలనం చేసి రాజు బయటకు నడిచాడు. కారును వేగంగా టీనా యింటికి పోనిచ్చాడు.

కారు శబ్దం వినగానే ఆమె తలుపు తెర్చి బయటకు చూసింది. కారు దిగి అతడామెవైపు పెద్ద అంగల్లో వెళ్ళాడు.

"లోపలకు రండి" అందామె.

హాల్లో మంచంమీద ఒక ముసలామె పడుకునివుంది.

"నా తల్లి ఆమే!" అంది టీనా.

అతడు ఆమె పక్కకు వెళ్ళాడు.

"మీ అమ్మాయిని నేను పెళ్ళాడదల్చాను" అన్నాడతను.

"మీరిద్దరూ కావాలంటే నేను వద్దంటానా?" అందామె నవ్వుతూ.

టీనా అతడిని పక్కనున్న పడగ్గదిలోకి తీసుకు వెళ్ళింది.

"ఇవాళ మీరు యిక్కడే భోజనం చేయాలి" అందామె.

"భోజనానికి యిక్కడ కూర్చుంటే ప్లేన్ వెళ్ళిపో

తుంది" అన్నాడతను.

"పోతేపోనీయండి. మీరిప్పుడు వెళ్లొద్దు. మన పెళ్ళి అయ్యాక యిద్దరం వెళ్దాం."

"మా అమ్మా, చెల్లెలూ అక్కడున్నారు!"

"వాళ్ళను యిక్కడకు వెంటనే రమ్మనండి."

"నేను కూడా లేకుండా వాళ్ళు రాలేరు" అన్నాడు రాజు.

"తర్వాత వెళ్దురుగాని లెండి" అంది టీనా.

రాజు ఆమెను బలంగా కౌగలించుకుని ఎర్రటి పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"మన బంధం ఏనాటిదో!" అన్నాడతను.

"ఈనాటిది కాదు!" అందామె ఉద్రేకంతో.

—:అ యి పో యిం ది:—

# సత్యభామ శపథం

ఎమ్. డి. చైతన్య

వేగంగా వెళ్తున్న స్కూటర్ నడిచి వెళ్తున్న ఆ అపరంజి బొమ్మను చూసి ఆటోమెటిక్ గా స్లో అయింది.

స్కూటర్ ను నడుపుతున్న అతని పేరు కృష్ణమోహన్. పాతికేళ్ళుంటాయి. మనిషి అందంగా వుంటాడు. ఖరీదైన బట్టలు వేసుకున్నాడు. పాతిక లక్షల ఆస్తికి అతనొక్కడే వారసుడు.

ఆమెను వెనుక వైపునుంచి చూసి అజంతా శిల్పంలా వుంది అనుకున్నాడు. ఆ అమ్మాయి తప్పకుండా అందంగా వుండి తీరుతుంది అనికూడా అనుకున్నాడు.

అపరంజి బొమ్మ ఫుట్ పాత్ పై హంసలా నడుస్తోంది. అయిదు అడుగుల అయిదు అంగుళాల పొడవు, పొడవుకు తగిన పర్సనాలిటి. పచ్చని మేని ఛాయ. నల్ల త్రాచులా వున్న పొడవైన ఆమె జడ ఆమె పిరుదులపై లయబద్ధంగా నాట్యం చేస్తోంది. పసుపు పచ్చని షిఫాన్ చీర, మ్యాచింగ్ బ్లౌజు, పచ్చని ఆమె శరీరానికి వింత

అందాన్ని సమకూర్చి పెడుతున్నాయి. బంగారు బొమ్మ నడిచిపోతున్నదా అనే అనుభూతి కలిగింది కృష్ణ మోహన్ కు.

సంధ్యా సమయం. ఆ రోడ్డుమీద జనం పలుచగానే వున్నారు.

కృష్ణమోహన్ ఆమె వదనారవిందాన్ని చూడాలని ఆరాటపడి స్కూటర్ ముందుకు తీసుకువెళ్ళి తలతిప్పి వెనక్కి చూశాడు. అతని అంచనా తప్పలేదు. ఆమె భువనమోహనంగా వుంది.

ఆమెతో మాట్లాడాలని ముచ్చటపడ్డాడు. కానీ ఎలా? తను అర్జంటు పనిమీద వెళుతున్నాడు.

అతను మరొక అందమైన యువతి ఇంటికి ఆమె పుట్టిన రోజు పండుగ సందర్భంగా హాజరు కావడానికి వెళుతున్నాడు. ఆమె పేరు రాధ. ఆ ఊళ్ళో పెద్ద బిజినెస్ మాగ్నెట్ గోపాలరావుగారి కూతురు.

రాధ అతని కళ్ళముందు కదులుతో వుంటే ఫుట్ పాత్ మీద కనిపించిన అమ్మాయిని మరచిపోవడం తేలిక అయింది.

రాధ అందగా వుందా? ఫుట్ పాత్ మీద కనిపించిన అమ్మాయి అందంగా వుంది? అతని ఆత్మ అడుగుతుంది.

అతను ఎటూ తేల్చుకోలేక పోయాడు.

రాధ ప్రక్కన దొంతర్లగా పేర్చిన డబ్బు, నగలు కన్పిస్తున్నాయి.

ఫుట్ పాత్ మీద కనిపించిన అమ్మాయి ప్రక్కన పెద్ద క్వశ్చన్ మార్కు బోర్డు వేలాడుతుంది.

క్రమంగా రాధ రూపం అతని మనసంతా ఆక్రమించింది.

రోడ్డుమీద ఎవడో సైకిల్ మీద అడ్డంగా వచ్చాడు.

కృష్ణమోహన్ ఆలోచనల్లోంచి తేరుకొని స్కూటర్ సడన్ బ్రేక్ వేశాడు. కానీ అప్పటికే ఆలస్యం అయి పోయింది.

సైకిల్ వాలా అల్లంత దూరాన పడిపోయాడు. సైకిల్ ఎటో పడిపోయింది.

## 2

గంట ఆలస్యం!

అప్పటికే పురప్రముఖులు రాధ స్నేహితురాళ్ళు, గోపాలరావు బిజినెస్ తాలూకూ వ్యక్తులు వేంచేసారు. ఆ భవనమంతా రకరకాల వ్యక్తులతో సందడిగా వుంది.

ఇంకా కేక్ కట్ చెయ్యడం, బర్త్ డే సాంగ్ పాడటం వగైరా కార్యక్రమం జరగలేదు.

రాధకృష్ణుల శాండల్ వుడ్ విగ్రహాన్ని రాధ పుట్టిన రోజు కానుకగా తెచ్చాడు కృష్ణమోహన్.

విగ్రహం చాలా అందంగా వుంది. శిల్ప కళా ప్రతిభను చాటుతోంది.

ప్రజెంటేషన్ ఆమె చేతిలో పెట్టాడు.

రాధ దాన్ని విశితంగా పరికించి చూసింది. అతను తనకా బహుమతిని ఇవ్వడంలో గల సారూప్యాన్ని అర్థం చేసుకొని చిన్నగా నవ్వుకుంది.

"ఏమిటి ఇంత ఆలస్యం చేశారు?"

"దురదృష్టం వెంటాడింది."

"దురదృష్టమా? అసలేమైంది?"

"యాక్సిడెంట్!"

"మీకా? దెబ్బలేమీ తగల్లేదు కదా!"

"నాకేం దెబ్బలు తగల్లేదు. స్కూటర్ క్రిందికి వచ్చిన

సైకిల్ వాలాకు తల పగిలింది."

"మైగాడ్! అతను ఎలా వున్నాడు."

"ప్రమాదం లేదు. హాస్పిటల్లో చేర్పించి వస్తున్నాను."

వాళ్ళ సంభాషణకు అంతరాయం కలిగిస్తూ—రాధ మిత్రురాలు "హాయ్ రాధ! విష్‌యూ మెనీ రిటర్న్స్ ఆఫ్ ది డే!" అంటూ వచ్చి ఒక పెద్ద ప్యాకెట్ ప్రజంటేషన్‌గా ఇచ్చింది.

కృష్ణమోహన్ ప్రక్కకు తప్పుకున్నాడు. కానీ—ఆ వచ్చినామెను చూసి ఆశ్చర్యంనుండి తేరుకోలేక పోయాడు.

గంట క్రితం ఫుట్‌పాత్‌పై నడుస్తూ కనిపించిన భువనైక సుందరి, ఇందాక జరిగిన యాక్సిడెంటుకు సిసలైన కారకురాలు.

ఆమె తన అంచనా ప్రకారం స్రవంతిలోకి రాకపోతే యాక్సిడెంటు జరగకపోయేది.

మిత్రురాళ్ళు ఇద్దరూ యేవో మాట్లాడుకుంటున్నారు.

కృష్ణమోహన్‌కి మంచి ఛాన్స్ దొరికింది.

ఇద్దర్లో ఎవరు అందగత్తో పోల్చుకోడానికి సరైన అవకాశం.

కొంచెం దూరాన నిలబడి ఇద్దర్నీ మార్చి మార్చి చూడడం మొదలుపెట్టాడు.

ఎవరి అందం వారిదే!

ఒకరు మేనక అయితే—మరొకరు తిలోత్తమ.

రాధ తండ్రి గోపాలరావుగారు దగ్గరుండి బర్త్‌డే కేక్ కోయించి ఒక ముక్క తినిపించడం, అందరూ కలిసి బర్త్‌డే స్లోగన్ పాడడం, ఆ తర్వాత తేనీటి

విందు జరగడం వరసగా జరిగాయి.

అప్పటికి రాత్రి ఎనిమిది దాటింది.

కృష్ణమోహన్ రాధ దగ్గర, గోపాలరావు దగ్గర సెలవు తీసుకొని బయటపడ్డాడు.

స్కూటర్ కొంచెం ముందుకు పోనిచ్చి ఒక కార్నర్ దగ్గర ఆపాడు. అతని ఆలోచనలన్నీ ఆ భువనైక సుందరి చుట్టు గిరగిరా తిరుగుతున్నాయి.

తను ఆ ఇంటినుండి బయటపడేటప్పుడు ఆమె తన స్నేహితుల దగ్గర వీడ్కోలు తీసుకుంటూ• గమనించింది! బహుశ ఈపాటికి ఆమె ఇంట్లోంచి బయులుదేరివుంటుంది.

కృష్ణమోహన్ సిగరెట్టు వెలిగించి__గడియారంకేసి చూసుకున్నాడు.

ఎనిమిదింబావు.

ఆమె వస్తుందేమోనని వీధిలోకి పరికించి చూశాడు.

దూరంగా హంసలా నడుస్తూ ఒక యువతి వస్తూంది.

బహుశా భువనైక సుందరే కావచ్చు. రెప్పవేయకుండా నడచి వస్తున్న ఆమెనే చూస్తున్నాడు.

యస్! భువనైక సుందరి!

ఆమె ఒక చెట్టు దగ్గర ఆగింది. అది బస్ స్టాప్.

అటుగా ఒక ఆటో వెళ్తోంది.

"ఏయ్ ఆటో!" ఆమె కేకవేసి చేయి వూపింది.

ఆటోవాలా ఆమె ఆక్రందనను వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు.

కృష్ణమోహన్ స్కూటర్ స్టార్టుచేసి కూర్చున్నాడు. స్లోగా వెళ్ళి భువనైకసుందరి సమీపంలో ఆపాడు.

ఆమె అతడివైపు చూసింది.

"మీరు రాధగారి ఫంక్షన్‌కి వచ్చినట్లున్నారు"

నెమ్మదిగా పలకరించాడు కృష్ణమోహన్.

క్షణం నిశ్శబ్దం.

"ఆటోకోసమా."

"ఔను. బస్సులు లేవు. ఆటో దొరకడంలేదు."

"మీకు అభ్యంతరం లేకపోతే— నేను మీకు లిఫ్ట్ ఇస్తాను."

"అంతకంటేనా, పదండి!" అందామె.

కృష్ణమోహన్ హృదయం ఆనందంతో పరవశించింది.

ఆమె స్కూటర్ వెనక కూర్చుంది.

"సరిగ్గా కూర్చున్నారా?"

"ఊఁ" అందామె.

స్కూటర్ ముందుకు ఉరికింది.

స్కూటర్ వెళుతున్నంతసేపు ఏమీ మాట్లాడుకోలేదు.

## 3

పావుగంట తర్వాత ఆమె గమ్యం వచ్చేసింది.

అదొక కాలనీ. ఆ కాలనీలోని "సి" టైపు క్వార్టర్లో వుంటుందామె.

"టీ త్రాగి వెళ్ళుదుగానీ రండి" అంటూ ఆహ్వానించింది.

"వద్దండీ" అంటూ మొహమాటపడుతూ అన్నాడు.

"ఫర్వాలేదు రండీ!" అంటూ ఆమె బలవంతం చేసింది.

కృష్ణమోహన్ స్కూటర్ని ఒకప్రక్కగా పార్క్ చేసి ఇంట్లోకి నడిచాడు.

ఆ ఇంట్లో ఎవ్వరూ లేరు. ఆమె ఒక్కతే ఉన్నట్లు గెస్ చేశాడు.

ఆమె కుర్చీ ముందు పెట్టింది.

కృష్ణమోహన్ కూర్చున్నాడు.

ఆ షట్లో రెండు గదులతో పాటు ఒక చిన్న కిచెన్, బాత్‌రూం, లెట్రిన్, చుట్టూ కాంపౌండ్ గోడా వున్నాయి.

ఆమె కిచెన్‌లోకి వెళ్ళి అయిదు నిమిషాల్లో టీ కప్పులతో తిరిగి వచ్చింది.

"టీ తీసుకోండి!" కప్పు అందించింది.

ఆమెకూడా కుర్చీలో కూర్చోని టీ త్రాగడం మొదలు పెట్టింది.

అతను టీ త్రాగుతూ "బావుంది" అని మెచ్చుకున్నాడు.

ఆమె చిన్నగా నవ్వి "థాంక్యూ" అన్నది.

కృష్ణమోహన్ టీ త్రాగుతూ ఆమె అందాన్ని ఆస్వాదిస్తున్నాడు.

ఆ విషయం ఆమె కనిపెట్టి సిగ్గుపడింది.

టీ త్రాగి కప్పు ప్రక్కన పెడుతూ—

"మీ స్వీట్ నేమ్ యేమిటో చెప్పనే లేదు" అన్నాడు.

ఆమె కళ్ళెత్తి అతనివైపు చూస్తూ "సత్యభామ" అన్నది.

"వెరీ నైస్ నేమ్!"

"థాంక్యూ!" సిగ్గుపడుతూ అన్నది.

రెండు క్షణాలు నిశ్శబ్దం.

"మీ పేరేమిటో చెప్పనేలేదు" ఈసారి సత్యభామ అడిగింది.

అతను నవ్వి—"కృష్ణమోహన్!" అన్నాడు.

"చాలా బావుంది మీ పేరు."

"ధాంక్స్! ఇంకో విషయం మీరు గుర్తించారా! మనిద్దరి పేర్ల కు మంచి అనుబంధం ఉంది."

"అనుబంధమా? ఏమిటది?" ఆమె కావాలని అడిగిందో — తెలియక అడిగిందో అతనికి బోధపడలేదు.

అతనికి సమాధానం ఏమి చెప్పాలో తోచలేదు కొంతసేపు.

"శ్రీకృష్ణుడికి పదిహారు వేలమంది భార్యలున్నా సత్యభామ అంటే అతనికి చాలా ప్రీతి. ఆమె వాక్కు అతనికి వేదవాక్కు. ఆమెకోసం అతను యుద్ధాలు చేశాడు. ఆమె కోపానికి గురిఅయి తన్నులు తిన్నాడు. అయినా సత్యభామ అంటే కృష్ణమోహనుడికి ప్రాణం! వాళ్ళ ప్రేమ అజరామరంగా వుంటుంది" అన్నాడు.

"మీరు బాగా మాట్లాడతారండి" అంటూ నవ్వింది ఆమె.

ఆ నవ్వు చాలా అందంగా వుంది.

"మీరు చాలా అందంగా నవ్వుతారండీ! త్రేతా యుగంలోకి ఆ సత్యభామ కూడా అచ్చం ఇలాగే నవ్వి వుంటుంది. అందుకే ఆ కృష్ణమోహనుడికి అంత ప్రేమ ఆవిడ మీద."

"కలియుగంలోని ఈ సత్యభామ నవ్వు ఈ కృష్ణ మోహన్‌కి కూడా నచ్చిందని అర్థం అవుతుంది. యామ్ ఐ కరెక్టు!" సత్యభామ అతని కళ్ళలోకి చూస్తూ అన్నది.

"యూ ఆర్ హండ్రెడ్ పర్సెంట్ కరెక్టు! సత్యభామ నవ్వే కాదు, సత్యభామ హొయలు, సొంపు, అన్నీ నచ్చాయి. కానీ సత్యభామకు ఈ కృష్ణమోహన్ నచ్చాడో లేదో!" అర్థోక్తిలో ఆగిపోయాడు.

సత్యభామ సిగ్గుపడింది.

మామూలుగా కాదు, చాలా అందంగా సిగ్గుపడింది. అలా సిగ్గుపడడం అందరికీ చేతకాదు.

"అబ్బ సిగ్గుపడినా ఎంత అందమో!" అనుకొని.

"సిగ్గుపడితే లాభం లేదండీ....మీ అభిప్రాయం చెప్పండి!" అన్నాడు.

ఆమె విశాలమైన కళ్ళను పైకెత్తి అతనివైపుచూసి "ఐ లవ్ యూ!" అన్నది.

కృష్ణమోహన్ ఆనందంతో ఏనుగు నెక్కినట్లు సంబర పడ్డాడు.

"నా జన్మ ధన్యమైంది" అంటూ ఆమెను కసిగా ముద్దుపెట్టుకున్నాడు.

అనుకోని ఆ సంఘటనకు ఆమె బిత్తరపోయింది.

కొన్ని క్షణాల తర్వాత తేరుకొని నవ్వింది.

కృష్ణమోహన్‌కి మరింత ధైర్యం వచ్చింది.

లేచి ఆమెను కౌగలించుకోబోయాడు.

ఆమె సున్నితంగా వారించింది.

"ఎందుకలా భయపడతావు. నిన్ను పెళ్ళిచేసు కుంటాను" ఏకవచనంలోకి దిగాడు.

"పెళ్ళా? అదెందుకులెండి! మనిద్దరం ఒకర్ని చూసి ఒకరం ఆకర్షితులయ్యాం. మన ఇష్టమున్నంత కాలం కలిసి వుందాం. ఆ తర్వాత విడిపోదాం!"

కృష్ణమోహన్ తన చెవులను తానే నమ్మలేక పోయాడు. తను అడగకముందే వివాహం ప్రసక్తి తీసు కొస్తుంది అనుకున్నాడు. కానీ—ఇలా స్వేచ్ఛాజీవిలా మాట్లాడుతుంది అనుకోలేదు.

"నేను నిజంగానే నిన్ను పెళ్ళి చేసుకోవాలను కుంటున్నాను. బహుశ నా గురించి తెలియదేమో

పాతిక లక్షల ఆస్తికి నేనొక్కడినే వారసుడిని. ఆ ఆస్తినంతా మనం ఆనందంగా అనుభవించవచ్చు" అన్నాడు ఆశగా ఆమెవైపు చూస్తూ.

"చూడండి కృష్ణమోహన్ గారు, నాకు పెళ్ళంటే అసహ్యం. ఎందరో నన్ను పెళ్ళి చేసుకోవడానికి ముందుకొచ్చారు. నేను తిరస్కరించాను. కావాలంటే మనిద్దరం కొంతకాలం ఆనందంగా గడుపుదాం. లేదా—మీ దారి మీది—నా దారి నాది" నిష్కర్షగా చెప్పేసిందామె.

"రైట్, అలాగే కానిద్దాం!" అంటూ మళ్ళీ ఆమెను దగ్గరకు తీసుకోబోయాడు.

సత్యభామ వారిస్తూ—"పిరియడ్ నడుస్తోంది" అని నవ్వింది.

"ఆల్ రైట్! పిరియడ్ కంప్లీట్ అయ్యాకే నిన్ను ముట్టుకుంటాను" అన్నాడు విచారంగా.

రెండు క్షణాల నిశ్శబ్దం.

"అన్నట్లు ఈ ఇంట్లో ఎవ్వరూ లేరా? అమ్మా... నాన్నా...."

"అంతా వూళ్ళో వుంటారు. నేను ప్రయివేటు ఫర్మ్‌లో స్టెనోగా పనిచేస్తూ—నెలకు కొంత డబ్బు మా వాళ్ళకు పంపిస్తూ వుంటాను."

"అలాగా! మరి నా గురించి నీకు తెలుసుకోవాలని లేదా?"

"మీ గురించి నాకు తెలుసు."

"నా గురించి తెలుసా?" అతను ఆశ్చర్యపోయాడు.

"ఎలా తెలుసు?" మళ్ళీ అడిగాడతను.

"మీ ఫాదర్ వెంకటేశ్వర్రావుగారు, పాగాకు

వ్యాపారం చేస్తుంటారు. మీరు వారికి ఏకైక పుత్రులు. యామ్ ఐ కరెక్ట్."

"అరె, మీకెలా తెలుసు!" అతను మళ్ళీ ఆశ్చర్యపోయాడు.

"ఎలా తెలుసుకున్నానో చెప్పండి చూద్దాం!"

అతను కొంచెంసేపు ఆలోచించి — "ఊహుఁ! నే చెప్పలేను, మీరే చెప్పండి!" అన్నాడు.

సత్యభామ నవ్వి-"ఇందాక రాధ చెప్పింది!" అన్నది.

"అరె, ఆ విషయం నాకు తట్టనేలేదు" అంటూ అతనూ శృతి కలిపాడు.

రెండు క్షణాల నిశ్శబ్దం. అతనికి ఇంకా ఏం మాట్లాడాలో తోచలేదు.

"మరి నే వెళ్ళిరానా!"

"మంచిది. మళ్ళీ ఎప్పుడు వస్తారు."

"మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడే వస్తాను. ఒకవేళ మీరు ఈ రాత్రి ఇక్కడే వుండిపొమ్మన్నారనుకోండి. ఇక్కడే వుండిపోతాను" అంటూ నవ్వాడు.

"అబ్బ! ఎంతాశ! నేను అలా అనను లెండి! రేపు సాయంత్రం 6 గంటలకు రండి!"

"ఓ.కే. గుడ్ నైట్. రేపు సాయంత్రం ఆరుగంటలకు వస్తాను" అంటూ స్కూటర్ స్టార్టుచేసుకొని వెళ్ళిపోయాడు.

## 4

స్కూటర్ రివ్వున దూసుకుపోతోంది.

కృష్ణమోహన్ సత్యభామ గురించి ఆలోచిస్తున్నాడు. అతనికి సత్యభామమీద కోపంగా వుంది. రేపటికి వాయిదా వేసింది. తనకు స్త్రీ సుఖం దొరకని రోజు అసలు నిద్ర రాదు. ఇవేళ సత్యభామకు గాలం వేద్దామనుకుంటే

అస్సలు కుదర లేదు.

కృష్ణమోహన్ మరొక స్త్రీ గురించి ఆలోచిస్తూ స్కూటర్ పోనిస్తున్నాడు.

గీత వాళ్ళ ప్రాగాకు కంపెనీలో టైపిస్టుగా పని చేస్తోంది. ఆమెకు పెళ్ళి అయ్యింది. కానీ — భర్త యెక్కడో వైజాగ్‌లో ఒక పెట్రోలు బంకులో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. వాళ్ళ మధ్య యింటర్ కోర్సుకు యెలాగు అవకాశంలేదు కాబట్టి — కరస్పాండెన్స్ కోర్సు నడుస్తుంది. ప్రస్తుతం ఆమెకు వలలో వేసుకోవడం తేలిక.

ఎర్రమంజిల్ కాలనీలో వున్న గీత ఇంటిముందు స్కూటరు ఆపాడు కృష్ణమోహన్.

తలుపు వేసి వుంది. లోపలినుంచి సన్నగా సితార్ వాయిద్యం వినిపిస్తోంది రేడియోలోనుంచి.

కృష్ణమోహన్ తలుపు తట్టాడు.

రెండు నిమిషాల తర్వాత తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగా గీత నిద్రకళ్ళతో వుంది.

అప్పుడు సమయం రాత్రి 9 దాటింది.

కృష్ణమోహన్‌ను చూసి ఆశ్చర్యపోయింది.

"ఏమిటి ఇంత రాత్రప్పుడు వచ్చారు."

"కొంచెం పనుండి వచ్చాను."

"లోనికి రండి!"

ఇద్దరూ లోనికి వెళ్ళారు.

అది నాలుగు గదుల క్వార్టరు. రెండు గదుల్లో ఇంటి ఓనరువాళ్ళు వుంటున్నారు. మిగతా రెండు గదుల్లో గీత వుంటోంది. ముందుగది డ్రాయింగ్ రూం కం బెడ్ రూంగా వెనుక గది కిచెన్ రూం, సామానులు పెట్టుకోవడానికి

వినియోగించుకుంటోంది.

"కూర్చోండి!" అంటూ ఈజీచెయిర్ చూపించింది.

కృష్ణమోహన్ కూర్చున్నాడు.

అతను గదినంతా పరిశీలనగా చూస్తూ—"మీ గది చాలా బావుందండి!" అంటూ మెచ్చుకున్నాడు.

"ఈ గదిలో ఏముందని బావుండడానికి" అంటూ తియ్యగా నవ్విందామె.

"నిజం చెప్పాలంటే—గదిలో చెప్పుకోతగ్గ వస్తువులు ఏమీ లేకపోయినా—వున్న వస్తువులను అందంగా పేర్చుకోవడంలో మీ కళా' ప్రతిభ గోచరిస్తోంది."

"థాంక్యూ. ఫర్ యువర్ కాంప్లిమెంట్" అన్నది.

రెండు క్షణాలు వాళ్ళమధ్య నిశ్శబ్దం రాజ్యమేలింది.

తన బాస్ కొడుకు ఇంత రాత్రప్పుడు తన గదికి ఎందుకొచ్చాడోనని ఆమె పరి పరి విధాల ఆలోచిస్తూ కూర్చుంది. ఉండబట్టలేక ఆమె అదే విషయాన్ని అడిగింది.

కృష్ణమోహన్‌కు సమాధానం ఏం చెప్పాలో అర్థం కాలేదు. కానీ తన రాకకు కారణం ఏదో ఒకటి చెప్పుకోవాలి. అతనికి చటుక్కున ఒక ఆలోచన ఉదయించింది.

"అర్జంటుగా కొన్ని పేపర్స్ టైపు చేయించాల్సిన పని పడింది. మీరు ఇప్పుడు ఆఫీసుకు వచ్చినా సరే, లేదా మీ బీరువా తాళాలు ఇచ్చిన సరే, టైపు మిషను బయటికితీసి నేనే టైపు చేసుకుంటాను" అన్నాడు.

తన రెండేళ్ళ సర్వీసులో ఇంత రాత్రప్పుడు ఇంటికి వచ్చి టైపు చేయమని అడగడం ఇదే ప్రథమం. నిజంగానే ఆఫీసులో పని ఉందా! లేక కల్పితమా? గీత ఆలోచిస్తూ కూర్చుంది.

సీత మౌనంగా వుండటం గమనించి "ఏమిటి, మౌనంగా వుండిపోయారు" అన్నాడు కృష్ణమోహన్.

ఆమె నవ్వి — "ఆఫీసుకు రావటమా? లేక తాళం చేతులు ఇచ్చి పంపడమా? అనే విషయం గురించి ఆలోచిస్తున్నాను" అంది.

"మీ ఇష్టం—మీరు వస్తే మళ్ళీ మిమ్మల్ని ఇంటివద్ద దింపి వెళతాను. ఆలోచించుకోండి!" అన్నాడు.

ఆమె ఓ. పదిక్షణాల తర్వాత — చటుక్కున లోనికి వెళ్ళి-చేతిలో తాళంచెవులతో తిరిగి వచ్చింది. "ఇదిగో, ఆఫీసు బీరువా తాళం చేతులు" అంటూ అతని చేతికి అందించింది.

కృష్ణమోహన్ మారు మాట్లాడకుండా తాళంచేతులు తీసుకున్నాడు.

రెండు క్షణాల తర్వాత—

"నేను మీతో ఒక విషయం గురించి మాట్లాడుదామనుకుంటున్నాను. మీరు నాకొక పదినిమిషాలు టైం స్పేర్ చేయగలరా?" అన్నాడు.

ఆమె నవ్వి—"పదినిమిషాలేం ఖర్మ, గంట టైము తీసుకోండి! నాకేం అభ్యంతరంలేదు" అన్నది.

కృష్ణమోహన్ ఏదో చెప్పడానికి ప్రయత్నించాడు. కానీ—అతని నోట్లోనుంచి మాట బయటికి రాలేదు. ఆ విషయం చెప్పడానికి అతను భయపడుతున్నట్లు కనిపించాడు.

"పర్వాలేదు చెప్పండి!" అంటూ ఆమె ప్రోత్సహించింది. అలా అనగలిగితే అన్నది కానీ—అతనినుండి యెటువంటి విషయం వినవలసి వస్తుందోనని ఆమెకు భయంగానే వుంది.

"ఐ లవ్ యూ" అన్నాడు ఎలాగో ధైర్యం చేసుకొని. ఎంతో మెల్లగా పలికాడు.

ఆ మాట వినగానే ఆమె ముఖం కందగడ్డలా తయారయ్యింది.

ఆమె ముఖంలో మారుతున్న భావాలను గమనించి కృష్ణమోహన్ జంకాడు. ఆమె ఏదైనా మాట్లాడుతుందేమోనని ఎదురు చూశాడు. కానీ—ఆమె మౌనంగా వుండిపోయింది.

"గీతగారు, నేను సిన్సియర్‌గా చెప్తున్నాను. మన కులాలు వేరు కావచ్చు—అయినా నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. ఈ విషయంలో మీ సమ్మతి కొరకు ఎదురుచూస్తున్నాను."

ఈ మాట వినగానే గీత నిశ్చేష్టురాలు అయింది. కొన్ని క్షణాల తర్వాత తేరుకొని-"మీరు ఒక విషయం మరిచిపోతున్నారు. ఐయామ్ ఎ మ్యారిడ్ వుమన్. నాకు పెళ్ళయిపోయింది. పెళ్ళయిన ఒక స్త్రీని పట్టుకొని పెళ్ళి చేసుకుంటానని అడగవచ్చా!"

"అఫ్‌కోర్స్! అదీ తప్పేననుకోండి! కానీ — నా మనసులో ఉదయించిన మాట నేను మీకు ఫ్రాంక్‌గా చెప్పాను."

ఆమె తల వంచుకొని ఆలోచిస్తూ కూర్చుంది.

"మీకు పెళ్ళయిందన్న మాటేగాని — మీరు మీ భర్తతో ఏం సుఖపడ్డారు. అతను ఎక్కడో వైజాగ్‌లో పనిచేస్తున్నాడు. అతను అక్కడ ఉద్యోగం వదిలిపెట్టి మీ దగ్గరకు రాలేదు. మీరు ఇక్కడ ఉద్యోగం వదిలిపెట్టి అతని దగ్గరికి వెళ్ళలేరు. అతను కొన్నాళ్ళు సెలవు పెట్టి మీదగ్గరికి రావడం మీరు కొన్నాళ్ళు సెలవు పెట్టి—

అతని దగ్గరికి వెళ్ళడం - ఏదో కొన్నాళ్ళు అక్కడ ఉండటం — అందులో ఏం తృప్తి వుంది చెప్పండి!" కాస్సేపాగి ఆమె ముఖంలోకి చూశాడు.

ఆమె మౌనంగా తలవంచుకొని కూర్చొని ఆలోచి స్తోంది.

"అంటే — మీరు నన్ను పెళ్ళిచేసుకోవడానికి ఒప్పు కోండి! ఇక మిగిలింది మీ భర్తగారి విషయం. మీరు ఇక్కడ వుండటంవలన అతను ఈ పాటికి ఎవ తెనో వుంచుకొని కాలం గడుపుతూ వుండివుంటాడు. మీ సంపాదన, మీ శరీరం తప్ప మీ బాధలను, భయాలను, కష్టాలను, కన్నీళ్ళను గురించి పట్టించుకోని ఆ మగాడు వున్నా వూడినా ఒకటే!"

తన భర్త నిజాయితీమీద తనకు ఇంతవరకు అను మానం కలగకపోవడం ఆశ్చర్యమే అనిపించింది. అతనలా అనడంతో కొద్దిగా అనుమానం మొలకెత్తింది.

"అంటే మీ ఉద్దేశ్యం, మావారు అక్కడ ఎవతెనో వుంచుకొని కాలం గడుపుతున్నారంటారా?"

"ఇట్ మైట్ బీ పాసిబుల్! వయస్సులో వున్న వాళ్లు కోరికలను చంపుకొని — ఎంతకాలం వుంటారు చెప్పండి! పరిస్థితి అలా వుంది కాబట్టి సబ్‌స్టిట్యూట్ అరేంజ్ మెంట్ చేసుకుంటారు. ఇందులో ఆశ్చర్యపడాల్సినది ఏమీలేదు. కనుక ...."

గీత ఆలోచిస్తూ కూర్చుంది. తనకు చాలామంది మగ వాళ్ళు ఎదురయ్యారు. అందరూ తనను వాడుకోవడానికి చూసిన వాళ్ళేకానీ — ఇలా పెళ్ళిచేసుకుంటాను అని ముందుకు వచ్చినవాడు ఇతనొక్కడే! ఆ చేసుకుంటాను

అనే మాటేదో తన పెళ్ళికాకముందు చెప్పివుంటే— ఎంత బావుండేది. ఇప్పుడు తినకెన్ని ప్రాబ్లమ్స్.

"కృష్ణమోహన్ గారు! నేను ఈ విషయం గురించి బాగా ఆలోచించుకోవాలి. నేను నెలరోజుల టైం తీసుకుంటాను. ఆ తర్వాత ఏ విషయమైనదీ చెప్తాను" అన్నది.

కృష్ణమోహన్ ఆమెవైపు ఆశగ చూశాడు. కానీ— లాభం లేకపోయింది. అప్పటికే గీత గడియారం చూడటం మొదలుపెట్టింది. అప్పటికీ అతను కదలకపోయేసరికి—

"అరే! ఏవో అర్జంటు కాగితాలు టైపు చేసుకోవా అన్నారు కదా, మరిచిపోయారా?" అంటూ గుర్తుచేసింది.

"ఓ కరక్టేనండి! బాగా గుర్తుచేసారు. వస్తాను" అంటూ లేచాడు.

ఆమెకూడా లేచి—గుమ్మంవరకు సాగనంపింది.

కృష్ణమోహన్ తన స్కూటర్‌ను స్టార్ట్ చేసి పెదవి విరుచుకుంటూ ముందుకు సాగిపోయాడు.

ఈ రోజు తను ఉపవాసం పడుకోక తప్పదేమోనని ఆలోచిస్తూ వెళుతున్నాడు.

అప్పుడు అతనికి శారద గుర్తొచ్చింది.

## 5

శారద అతని చిన్ననాటి స్నేహితురాలు. చాలా అందంగా వుంటుంది.

శారద వాళ్ళ ఫాదర్ రఘురామయ్యగారు ఏ.జి. ఆఫీసులో సెక్షన్ సూపరింటెండెంట్ గా పని చేసేవారు. క్లాసులో పోటీపడి చదవడం—ఇంటికొచ్చాక—వాళ్ళింట్లోనే కలసి లెక్కలు చేయడం, కథలు చెప్పుకోవడం వగైరాలు చేస్తుండేవాడు.

అప్పుడు అతని వయస్సు 11 సంవత్సరాలే అయినా—పెద్దయ్యాక శారదను పెళ్ళి చేసుకోవాలనే వూహ ఉండేది. శారదకు కూడ ఆదే అయిడియా కలిగించడం కోసం అనేక ప్రయత్నాలు చేసేవాడు. ఓ సారి, అతను పెద్దయ్యాక తామిద్దరం ఎంచక్కా పెళ్ళి చేసుకుందామా? అని అడిగితే—'ఓ' అని తల కూడా ఊపింది.

కాలగమనంలో వాళ్ళు హైద్రాబాదు నుండి ట్రాన్స్‌ఫర్ అయిపోవడం శారద ఒక మిలిట్రీ ఆఫీసర్‌ను పెళ్ళి చేసుకోవడం—ఇద్దరు పిల్లలకు తల్లి కావడం, కొన్నాళ్ళ క్రితం మళ్ళీ హైద్రాబాదులో సెటిల్ కావడం జరిగింది. కానీ ఆమె భర్త ప్రస్తుతం యెక్కడో బార్డర్ ఏరియాలో ఉంటున్నాడు. శారద ప్రస్తుతం తన ఇద్దరు పిల్లలను చదివిస్తూ—బంజారాహిల్స్‌లో ఉంటుంది.

ఇంతకు మునుపు రెండు మూడుసార్లు శారద యింటికి వెళ్ళాడు. అప్పుడు తన పెళ్ళి కెదిగిన చెల్లాయికోరకు యెక్కడైనా మంచి సంబంధం చూడమని అడిగింది. ఇన్‌డైరెక్టుగా తనను చేసుకోమంటుందేమోనని అతనికి స్ఫురించింది.

శారద తనంటే యిప్పటికీ యెంతో యిష్టాన్ని కనబరుస్తోంది. ఆమె దగ్గరికి వెళ్తే—ఏమైనా ఫలితముంటుందేమోనని వూహించి—స్కూటర్‌ను బంజారాహిల్స్‌వైపు పోనిచ్చాడు.

రాత్రి పది గంటలు!

కృష్ణమోహన్ తన స్కూటర్‌ను శారద యింటి ముందు ఆపాడు. ఇంట్లో యింకా లైట్లు వెలుగుతూనే వుంది.

గేటు తెరుచుకొని వెళ్ళి — కాలింగ్ బజర్ నొక్కాడు. నిమిషం తర్వాత తలుపులు తెరుచుకున్నాయి.

శారద నైట్ డ్రెస్‌లో వుంది. చేతిలో ఏదో పుస్తకం ఉంది. బహుశా చదువుకుంటూ కూర్చుని ఉంటుంది. కృష్ణమోహన్‌ను చూడగానే—"ఓ. నువ్వా? రారా!!" అంటూ లోనికి ఆహ్వానించింది.

"హౌ ఆర్ యూ?" అంటూ పరామర్శించాడు కృష్ణమోహన్.

"ఫైన్, థ్యాంక్యూ!" అన్నది శారద.

పలుచటి నైట్ డ్రెస్‌లో శారద అప్సరసలా కనిపిస్తోంది. లోపలి బ్రా, పచ్చగా ఉన్న ఇతర అవయవాలు, ఎత్తయిన వక్షోజాలు అతన్ని కవ్విస్తున్నాయి. అంతకుముందే స్నానం చేసి—విరబోసుకున్న అందమైన పొడవాటి జుట్టు ఆమెకు వింత అందాన్ని తెచ్చిపెడుతున్నాయి.

ఆడదాని పొందుకోసం తను ఈ రోజు వూరంతా తిరిగాడు. తన దురదృష్టమేమో గానీ—ఎవ్వరూ తనను కరుణించలేదు. శారద తనను కరుణిస్తే—నిజంగా తన జన్మ ధన్యమైనట్లే! అబ్బ, యెంత అందమో! పాలరాతి బొమ్మలా వుంది.

కృష్ణమోహన్ ఆమె అందాన్ని చూసి తన్మయత్వం పొందుతున్నాడు.

"ఏమిటి అలా చూస్తూ నిల్చుండిపోయావు. కూర్చో!" అంటూ సోఫా చూపించింది.

కృష్ణమోహన్ మారు మాట్లాడకుండా కూర్చున్నాడు.

తను ఇంత రాత్రి శారద యింటికి ఎందుకొచ్చినట్లు? కారణం తనకు తెలుసు. కానీ—శారదకు ఏం చెప్పాలి. ముందు తను యెందుకొచ్చాడో—యేదో ఒక సాకు చెప్పాలి.

"ఇక్కడే బంజారాహిల్స్‌లో ఒక ఫ్రెండింటికి వచ్చాను. దారిలోనే మీ యిల్లు. పలకరించి పోదామని వచ్చాను."

"ఇన్నాళ్ళకు గుర్తుకు వచ్చావన్నమాట" నవ్వింది.

"ఇంట్లో ఎవ్వరూ లేరా?"

"పిల్లలు నిద్రపోతున్నారు."

"మీవారు ఇంకా రాలేదా?"

"వచ్చే నెలలో వస్తానని రాశారు."

"ఒక్కదానివి యెలా వుండగలుగుతున్నావు. మీ సిస్టర్‌ను గానీ—మదర్‌ను గానీ ఇక్కడికి పిలిపించుకోకూడదు."

సమాధానం చెప్పకుండా నవ్వింది.

"నవ్వుతా వేమిటి...."

"మీ సూచన బాగానే ఉంది. పరిశీలిస్తాను" అంటూ మళ్ళీ నవ్వింది.

ఆమె నవ్వులో—తానేమైనా చిన్న పిల్లా—చితక పిల్లా తోడు లేకుండా తాను ఉండగలననే ధీమా కనిపించింది.

"నేను నిన్నొక విషయం అడగాలని చాలా కాలంగా అనుకుంటున్నాను" అంటూ ఆగాడు.

"అడుగు!" అన్నది.

శారద ముఖంలో యెలాంటి భావం పలుకలేదు. అతను ఏ విషయం అడిగినా వినడానికి సిద్ధంగా ఉన్నట్లు

కనిపించింది.

"నే నడగబోయేది చాలా సూటి ప్రశ్న. నువ్వు యేమీ అనుకోనంటే నే ప్రొసీడ్ అవుతాను" అన్నాడు.

శారద నవ్వుతూ తల ఆడించింది.

"నీ భర్త సంవత్సరానికి పదినెలలు నీకు దూరంగా ఎక్కడో ఉంటాడు కదా, ప్రకృతిసిద్ధమైన కోరికలను నువ్వు ఎలా అణుచుకోగలుగుతున్నావు?" అని తకీమని అడిగేశాడు.

అలాంటి ప్రశ్న అడుగుతాడని ఎదురుచూడని శారద ముఖంలో చాలా వేగంగా భావాలు మారిపోయాయి. అవమానంతో ఆమె ముఖంలో విషాద ఛాయలు అవరించాయి. కళ్ళు వర్షించడానికి సిద్ధమయ్యాయి. ముక్కుపుటాలు సన్నగా వణికాయి. ఆమె కృష్ణమోహన్ ముఖంలోకి సూటిగా చూడలేక చటుక్కున తల వంచుకున్నది.

ఆమె తేరుకోవడానికి దాదాపు రెండు నిమిషాలు పట్టింది.

శారద చాలా సెన్సిటివ్ అని కృష్ణమోహన్‌కు తెలుసు. తను ఈ ప్రశ్న అడిగితే అవమానభారంతో కుంచించుకు పోవడానికి ఆస్కారముంది—అని కూడా తెలుసు. కానీ ఆమె బాధపడినా — మరోలా ఫీల్ అయినా అతనికి అనవసరం. తనకు కావల్సింది ఆమెను తన మార్గంలోకి మళ్ళించుకోవడం. దానికొరకు అతను ఎంతమాటైనా అనడానికి సిద్ధమయ్యాడు.

శారద మాట్లాడడానికి ఉద్యుక్తురాలై —గొంతు సవరించుకుంది.

"నా పర్సనల్ మ్యాటర్ గురించి నీకనవసరం, అని

నేను అనగలను. కానీ—నువ్వు నా ఫ్రెండ్‌వి కాబట్టి నీ ప్రశ్నకు నేను అలా పెడసరంగా సమాధానం ఇవ్వ దల్చుకోలేదు.

నువ్వన్నట్లు ఆయన సంవత్సరానికి రెండు నెలల మాత్రం నన్ను అలరించడానికి వస్తారు. నిజానికి ఆ ఒక్క రెండు నెలల అనుభవపు తీపి గుర్తుకే నా జీవి తాంతం నన్ను నడిపించగలిగే శక్తి వున్నది. అటువంటిది-ఆయన ప్రతి సంవత్సరం నా కోసం వస్తారు. తీపిగుర్తులను నెమరువేసుకుంటూ ఆయన కొరకు పదినెలలు తేలికగా నిరీక్షించగలను. ఇది నాకొక పెద్ద ప్రాబ్లం అనిపించదు."

కృష్ణమోహన్ నవ్వాడు.

"ఇది నేనడిగిన ప్రశ్నకు సరిఅయిన సమాధానంకాదు. నువ్వేదో కవిత్వపు మాటలు చెప్తున్నావు. మూడు పూటలా ఉప్పు, కారం తినే మనిషివి నువ్వు. ప్రకృతి సిద్ధమైన కోరికలను ఎలా అణుచుకోగలుగుతున్నావు?"

శారదకు కోపం వచ్చింది.

"అంటే నీ ఉద్దేశ్యం, నేనెవరినైనా ఉంచుకున్నా ననా?" పెద్దగా అరిచింది.

"అబ్బెబ్బే! నా ఉద్దేశ్యం అదికాదు. అలాంటి పని నువ్వు ఎందుకు చెయ్యకూడదూ అని!"

"చూడు మిస్టర్ కృష్ణమోహన్! నువ్వు ఒక స్నేహి తురాలికి ఇవ్వవలసి నటువంటి సలహా ఇదేనా? నువ్వు నా స్నేహితుడివి అని చెప్పుకోవడానికి సిగ్గుపడు తున్నాను."

"ఇందులో తప్పేముంది. ఎంతమంది అలా, చెయ్యడం లేదు. అదీగాక నీ భర్త అక్కడ పవిత్రంగా ఉంటు న్నాడని సర్టిఫై చెయ్యగలవా?"

"అతను పవిత్రంగా ఉండనీ ఉండకపోనీ! భారత స్త్రీకి ఆదర్శం, సీతా, సావిత్రీ, అనసూయవంటి ఎందరో మహాపతివ్రతలు. అటువంటి వారికే మన సమాజంలో గౌరవ మర్యాదలు ఉంటాయి" ఆవేశంగా అన్నది.

కృష్ణమోహన్ తేలిగ్గా కొట్టివేస్తూ-"గౌరవమర్యాదలు ఉంటాయి అని నువ్వు అనుకుంటున్నావు. కానీ — నీ వెనుక లోకం ఏమనుకుంటుందో నీకేమైనా తెలుసా? మా యింటికొచ్చే ప్రతి మగవాడితో నీకు సంబంధం వుందని చిలువలు పలువలుగా చెప్పుకుంటోంది."

ఆమె నిర్ఘాంతపోయింది. అతను చెప్పేది నిజమేనా? లేక కథలు అల్లుతున్నాడా?

శారద ముఖ కవళికలను గుర్తించి — "ఏ గౌరవ మర్యాదలకోసమైతే — నీ యవ్వనాన్ని అడవిగాచిన వెన్నెల చేస్తున్నావో, ఆ గౌరవమర్యాదలే నీ వెనుక సర్వనాశనం అయిపోతున్నప్పుడు — నువ్వు స్వేచ్ఛా పంథాను అనుసరించడంలో తప్పేంలేదని నేనంటాను."

శారద కొంచెంసేపు మౌనందాల్చి—కృష్ణమోహన్ అలా వక్రంగా యెందుకు మాట్లాడుతున్నాడో ఆలోచించడం మొదలుపెట్టింది. ఒకవేళ అతను తనను కోరుతున్నాడా? బహుశా కావొచ్చు. అదేదో తేల్చుకోవాలనుకుంది.

"నీ అభిప్రాయం ఏమిటో నాకర్థమైంది. నేను నీ ఉంపుడుగత్తెగా మారిపోవాలనేగా, నువ్వు ఇదంతా మాట్లాడుతోంది!" అంది కసిగా.

"ఛ ఛ! నువ్వు తప్పుగా అర్థంచేసుకుంటున్నావు. నేను అడిగితే—నిన్ను ఉంపుడుగత్తెగా ఉండమని ఛస్తే అడగను. ధైర్యం ఉంటే—నన్ను పెళ్ళిచేసుకోవడానికి

ఒప్పుకో, తాళి కట్టేస్తాను అంటాను" అన్నాడు తేలిగా తీసుకుంటూ.

హుఁ తనను పెళ్ళిచేసుకుంటాను అని ఎంత తెలివిగా అడిగాడు. అయినా అతనికిదేం బుద్ధి. పెళ్ళిచేసుకోవాలంటే అతనికి అమ్మాయిలే కరువయ్యారా? పెళ్ళయిన దాన్ని పట్టుకొని— పెళ్ళి చేసుకుంటాను అనడమేమిటి?

"సారీ కృష్ణా! నువ్వు అలాంటి ఆశలు ఏమీ పెట్టుకోకు!" అంటూ ఆవలించి గడియారం చూసుకుంది.

రాత్రి పదిన్నర దాటింది.

తను వెళ్ళిపోవడానికి ఆమె యెదురుచూస్తున్నట్లు అర్థం చేసుకున్నాడు కృష్ణమోహన్.

వ్యవహారాన్ని శృతిమింపజేసి— రాగాన పడేద్దామనుకున్నాడు. కానీ— శారద తన వ్యవహారాన్ని ఆదిలోనే అంతమొందింపజేసింది. అందుకు ఎంతో విచారించాడు

సంభాషణను పొడిగించి — ఇంకాస్సేపు అక్కడే వుండడానికి ప్రయత్నించి విఫలుడు అయ్యాడు. ఇక గత్యంతరంలేక వెనుదిరిగాడు.

ఈ రోజు తను చేసిన ప్రయత్నాలన్నీ వమ్ము అయినందుకు—తీరిగ్గా కూర్చొని కాస్సేపు విచారించి— బాగా మందుకొట్టి పడుకున్నాడు.

## 7

ఉదయం తొమ్మిది గంటలు.

కృష్ణమోహన్ ఇంకా నిద్రలేవలేదు.

"కృష్ణా .... ఒరే కృష్ణా .... తొమ్మిదయింది. ఇంకా నిద్రపోతున్నావా? లే!" అంటూ అతని తల్లి కమలమ్మ నిద్రలేపింది.

అతను కళ్ళు నులుముకుంటూ నిద్రలేచాడు,

కృష్ణమోహన్ స్నానంచేసి, 'టీ' త్రాగుతూ పేపర్ చదువుతూ కూర్చున్నాడు.

నిన్నంతా తనుచేసిన వివిధ ప్రయత్నాలు గుర్తొచ్చి నవ్వుకున్నాడు. అతనికి సత్యభామ గుర్తొచ్చింది ఆమె ఇవేళ తనను వాళ్ళింటికి రమ్మని ఆహ్వానించింది. ఇవేళ తనకు వేరే పనేమిలేదు, సాయంత్రం యెప్పుడు అవుతుందా అని ఎదురుచూస్తూ కూర్చోవడం తప్ప. కాలక్షేపంకోసం ఏదో మేగజైన్ తిరిగేస్తూ కూర్చున్నాడు.

అప్పుడే పోస్టుమెన్ వచ్చాడు.

"సార్, మీకు రిజిష్టర్ పోస్టు వచ్చింది!" అంటూ ఒక లావుపాటి కవరు చేతికి అందించి — తనవద్ద వున్న లిస్టులో కవరు ముట్టినట్టుగా సంతకం చేయించుకొని వెళ్ళిపోయాడు పోస్టుమెన్.

ఆ కవరు ఎక్కడినుండి వచ్చిందా? అని అడ్రసు చూశాడు. అది ఒక ప్రముఖ వారపత్రికనుండి వచ్చింది.

పత్రికవాళ్ళు ఆ కవరు తనకెందుకు పంపించారో అర్థం అయిన తర్వాత "అబ్బా! రెస్పాన్స్ బాగానే ఉందే!" అని నవ్వుకున్నాడు.

ఆత్రంగా కవరు చింపి చూశాడు.

అందులో డజను వరకు రకరకాల ఎన్వలప్‌లు ఉన్నాయి.

కృష్ణమోహన్ నెలరోజుల క్రితం ఆ పత్రికలోని వివాహ ప్రకటనల్లో తన పేరు ప్రకటించాడు. అందులో అతను కొంత ఫాల్స్ ఇన్ఫర్మేషన్ ప్రకటించాడు.

ప్రభుత్వోద్యోగం చేస్తూ — నెలకు వెయ్యి రూపాయలు సంపాదించుకుంటున్న 25 ఏళ్ళ యువకునకు — అందమైన యువతి కావలెను. ఏ

కులమైనా—ఏ మతమైనా అభ్యంతరం లేదు. విశాలభావాలు కలిగి ఉండవలెను. ఆసక్తి కల వారు బాక్సు నెంబరు 376 కు వ్రాయండి. ఫోటో తప్పనిసరిగా జత చేయాలి."

అదీ ప్రకటన.

పత్రికవాళ్ళు యిచ్చిన బాక్సు నెంబర్ కు వచ్చిన ఉత్తరాలన్నీ వాళ్ళు తిరిగి కృష్ణమోహన్ కు పంపించారు.

కృష్ణమోహన్ ఒక్కొక్క కవరే చించి—యెంతో యాంగ్జయిటీతో ఫోటోలను తిలకించాడు. మొత్తం పన్నెండు ఉత్తరాల్లో ఇద్దరు ఫోటోలు జత చేయలేదు. మిగతా 10 ఫోటోల్లో అతనికి మూడు ఫోటోలు బాగా నచ్చాయి.

ఒక ఫోటో మాత్రం చాలా అద్భుతంగా ఉంది.

ఆ అమ్మాయి ముత్యాలవంటి అక్షరాలతో చక్కగా ఒక ఉత్తరం రాసి జత చేసింది.

కింగ్స్వే,
సికింద్రాబాదు,
2-8-84

డియర్ బాక్స్ నెంబర్ 376,

పత్రికలో మీ ప్రకటన చూసి—మీరు అడిగిన విధంగా నా ఫోటో జత చేసి పంపిస్తున్నాను. పత్రికలో మీరు ప్రకటించిన వివరాలు నాకు నచ్చాయి. ముఖ్యంగా మీరు హైద్రాబాదులోనే ప్రభుత్వోద్యోగం చేస్తూ ఉండటం నాకు నచ్చింది. కారణం నేను కూడా ఇదే వూళ్ళో (సికింద్రాబాదు) ఉద్యోగస్థురాలై ఉండటం.

నాకు అనేక సంబంధాలు వచ్చాయి. కానీ—

వాళ్ళు ఆంధ్రదేశంలో వివిధ ప్రాంతాల్లో ఉద్యోగాలు చేస్తూ ఉన్నవారే తటసించారు. ఆ సంబంధాలను ఖాయాం చేసుకుంటే — నేను ఉద్యోగం వదలిపెట్టవల్సిన అవసరమో లేక రాకపోకలు జరుపుకోవడమో చేయాలి. ఆ తతంగమంతా నాకు నచ్చక నేను వాటిని వదిలేశాను.

మీరు నాకు నచ్చారు. మిమల్ని చూడక పోయినా మీరు నాకు తప్పక నచ్చుతారని— ఎందుకో నాకనిపిస్తోంది. ఇకపోతే— నేను మీకు నచ్చానో, లేదో? (ఫొటో చూడండి) ఫోటోలో కంటే నేను ఇంకా అందంగా ఉంటాను అని చెప్పుకోవడం స్వడబ్బా అవుతుందని భావిస్తే— నేను అలా రాయను.

నా గురించి టూకీగా మీకు కొంత చెప్పాలి. నేను బియస్సీ తర్వాత బి. ఎడ్. చేసి ఒక కాన్వెంట్‌లో టీచర్‌గా ఉద్యోగం చేస్తూ ఎనిమిది వందలు సంపాదించుకొంటున్నాను. నాకు వెనకా ముందు యెవ్వరూ లేరు. నేనొక అనాథను. చిన్నప్పటి నుండి అనాథ ఆశ్రమంలో పెరిగి స్కాలర్ షిప్పులతో చదువుకొని— నా కాళ్ళమీద నేను నిలబడగలిగే స్థాయికి ఎదిగాను. నా ఆశయాలకు అనుగుణంగా నా కొక మంచి భర్త దొరకాలని నా తాపత్రయం.

ఎనీహౌ, నేను మీకు నచ్చితే— ఈ క్రింది అడ్రసుకు ఏ రోజైనా సాయంత్రం 6 గంటల

తర్వాత వస్తే — అన్ని వివరాలు స్వయంగా మాట్లాడుకోవచ్చు.

భవదీయురాలు,
సరోజ.

క్రింద అడ్రసు వ్రాసి వుంది.

ఈ ఉత్తరం అంతా చదువుతున్న కృష్ణమోహన్‌కు మిగతా ఉత్తరాలు చూడాలనిపించలేదు. అంటే ఆ ఫోటోలోని అమ్మాయి. అంత నచ్చిందన్నమాట. అయినా ఆసక్తి చంపుకోలేక — వాటిని కూడా చదవడానికి ఉపక్రమించాడు.

విజయవాడ
తేది: 3-8-84

మీరు పత్రికలో వేసిన ప్రకటన చూశాను. నాకొక కూతురుంది. చాలా అందంగా వుంటుంది. మెట్రిక్యులేషన్ వరకు చదువుకుంది. కానీ—ఆమె రెండుకాళ్లు పోలియో వచ్చి చచ్చుపడిపోయింది. కర్ర సహాయంతో అన్ని పనులు చేసుకోగలదు. ముప్ఫయి వేలవరకు కట్నం ఇచ్చుకోగలను. మీకు నచ్చితే ఉత్తరం రాయగలరు.

ఇట్లు,
వెంకయ్యనాయుడు,
విజయవాడ-10.

ఉత్తరాన్నంతా చదువుకొని నవ్వుకున్నాడు కృష్ణమోహన్.

మరో కవరు చించాడు. గులాబీరంగు కాగితంమీద ఇండియన్ ఇంకుతో రాసినట్లు నల్లని అక్షరాలు. అత్తరు పరిమళం వస్తోంది కాగితంలోనుంచి.

రాజమండ్రి
తేది: 8-8-84

ప్రకటన కర్తగారికి నమస్కారం!

పత్రికలో మీరు వేయించిన ప్రకటన చదివాను. 'అందంగా వుండి, విశాల భావాలు కలిగిన యువతి ఏ కులమైనా ఏ మతమైనా ఫర్వాలేదు' అని రాసారు. అది నాకెంతో నచ్చింది. నేను ముస్లిం యువతిని. అందంగా వుంటాను. నేను విశాల భావాలు కలదాన్నని నా గురించి నేను చెప్పుకోవడం బావుండదు. అయినా నా అలవాట్ల గురించి కొంత చెప్పితే—మీరు నన్ను తేలిగ్గా అర్థం చేసుకోగలరనే ఉద్దేశ్యంతో రాస్తున్నాను.

తెలుగులో నేను గురజాడ, శ్రీశ్రీ, చలం, బుచ్చిబాబు, రావిశాస్త్రి, రంగనాయకమ్మ, బీనాదేవి మొదలైనవారు సృష్టించిన ఉత్తమ సాహిత్యాన్నంతా చదివి వంటపట్టించుకున్నాను.

మంచి కవిత్వమన్నా, మంచి కథ అన్నా, చెవికోసుకుంటాను. అయితే నేను విధవను. నా భర్త చనిపోయాడు. ఆయన పోయిన తర్వాత వారు ఉద్యోగం చేస్తున్న ఆఫీసులోనే నాకు జూనియర్ అసిస్టెంటుగా ఉద్యోగం ఇచ్చారు.

నన్ను పెళ్ళిచేసుకోవడానికి ఎందరో ముందుకు వస్తున్నారు. అయినా వాళ్ళంతా నా భర్త తాలూకు డబ్బుకోసం, నేను చేస్తున్న ఉద్యోగం కోసమేనని అర్థంచేసుకున్నాను. అనవసరపు విషయాలు చెప్పి మీకు బోర్ కొట్టించానా?

మీనుంచి సమాధానం కొరకు వేయి కళ్ళతో
ఎదురుచూస్తూ—

భవదీయురాలు,
షాజహాన్ బేగం.

ఉత్తరం అంతా చదువుతున్న కృష్ణమోహాన్ పెద వులు దరహాసంతో కొద్దిగా విచ్చుకున్నాయి. యేదో విజయం సాధించినవాడిలా అతనిలో గర్వం పొడ నూపింది. మొత్తానికి మంచి కాలక్షేపం. తను ఒకసారి రాజమండ్రి వెళ్ళి షాజహాన్ను చూడాలనుకున్నాడు.

## 7

కృష్ణమోహాన్ స్కూటర్ సత్యభామ ఇంటిముందు ఆగింది.

ధైర్యంగా వుంటుందని బాగా నే మందు పుచ్చుకొని వచ్చాడతను.

అప్పుడు సమయం రాత్రి ఎనిమిదిగంటల ముప్ఫయి నిమిషాలు.

జనరంజనిలో అమృతాంజన్ అడ్వర్ టైజ్ మెంటు వినిపిస్తోంది.

సత్యభామ కృష్ణమోహాన్ కొరకు యెదురుచూస్తూ వాలుకుర్చీలో వాలి జనరంజని పాటలు వింటూ కూర్చుంది.

"ఏ నిమిషానికి ఏమి జరుగునో ఎవరూహించెదరు?" అంటూ ఘంటసాలగారు ఆలపిస్తున్నారు.

సత్యభామ కృష్ణమోహాన్ను చూసి—"రండి....రండి మీకోసమే ఎదురు చూస్తున్నాను" అంటూ ఆహ్వా నించింది.

"థ్యాంక్యూ, థ్యాంక్యూ వెరీమచ్! ఈ కృష్ణమోహా నుడు సత్యభామ కొరకు క్షణమొక యుగంగా నిన్నటి

నుండి వేచియున్నాడు. నీ కౌగిలిలో కరిగిపోయి నన్ను నేను మరిచిపోయే క్షణం కొరకు ఎదురు తెన్నులు చూస్తున్నాను."

ఇంటాక్సికేటెడ్ కండిషన్‌లో ఉండటం వలన అతని మాట కొంచెం తడబడుతోంది.

"నేనూ నీకోసమే ఎదురుచూస్తూ—కూర్చున్నాను." అంటూ లోనికివెళ్ళి స్కాచ్ విస్కీ, జీడిపప్పు ఐస్ క్యూబ్స్, గ్లాసులు తీసుకొచ్చి టీపాయ్‌మీద పెట్టింది.

ఆమె చేసిన ఏర్పాట్లను చూసి కృష్ణమోహన్ చాలా సంతోషించాడు.

సత్యభామ బాటిల్ తెరిచి రెండు గ్లాసుల్లో విస్కీ పోసి—ఐస్‌క్యూబ్స్‌వేసి, గ్లాసు అతనికి అందించింది.

ఇద్దరూ 'చీర్స్' చెప్పుకొని త్రాగడం మొదలు పెట్టారు.

కృష్ణమోహన్ అంతకుమునుపే తాగి వున్నాడు. కాబట్టి తొందరగా కిక్ ఇచ్చింది. ఏదేదో మాట్లాడేస్తున్నాడు.

"భామ.... భామ.... భామా! నీకు నా మీదెంత ప్రేమా!" అంటూనే కుర్చీమీదనుండి ఠపీమని పడిపోయాడు. ఇప్పుడు అతని శరీరంలో రక్తానికి బదులు ఆల్కహాలు ప్రవహిస్తోంది. అతని మెదడు ఆలోచించే శక్తిని, విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయింది.

ఆ అవకాశం కొరకే యెదురుచూస్తున్న సత్యభామ అతన్ని ఈడ్చుకొనివెళ్ళి, మంచంమీద పడుకోబెట్టి తాళ్ళతో గట్టిగా కట్టివేసింది.

ఆమె ఏం చేస్తుందో, ఎందుకు చేస్తుందో తెలుసుకోలేని స్థితిలో వున్నాడు కృష్ణమోహన్.

రాత్రంతా అతను మంచంమీద అదే స్థితిలో వున్నాడు.

తెల్లవారింది!

ఆల్కహాలు ప్రభావం దిగిపోయింది.

అతని మెదడు ఆలోచించే శక్తిని, విచక్షణా జ్ఞానాన్ని సంతరించుకుంది.

తాను ఒక మంచానికి కట్టివేయబడి వున్నాడనే సంగతి తెలుసుకొని ఆశ్చర్యపోయాడు. చేతులు, కాళ్ళు కదిపి చూశాడు. ఊహు కొంచెమైనా కదల్లేదు. నైలాన్ తాడుతో గట్టిగా కట్టివేయబడి వున్నాడతను.

తను ఎందుకీ మంచంమీద బందీగా వున్నాడు. అతను ఆలోచించడం మొదలుపెట్టాడు.

కొన్ని క్షణాల తర్వాత అతనికి అంతా గుర్తొచ్చింది. వెంటనే "సత్యభామా!" అని పెద్దగా అరవబోయాడు. కానీ, అతను అశక్తుడయ్యాడు.

అతని నోటికి ప్లాస్టర్ అంటించి వుంది.

సత్యభామను పిలవడానికని — "ఊం" అంటూ మూలగడం మొదలెట్టాడు.

కాలకృత్యాలు తీర్చుకొని, శుభ్రంగా స్నానంచేసి-టాయిలెట్ అయి తీరిగ్గా అతని మంచం దగ్గరికి వచ్చి, ఎగతాళిగా నవ్వుతూ నిల్చుంది. చేతిలో కొరడా వుంది.

సత్యభామను చూసి-అతను ఏదో మాట్లాడబోయాడు. నోటికి ప్లాస్టర్ అంటించి వుండటంవలన అతను మాట్లాడలేకపోయాడు.

అతను ఏం మాట్లాడుతాడో విందామని — అతని నోటికి అంటించి వున్న ప్లాస్టర్ను తీసివేసింది సత్యభామ.

"సత్యభామా, యేమిటి నన్ను ఇలా అన్యాయం చేశావు. నన్ను ఎందుకిలా బంధించావు. కాళ్ళూ చేతులు నొప్పి పెడుతున్నాయి. దయచేసి త్వరగా విప్పు!"

సత్యభామ క్రూరంగా చూస్తూ నవ్వింది.

"నీ కలాంటి శాస్తి జరగాల్సిందే! నిన్ను ఈ స్థితిలో చూడాలని నేను ఎంతో కాలంగా ఎదురుచూస్తున్నాను. ఇన్నాళ్ళకు నా కలలు పండాయి."

"నీకు నేనేమి అన్యాయం చేశానని—నన్ను ఇలా హింసిస్తున్నావు."

"రాక్షసుడా! నువ్వు అన్యాయం చెయ్యనిదెవరికిరా?" అంటూ చేతిలో వున్న కొరడాతో అతన్ని ఇష్టమొచ్చినట్లు బాదింది, నోటికి ఎప్పటిలా ప్లాస్టర్ అంటించి.

కాసేపటి తర్వాత స్పృహకోల్పోయాడు.

## 8

రెండురోజులు గడిచాయి

కృష్ణమోహన్ కనిపించకపోవడంతో అతని తల్లిదండ్రులు కంగారుపడిపోయి అతనికోసం అన్నిచోట్ల వాకబు చేశారు.

ఎక్కడా అతని ఆచూకి తెలియలేదు.

కృష్ణమోహన్ తండ్రి వెంకటేశ్వరరావుగారు కారు వేసుకొని—దగ్గరలో వున్న పోలీసుస్టేషన్ కొచ్చారు.

సబ్ఇన్స్పెక్టర్ నర్సింహారావు యేదో రాసుకుంటూ కూర్చున్నాడు.

వెంకటేశ్వరరావుగారు దగ్గరికి వెళ్ళి "ఎక్స్క్యూజ్ మి" అన్నాడు.

సబ్ఇన్స్పెక్టర్ రాసుకుంటున్నవాడు కాస్తా, ఎవరా, అని తల ఎత్తి చూశాడు.

ఎదురుగా అజానుబాహువైన అపరిచిత వ్యక్తి కని పించాడు. అతనొక గౌరవనీయమైన వ్యక్తిగా, డబ్బుతో వచ్చిన హుందాతో వెలిగిపోతున్నాడు.

"టేక్ యువర్ సీట్!" అన్నాడు యస్.ఐ.

అతను కూర్చున్నాడు.

తాను చెప్పదల్చుకున్నది యెలా మొదలుపెట్టాలో అతనికి అర్థంకాక రెండుక్షణాలు ఆగాడు.

యస్.ఐ. చొరవతీసుకొని—"టెల్ మీ, వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ!" అన్నాడు.

"మా అబ్బాయి కృష్ణమోహన్ గత రెండురోజులుగా కనిపించడంలేదండి! నాకేదో కంగారుగా వుంది" అన్నాడు.

"ఇంట్లో చెప్పకుండా, యేదైనా వూరికిగానీ వెళ్లాడేమో?"

"లేదండి! అతను ఇంట్లో చెప్పకుండా యెక్కడికీ వెళ్ళడు."

"ఐసీ! ఇంట్లోంచి బయటికి వెళ్ళేటప్పుడు ఎక్కడికెళుతున్నానని చెప్పాడు!"

"రెండో ఆట సినిమా చూసి తిరిగొస్తానని చెప్పాడండి!"

"ఏ సినిమా కెళ్తానని చెప్పాడు?"

"అది చెప్పలేదండి!"

"ఇంట్లోంచి ఎన్ని గంటలకు బయలుదేరాడు?"

"సాయంత్రం ఐదున్నరకు."

"నడిచి వెళ్ళాడా?"

"లేదు, స్కూటర్ మీద వెళ్లాడు."

"అయిదున్నరకు బయలుదేరితే-మొదటి ఆట సినిమా

తేలికగా చూడటానికి అవకాశముంది కదా?"

"అదే నాకూ తెలియడంలేదు. బహుశా వేరే ఏదైనా పని వుండి—అలా చెప్పి వెళ్ళాడేమో?"

"వేరే యేదైనా పని అంటే—అతనికి యెలాంటి పనులు వుంటాయి?"

"ఎలాంటి పని అంటే నేనెలా చెప్పగలను. వ్యాపార వ్యవహారాలను అతను బాగా పట్టించుకోడు. స్నేహితులతో జాలీగా తిరుగుతూంటాడు."

"మీరే వ్యాపారం చేస్తారు."

"షాగాకు వ్యాపారం!"

"అతని స్నేహితులందరిని వాకబు చేశారా? లేకపోతే వాళ్ళ అడ్రసులు ఇవ్వండి! మేము యెంక్వయిరీ చేస్తాం!"

"స్నేహితులందరినీ వాకబు చేశామండి! అసలు మొన్న వాళ్ళకు కనిపించలేదని చెప్పారు. అతని స్నేహితులందరి అడ్రసులు రాసుకొచ్చాను. మీరుకూడా ఒకసారి ఎంక్వయిరీ చేయండి!"

యస్.ఐ. అతను ఇచ్చిన కాగితాన్ని అందుకొని ఒకసారి చదువుకున్నాడు.

"మీ అబ్బాయి ఫోటో తెచ్చారా?"

వెంకటేశ్వర్రావుగారు వెంటనే తనతోపాటు తెచ్చిన క్యాబినెట్ సైజు ఫోటో కాపీ యస్.ఐ.కు అందించాడు.

యస్.ఐ. నర్సింహారావు ఆ ఫోటో చూసి ఆశ్చర్యపోయాడు.

సరిగ్గా అదే సైజు అలాంటి ఫోటో తనవద్ద వుంది. అతను వెంటనే తన డ్రాయర్ తెరిచి చూశాడు.

ఒక పిటీషన్‌తోపాటు అతని ఫోటో జత చేసి వుంది. అది నల్లకుంటలో వుంటున్న పల్లవి అనే అమ్మాయిని కృష్ణమోహన్ అనబడే ఇతను పెళ్ళి చేసుకుంటానని మోస గించి—తనను అనుభవించి మళ్ళీ కనిపించకుండా, పారి పోయాడని—తనకు న్యాయం జరిగేటట్లు చూడమని ఆ పిటీషనులో అభ్యర్థించింది.

గత వారం రోజులుగా తను ఇతనుకొరకే వెతుకు తున్నాడు.

ఆ విషయమేమి చెప్పకుండా—"ఆల్ రైట్, మేము ఇతని ఆచూకీతీస్తాము. దయచేసి మీరొక పిటీషన్ రాసి సంతకం చేసి ఇవ్వండి! తదుపరి చర్యలు మేము తీసు కుంటాము" అన్నాడు యస్.ఐ. నర్సింహారావు.

వెంకటేశ్వర్రావు అక్కడే కూర్చొని—గబగబా పిటీషన్ రాసి—యస్.ఐ. చేతికి అందించాడు.

యస్.ఐ. ఆ పిటీషన్ అందుకొని— "ఇక మీరు వెళ్ళి రావచ్చు! మీ అబ్బాయి ఆచూకి తీయటానికి మేము తగిన ప్రయత్నాలు చేస్తాము" అన్నాడు.

"యస్.ఐ. గారు దయచేసి—త్వరగా మా అబ్బాయి ఆచూకీతీసి—వాడు యే వైనా కష్టాల్లో ఇరుక్కుంటే— కాపాడండి! నా సంతోషంగా యిస్తున్నాను. యిది వుంచండి!" అంటూ ఒక పచ్చనోట్లకట్ట అతని ముం దుంచాడు.

యస్.ఐ. నర్సింహారావు అతనివంక తీవ్రంగా చూసి— "ఆ డబ్బు వెనక్కి తీసుకోండి!" అన్నాడు.

"ఫర్వాలేదు వుంచండి సార్!" అన్నాడు బ్రతి మాలుతున్న ధోరణిలో.

"మీరు ఆ డబ్బు వెనక్కి తీసుకోకపోతే—లంచం

ఇవ్వడానికి వచ్చాడని — మీమీద కేసు పెట్టాల్సి వస్తుంది!" అన్నాడు.

అతను ఆ మాట ఆ నేసరికి వెంకటేశ్వర్రావు ఖంగు తిన్నాడు. ఎంతో వ్యవహార దక్షత, వ్యాపార దక్షత ఉన్న వెంకటేశ్వర్రావు అలాంటి సమాధానం ఇంతవరకు వినలేదు.

చటుక్కున ఆ డబ్బు వెనక్కి తీసేసుకొని — "ఇందులో నా దురుద్దేశమేమి లేదు సార్! డబ్బిస్తే మా వాడి ఆచూకి తీయడంలో మీరు కాస్త శ్రద్ధ వహిస్తారని తప్పిస్తే—మిమ్మల్ని అవమానపరచడం నా ఉద్దేశ్యం కానేకాదు."

"అబ్బాయి గానీ, అమ్మాయి గానీ కనిపించకుండా పోయారంటే ఆ తల్లిదండ్రుల మానసిక క్షోభ యెంతో నేను తేలిగ్గా వూహించగలను. అలాగే వాళ్ళ ఆచూకీ తీయడంలో నేను ఏమాత్రం అశ్రద్ధ వహించను. ఏది ఏమైనా—మీరిలా డబ్బు ఇచ్చి—లంచగొండితనాన్ని ప్రోత్సహించడం, గర్హనీయం. ఇకముందు అలాంటి ప్రయత్నం చేయరని ఆశిస్తాను."

"ఆల్ రైట్, మీరు చెప్పింది గుర్తుంచుకుంటాను" అని వెనక్కి తిరిగివచ్చాడు వ్యవహార జ్ఞానం తెలిసిన వెంకటేశ్వర్రావు.

# 9

సత్యభామ ఆఫీసుకు వెళ్ళి—ఆరుగంటలకు యింటికి తిరిగొచ్చింది. తాళంతీసి లోనికి వెళ్ళింది.

లోపల గదిలో మంచంమీద కృష్ణమోహన్ బందీకృతుడై, వెల్లకిలా పడివున్నాడు. అతను దాదాపు మూడు రోజుల నుండి అన్నపానీయాలు లేకుండా ఆ

మంచంమీద పడివున్నాడు. అతని ముఖం బాగా పీక్కు-పోయింది. కళ్ళు లోపలికి పోయి కాంతివిహీనంగా వున్నాయి.

అరకప్పుండా అతని నోటికి ప్లాస్టర్ అంటించి ఉంది. సత్యభామ అతని దగ్గరికి వెళ్ళి క్రూరంగా నవ్వి—అతని నోటికున్న ప్లాస్టర్‌ను తీసివేసింది. అతను అతి భారంగా కళ్ళు తెరిచి—సత్యభామవైపు చూశాడు.

"దాహం.... దాహం!" నూతిలోనుంచి వచ్చినట్లుంది శబ్దం. అతను పూర్తిగా బలహీనుడై పోయాడు.

సత్యభామ అతనికి నీళ్ళు యివ్వడానికి బదులు చెంప ఛెళ్ళుమనిపించింది.

కృష్ణమోహన్ ఆ దెబ్బకు తట్టుకోలేక విలవిల లాడి పోయాడు.

ఓ నిముషంపాటు సొమ్మసిల్లిపోయాడు. తేరుకొని— "సత్యభామగారు, నన్ను యెందుకిలా చిత్రహింస చేస్తున్నారు? నేను మీకు యేం పాపం చేశాను?" ఎంతో కష్టంగా ఆ మాత్రం పలకగలిగాడు.

సత్యభామ తనివితీరా నవ్వి—"నువ్వెలగూ ఇవాళ రేపో చావబోతున్నావు, కాబట్టి నీ చావుకు కారణ మేమిటో—నీకు తెలియకపోతే, దానికి అర్థమే లేదు" అని కాస్సేపాగింది.

సత్యభామ ముఖం యెంతో గంభీరంగా మారి పోయింది. ఆమె మనసులో ఉదయించిన ఆలోచన తాలూకు భావాలు ఆమె కంటినుండి నీరు తెప్పించిన ట్లున్నాయి. ఆమె వెంటనే వాటిని కుదుటుకొని మనస్సును గట్టిపరుచుకుంది.

"శకుంతల నీకు తెలుసా?"

అతను మాట్లాడలేదు.

"ఊఁ చెప్పు!" అంటూ ముఖం మీద బలంగా గుద్దింది.

అతను బాధగా మూలిగి "తెలుసు .... ఆమెకు నేను...." అతని నోట్లోంచి మాట సరిగ్గా రావడంలేదు.

"అమాయకురాలైన మా అక్కయ్యను ప్రేమిస్తున్నాను. పెళ్ళి చేసుకుంటాను, సిరిసంపదల మధ్య తుల తూగిస్తాను, అని మాయమాటలు చెప్పి, ఆమెను లోబర్చుకొని గర్భవతిని చేశావు. అది పెళ్ళి చేసుకోమని నిన్ను ప్రాధేయపడితే ఆ కడుపు నావల్లనే అయ్యిందని గ్యారంటీ ఏమిటి? నాలాంటివారు ఎందరో—అని, నీ మాటల ఈటెలతో దాని మనస్సుకు గాయం చేశావు. తనకు జరిగిన అన్యాయాన్ని చెప్పుకునేందుకు మా నాన్న దగ్గరకెళితే—ఆయన నానా మాటలని మెడబట్టి గెంటించాడు.

పెళ్ళి కాకుండానే గర్భవతి అయినందుకు—తన ముఖం ఈ లోకానికి చూపెట్టలేక—అవమానభారంతో ఆత్మహత్య చేసుకొని ఈ లోకంనుండి శాశ్వతంగా వెళ్ళిపోయింది" సత్యభామకు తన అక్క గుర్తుకురావడంతో గుండెల్లోంచి ఉప్పెనలా తన్నుకొస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక ఆమె కళ్ళు జలజలా వర్షించాయి.

కృష్ణమోహన్ నిశ్శబ్దంగా రోదిస్తున్న సత్యభామను చూసి—"నన్ను క్షమించండి సత్యభామగారు. మీ అక్కయ్య చనిపోవడానికి నేనే కారకుడిని.... నేను పాపిష్ఠివాడిని....నన్ను క్షమించి వదిలెయ్యండి....ఇక ముందు యిలాంటి పొరపాట్లు చెయ్యను" బాధగా అన్నాడు.

సత్యభామ క్రూరంగా నవ్వింది.

"నిన్ను వదిలెయ్యాలా? ఇంకెంతమంది ఆడవాళ్ళ జీవితాలతో ఆటలాడుకుందామనుకుంటున్నావు."

"నన్ను నమ్ము. నాకు బుద్ధి వచ్చింది."

"నిన్ను వదిలేస్తే, నేను బ్రతికీ చచ్చినదానితో సమానమే! నిన్ను చంపడమే నా జీవిత లక్ష్యం. నీ మాయమాటలు విని మోసపోవడానికి నేను మా అక్కయ్యను కాను. నిన్ను యిలా చిత్రహింస పెట్టి చంపేస్తే—మా అక్కయ్య ఆత్మ శాంతిస్తుంది. నీచే మోసపోయిన ఎందరో ఆడబడుచులు నీ చావు వార్త తెలిసి ఎంతో సంతోషిస్తారు."

మరో రెండురోజులు గడిచాయి.

కృష్ణమోహన్ ఆకలిదప్పికలతో—చిత్రహింసలతో—ఆదే మంచంమీద క్రూరమైన చావు చచ్చాడు. ఆ శవాన్ని అతని తండ్రికి కానుకగా పంపించింది.

తన జీవిత ధ్యేయం నెరవేరినందుకు సంతోషించి, సత్యభామ పోలీసుస్టేషనుకు వెళ్ళి లొంగిపోయింది.

—: అ యి పో యిం ది —

# తీవ్రవాది

## ఎమ్. వి. వి. సత్యనారాయణ

మాధవి టెన్నిస్ రాకెట్ వూపుతూ కోర్టులోంచి యివతలకు వచ్చింది. అప్పటికే గోపాలరావుగారు కారులో కూర్చున్నారు.

మాధవి వెనుక సీటులోకి రాకెట్ గిరవాటు పెట్టి ఆయన ప్రక్కకు వచ్చి కూర్చుంది. కారు బయలుదేరింది.

"సాయంత్రం వార్తలు వినలేదు కదా నువ్వు?" అడిగాడు గోపాలరావు.

"లేదు నాన్నగారూ! ఏం చెప్పారు?"

"అమెరికాలో టెక్సాస్ రాష్ట్రంలో గూఢచారిచర్యలు జరుపుతోన్న విదేశీ ముఠా ఒకటి వున్నట్టు తెలిసిందని అధ్యక్షుడు ఆరోపించారట. ఆ ముఠాలో ఒకరిద్దరు భారతీయులు కూడా వున్నట్టు ఆయన అనుమానం వ్యక్తం చేశారు."

"చేసే....ఏమిటి?"

"మన మూర్తి టెక్సాస్ రాష్ట్రంలో కనిపించినట్టు

యిటీవల జానీ రాయలేదా?"

మాధవి ముఖంలో మార్పులు వచ్చాయి. మూర్తి ప్రసక్తి రావడమే అందుకు కారణం. మాధవి సుతారంగా మొహానికి పట్టిన చెమటలు తుడుచుకుంది.

"జానీ అంటే మీ అమెరికన్ స్నేహితుడు కదా!"

"అవునమ్మా! ఎంతమందికి రాయాలో అంతమందికీ మూర్తి గురించి రాశాను. జానీ సంయుక్త రాష్ట్రాలు తిరుగుతుంటాడు. అతడికి టెక్సాస్ రాష్ట్రంలో మూర్తి కనిపించాడంటే ఈ మధ్యలో వున్నాడేమోనని నా అనుమానం."

మాధవి నిట్టూర్చింది. మూర్తి మొదటనుండి టెర్రరిస్టు భావాలున్న వ్యక్తి. అమెరికామీదా, అమెరికా ఆయుధ సంపత్తి సేకరణపట్లా అంతులేని కోపం పెంచుకున్న వ్యక్తి. తనతో పెళ్ళయిన ఆరునెలలకే మూర్తి మాయమయ్యాడు. మూర్తికి వెనకా ముందూ యెవరూ లేరు. బాగా చదువుకున్నవాడనీ, గొప్ప చురుకుదనం వున్న వ్యక్తి అనీ గోపాలరావుగారు తనకు అతడితో ఆదర్శ వివాహం జరిపించారు. ఇల్లరికం తెచ్చుకున్నారు.

వెళ్ళిపోయే ముందు రాత్రి మూర్తి చేతిలో అమెరికా గురించిన హాండ్‌బుక్ చూచింది మాధవి.

"కొంపతీసి అమెరికా వెళ్తారా?...." అంది ఛలోక్తిగా.

"ఏం? వెళ్ళకూడదా?" అన్నాడు మూర్తి.

"అమెరికా అన్నా, అమెరికన్ సామ్రాజ్యవాద మన్నా మీకు కోపం కదా, అక్కడికి వెళ్ళి ఏం చేసుకు వస్తారు?"

"అక్కడి పరిస్థితులను గమనిస్తాను. అల్లకల్లోలం సృష్టి

స్తాను. నాకు సాధ్యపడినంతగా మార్చిపారేస్తాను.”

మాధవి భయపడింది. మూర్తి చేతలమనిషి! మాటల మనిషి కాడు. అతడు నిజంగా విదేశం వెళ్ళిపోతాడా? తన బతుకుతో ముడిపడివుంది. అతడు విదేశం వెళ్ళి అక్కడి పరిస్థితులమీద తిరగబడటం యేమిటి? మన దేశం లేదా? యిక్కడ అంతకంటె దుర్భరమైన పరిస్థితులు లేవా? ఆ మాత్రం సంస్కరణ భావాలున్నవాడు మాతృదేశాన్ని బాగు చేసుకోవచ్చునుకదా!

అయినా మూర్తి ఒకడివల్ల ఏమవుతుంది?

మాధవి ఆ రాత్రంతా నిద్రపోలేదనుకుంది. ఎప్పుడు కన్ను మూసి ఆదమరపుగా వుందో అప్పుడు మూర్తి మాయమయ్యాడు. ఎటు వెళ్ళి ఏమయ్యాడో తెలియరాలేదు. ఇంట్లో మేనత్త వుంది. మేనబావ వున్నాడు. పనిమనిషి వున్నాడు. వంటమనిషి వుంది. అయిప్పటికీ మూర్తి ఎవరి కంట్లోనూ పడకుండా వెళ్ళిపోగలిగాడు.

మూర్తికి యింకా అనుచర వర్గముందా?

“మూర్తిని వెనక్కి రప్పించే శక్తి మనలో లేదు” గోపాలరావుగారి గొంతు బొంగురుపోయింది. కంటి తడి కూతురుకు కనిపించకుండా జాగ్రత్తపడ్డాడు. అయినా మాధవి కనిపెట్టగలిగింది.

తండ్రి భుజం తట్టి “నాన్నగారూ!” అంది.

గోపాలరావుగారు నిభాయించుకోలేక పోయారు. రోడ్డు వారగా కారు ఆపారు. తండ్రీ కూతుళ్ళు బొట బొట కన్నీళ్ళు కార్చుతున్నారు.

దారిన యెవరు వెళ్తోంది వాళ్ళకు తెలియడంలేదు.

కారు తలుపువద్ద ఒక నడివయస్కురాలు ఆగింది. కొన్ని నిమిషాలు పాటు యిద్దరినీ పరకాయించి

చూసింది.

"అన్నయ్యా!" అంది చివరకు.

గోపాలరావుగారు తెలివిలోకి వచ్చారు. తల తిప్పారు. అనసూయ!

"ఏమమ్మా! నువు....యిటు...." రోడ్డుమీదకు చూశారు. ఆటో వుంది.

"అన్నయ్యా, పనిమీద బయలుదేరాను. కారును నువ్వూ, కోడలూ టెన్నిస్ క్లబ్బుకు తీసుకువెళ్ళినట్టు పని వాడు చెప్పాడు" అంది అనసూయ.

"పద....ఎక్కడ దింపాలి?" అడిగాడు గోపాల రావుగారు.

"ఫరవాలేదన్నయ్యా! మీరు యింటికి పదండి!" అన సూయ వెళ్ళిపోయింది.

గోపాలరావుగారు కళ్ళు తుడుచుకుని మాధవిని సముదాయించారు. కారు తిరిగి ప్రయాణం మొదలు పెట్టింది.

"నాన్నగారూ! ఆటోలో అత్తయ్య ప్రక్క ఎవరో మగతను కూర్చున్నట్టున్నారు" అంది మాధవి.

గోపాలరావుగారు విడ్డూరంగా చూచి, "ఎవరు? నువ్వు పొరబడి వుంటావమ్మా!" అన్నాడు.

"వెనుకసీట్లో యెవరో కూర్చున్నారు. పంచె కట్టు కున్నాడు. అందుకే అత్తయ్య తిరిగి ఆటోలో వెళ్ళి పోయింది. లేకపోతే కారు వదిలిపెట్టి వెళ్ళదు. అతడి జోళ్ళు కూడా కనిపించాయి."

గోపాలరావు తలూపి, "కావచ్చును. కావాలని మనని పలకరించి మనని యిటు చూచేలాగా చేస్తుందా?" అన్నాడు.

"ఆటో మనకు ఎదురుగా వచ్చింది. మనం చూశామో, లేదో నిర్ధారణ చేసుకోవడానికి పలకరించింది."

"అంతే అయుండాలి. అతడెవరై వుంటాడు?"

"ఏమో, ఆటోను వెంటాడదామా?"

"ఈ కారులోనా, వద్దమ్మా!" కారు మలుపుతిరిగి అప్‌లాండ్స్‌లో పరుగెత్తుతోంది.

# 2

"అమ్మా!" అన్నాడు రమేష్.

అనసూయ ఏమిటన్నట్టు చూచింది.

"మా స్నేహితుడి పెళ్ళికి వెళుతున్నాను. రెండువంద లుంటే యివ్వు."

"ఏమిట్రా! నీ ఖర్చు డబ్బు వందలు వందలుగా ఎక్కడినుండి రాలుతాయి."

"మామయ్య నడిగి తీసుకో! మనకి మాత్రం ఎవరున్నారు?"

అనసూయ చెక్కిళ్ళు నొక్కుకుంది. "హవ్వ...వందకీ రెండువందలకీ చెయ్యి జాపితే పరువుగా వుంటుందా?" అంది.

రమేష్ వెటకారంగా నవ్వి, "మనం ఇంట్లోపడి తింటున్నాం. అప్పుడు పరువు వుండగా లేనిది చెయ్యి జాపితే పరువు పోతుందా, విచిత్రంగా మాట్లాడతావమ్మా!" అన్నాడు.

అనసూయ నొచ్చుకున్నట్టు చూచి, "నా బాధ నీకు వెటకారంగా వుంటుందిలే, రమేష్! నువు మాధవిని పెళ్ళిచేసుకోవా? అప్పుడు ఈ ఆస్థి అంతా నీదేకదా! ఇప్పుడు వందలకు కక్కుర్తి పడతావా?" అంది.

"ఏమిటీ మాధవిని పెళ్ళిచేసుకోవడమా?"

"మరేమిటి? దానితో కలసి టెన్నిస్ ఆడటం ఒక్కటే అనుకుంటున్నావా? వెర్రి సన్నాసి! నువ్వొక వున్న యింటి వాడివయితే ఎంత బాగుంటుందిరా!"

"మాధవి మొగుడు అమెరికానుండి రాడనుకుంటున్నావా?"

"వాడి మొహం! వాడికి పెళ్ళి ఎందుకు?"

"అయినా యిదేం ఆలోచనే! రెండో పెళ్ళి దాన్ని చేస్తావా నాకు?"

"ఏం! మాధవికేం లోపంరా?"

"అదేమిటమ్మా, కొంతకాలం సంసారం చేసింది. భర్త యింకా బతికే వున్నాడు. మాధవిని తప్ప మరో అయినింటి పిల్లను చూడలేవా?"

"వెర్రివాడా? నీకేం వుందని ఆడపిల్లలు ఎగబడి వస్తార్రా?"

"అందుకని...."

"నేను చెప్పినట్టు చెయ్యి. మాధవిని బుట్టలో వేసుకో. అసలే వయసుమీద వుంది. భర్త తిరిగి వస్తాడన్న నమ్మకం ఆమెకు లేదు."

"నీతో ఆ సంగతి చెప్పిందా?"

"పిచ్చిసన్నాసీ! ఆడపిల్ల అంత చప్పున బయటపడిపోతుందా?"

రమేష్ చిరాకుగా చూచి, "తాజా హీరోయిన్ని వెంబడించినట్టు ఆమె ప్రేమకోసం వెంపర్లాడమంటావ్, అంతేనా?" అన్నాడు.

"అంతే! అంతే!"

పోర్టికోలో కారాగింది. అనసూయ చప్పున నోటిమీద వేలుంచుకుంది.

"మామయ్యకు తెలుస్తేనో...." గుసగుసలాడాడు కొడుకు.

"పరమానంద పడతాడు. కూతురి బ్రతుకు అడవి కాచిన వెన్నెల అయిపోయిందని అన్నయ్య మధనపడు తున్నాడు."

మాధవి స్లిప్పర్స్ టకటకలాడించుకుంటూ నడవ లోంచి వెళ్తోంది. తల్లీ కొడుకులు గదిలోంచి ఆమెవైపు చూశారు. ఆమెను గది దాటనిచ్చి తల్లి అంది.

"ఒక్కతే వచ్చినట్టుంది కారులో. యెక్కడికి వెళ్ళిందో?"

"స్నేహితురాలి కెవరికో యాక్సిడెంటయిందట. చూడ టానికి వెళ్ళింది."

"నీకు చెప్పిందా?" సంబరపడింది అనసూయ.

"మామయ్య కారు గురించి అడుగుతాడని పనివాడితో చెప్పింది."

"సరేలే.... రేపటినుండి అది నీ వలలో పడిందా లే నీకే చెప్పి వెళ్తుంది."

"కలలు కనక! డబ్బు యివ్వమ్మా, వెళ్ళిరావాలి!"

అనసూయ రుసరుసలాడింది. "నువ్వు మాధవితో మాట్లాడిరా! నేను ఈ లోపులో సిద్ధం చేసి వుంచుతాను" అంది.

రమేష్ చిరాకుగా బయటకు కదిలాడు. అడుగులో అడుగు వేసుకుంటూ మాధవి గదిముందాగాడు.

మాధవి పడక కుర్చీలో కూర్చుంది. పేపర్ తిరగ వేస్తోంది.

"రా రమేష్!" అంది.

రమేష్ తటపటాయించి ఆమెకు ఎదురుగా సోఫాలో

కూర్చున్నాడు.

"ఏమిటి రమేష్, పనిమీద వచ్చావా!"

"అబ్బే...."

"చెప్పు....డబ్బు కావాలా?"

"డబ్బుకాదు మాధవీ!"

"హూ! మరేమిటి?"

"నిన్ను ఒకటడగాలి."

"హూఁ!"

రమేష్ గుటక వేసి, "మనం కలసి సినిమాకు వెళ్దాం" అన్నాడు.

"ఓస్ ... అంతేనా? ఏమిటో విశేషం?"

"ఏమీ లేదు. నాకలా అనిపించింది అంతే!"

"తప్పకుండా."

రమేష్ గుటక వేసి, "రేపు" అన్నాడు.

మాధవి నవ్వి, "అలాగే. నువ్వు ఆడపిల్లలాగా ముడుచుకుపోతుంటే ఎంత ముచ్చటగావుందో తెలుసా?" అంది.

రమేష్ యింకా గిరికీలు తిరిగాడు.

"థాంక్స్....సినిమాకి వస్తానన్నందుకు" అన్నాడు.

పదినిమిషాలపాటు అవాకులు చవాకులు మాట్లాడి వెనక్కి తిరిగాడు. తల్లి ఆకిడికి గుమ్మంవద్ద దాగివుండి కనిపించింది. ఆమె కళ్ళలో వింత వెలుగు కనిపిస్తోంది.

రమేష్ చేతిలో రెండు వందరూపాయినోట్లు పెట్టింది.

మెట్లమీద చప్పుడయింది. గోపాలరావుగారు మెట్లెక్కుతున్నారు. తల్లి కొడుకులు గదిలోకి తప్పుకున్నారు.

గోపాలరావుగారి మొహం నల్లబడిపోయి వుంది.

మాధవి గదిలోకి నడిచారు.

"నాన్నగారూ!" అంది మాధవి గిగ్గున లేచి.

"వాడు ..యెంతమాటన్నాడో చూడు మాధవీ!" ఆవేశంతో అన్నారాయన.

మాధవి తండ్రి ఛాతీ చేతితో నిమిరి, "తొందర పడకండి నాన్నగారూ! కూర్చోండి...." అంటూ కూర్చుండబెట్టింది. కూజాలోంచి మంచి నీళ్ళందుకుని త్రాగింప చేసింది.

గోపాలరావుగారు స్థిమితపడ్డారు. పది నిమిషాలు గడిచాయి.

"భీమరాజు నీకు తెలుసుగదా తల్లీ!....వాడు నా కళ్ళముందు నిక్కర్ లేకుండా తిరిగిన వెధవ....యెంత మాటన్నాడో తెలుసా?"

"ఎక్కడ? పేకాటలోనా?"

ఆయన తలూపారు.

"అతడితో మీకు ఆట ఏమిటి?"

"వాడు ఎవరితోనో కలసి ఆడుతున్నాడు. మనం ఎవరం—అభ్యంతర పెట్టడానికి?"

"............"

"అమెరికా వెళ్ళిన అల్లుడు యిక తిరిగిరాడు. తన లాంటి మరో యోగ్యుడిని చూచి అమ్మాయికి పెళ్ళిచేస్తే బాగుంటుందని వాడు....సలహా యిస్తాడా?"

ఈసారి మాధవి మొహం నల్లబడింది. తల దించు కుంది.

"అందుకే వాడిని చడామడా తిట్టేశాను నలుగురూ పట్టేసుకున్నారు. లేకపోతే నరికి పోగులు పెట్టేవాడి నే!"

మాధవి ఏడుస్తోంది. తండ్రి గుండెలమీద తలవాల్చి

నిస్సహాయంగా ఏడుస్తోంది. వాళ్ళిద్దరికీ తెలియదు, తమను కిటికీలోంచి నాలుగు కళ్ళు చూస్తున్నాయనీ, ఆ కళ్ళలో సంతోషం వెల్లివిరుస్తోందనీనూ.

## 3

డిటెక్టివ్ శిరీష్ ఇద్దరివైపూ పరిశీలనగా చూచి, మరోసారి తన చేతిలోని విజిటింగ్ కార్డువంక చూశాడు.

గోపాలరావు, మేనేజింగ్ డైరెక్టర్, మాధవీ పల్వ రైజింగ్ మిల్స్, విశాఖపట్నం-19 అని వుంది కార్డులో.

"ఈమె మా అమ్మాయి మాధవి. మిల్స్ అమ్మాయి పేరనే వున్నాయి, మిస్టర్ శిరీష్" అన్నారు గోపాలరావుగారు.

శిరీష్ తలూపాడు. అప్పుడే మాధవి చేతులు జోడించింది.

శిరీష్ ఆమెను తిరిగి విష్ చేసి, "చెప్పండి గోపాలరావుగారూ! మీరు వచ్చిన పనేమిటి?" అన్నాడు.

గోపాలరావుగారు మెల్లగా దగ్గి, "మీకు దాపరికం లేకుండా అంతా చెబుతాను. దయచేసి నా అల్లుడిని అమెరికానుండి తిరిగి యిక్కడికి తీసుకురండి. ప్లీజ్" అన్నాడు.

"ఆయన పేరు?"

"మూర్తి."

"అమెరికా పౌరసత్వం తీసుకున్నారా?"

"లేదు. అమెరికాలో అతడు వుండటం ఆ దేశ ప్రభుత్వానికి కంటగింపుగా వుంటుంది. అతడు తీవ్రవాది. ప్రభుత్వం దృష్టిలోంచి తప్పించుకు తిరుగుతున్నాడు. అతడిని ఇండియా చేర్చాలి మిస్టర్ శిరీష్."

శిరీష్ రెండు నిమిషాలపాటు మాట్లాడలేదు.

"గోపాలరావుగారూ! మూర్తి అమెరికా వెళ్ళి ఎంత కాలమయి వుంటుందికి?"

"పోయిన సంవత్సరం ఆగస్టు 5న. ఏడాది దాటు తోంది."

"సంయుక్త రాష్ట్రాలలో తీవ్రవాద చర్యలతో పాల్గొన్నారా మూర్తిగారు?"

"అలా అనే అర్థమయింది. మొన్న అమెరికా అధ్యక్షుడు తీవ్రవాద కార్యకలాపాలు గురించి ప్రకటన చేశారు. ముఠాలో ఒకరిద్దరు భారతీయులున్నట్టు ఆయన అభిప్రాయపడ్డారు. ఒకరిద్దరిలో మా మూర్తి తప్పక వుండివుంటాడు" గోపాలరావుగారి గొంతు గద్గద మయింది.

"గోపాలరావుగారూ! మూర్తిగారిని ఇండియా తీసుకురావడం అంత సులువయిన పనికాదు. మొదటిది మూర్తిగారికి భారతదేశం తిరిగిరావాలని వుండాలి. తీవ్ర వాద కార్యకలాపాలు జరపడానికి మూర్తిగారు తనకు తానే అమెరికా వెళ్లారు. ఆయన ఎదురయ్యే ప్రమా దాలకు తలొగ్గే వెళ్లారనుకుందాం. ప్రస్తుతం ఆయన తాను ప్రమాదాలకు తట్టుకోలేని మానసిక స్థితిలోవుంటే తప్ప మనదేశం తిరిగిరారు. అవునా?"

"అవును. అది పెద్ద ఇబ్బంది!"

"తరువాత మూర్తిగారు కలసి పనిచేస్తున్న ముఠా ఆయనను అంత సులువుగా వదులుకోదు. తమ నిర్ణయాలకు కట్టుబడి పనిచెయ్యకపోతే మనిషిని శాశ్వతంగా పోగొట్టుకుంటుంది ముఠా. అంటే నా ఉద్దేశ్యం మీకు అర్థమయిందనుకుంటాను."

మాధవి కళ్ళు తడిశాయి.

"మూడోది.... అక్కడి ప్రభుత్వం మూర్తిగారిమీద నిఘా వేసి వుంటుంది. రేడియోలో మీరు విన్న వార్త ప్రకారం అయితే 'కనిపిస్తే కాల్చివేత!' వంటి ఉత్వారు చేసివున్నా ఆశ్చర్యంలేదు."

"మీ అనుమానం నిజం కావచ్చును. కాని అమెరికా మనకు మిత్రదేశం. రాజకీయ ఖైదీ విషయంలో కనీసం పట్టుకున్నట్టయినా తెలియపరుస్తారనుకుంటాను."

శిరీష్ భుజాలు చరుచుకుని, "అలా అయితే మంచిదే! ఆటు తర్వాత క్షమాభిక్షకోసం ప్రయత్నించవచ్చును" అన్నాడు.

గోపాలరావు ఆశగా చూచి, "మిస్టర్ శిరీష్! మీరు వెళ్ళడానికి ఒప్పుకున్నట్లే కదా! ప్లీజ్.... అవుననండి..." అన్నాడు.

"ఎప్పుడు బయలుదేరాలి?" బల్లమీది కాలెండర్ చూశాడు శిరీష్.

"మీ ఇష్టం. ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా వీసా, పాస్‌పోర్టు, ఎయిర్ టికెట్‌లకోసం నేను ప్రయత్నిస్తాను. మీకు ఖర్చులుపోను అయిదులక్షల రూపాయిలు ఫీజు యిస్తాను. అంతకంటె యెక్కువ కావాలంటే నిర్మొహమాటంగా మీరు తీసుకోవచ్చును."

శిరీష్ చాలునన్నట్టు చూచి, "రెండు రోజులలో ఏర్పాటు చేయించండి డబ్బు. రెండులక్షలు అడ్వాన్స్‌గా కూడా!" అన్నాడు.

"తప్పకుండా మిస్టర్ శిరీష్! మాధవికోసం మా మేనల్లుడు రమేష్, నా పేకాట ఫ్రెండ్ భీమరాజు కలలు కంటున్నారు. మూర్తి యిక రాడనీ, రెండో పెళ్ళి చేయమనీ నా చెల్లెలు అంటే రమేష్ తల్లి శతపోరు

తోంది. మీరు మూర్తిని తీసుకురావాలి. వీళ్ళందరి నోళ్ళూ మూతపడిపోవాలి" అన్నాడు గోపాలరావు ఆవేదనగా.

4

భీమరాజు టాక్సీ దిగాడు. గేటు తెరచుకుని ఇంట్లోకి నడిచాడు. గోపాలరావుగారు మెయిన్ హాలులోనే కనిపించారు.

"గోపాలరావుగారూ! మీతో మాట్లాడాలని వచ్చాను" అన్నాడు భీమరాజు.

గోపాలరావుగారిలో అసహ్యం ఉవ్వెత్తున లేచింది. సభ్యతకోసం లోపల్లోపలే అణచుకున్నాడు. భీమరాజుకు సీటు చూపించి, "నాతో నా?" అన్నాడు.

భీమరాజు కూర్చున్నాడు. "అవును. గోపాలరావుగారూ! నా ప్రవర్తనకు మన్నించమని కోరడానికి వచ్చాను."

"దట్సాల్ రైట్!"

"అలాకాదు. మాధవి మీకెంత ఆత్మీయురాలో రా నాకూ అంతే! ఆమె శ్రేయస్సే నేను కోరేది. ఆమాట చెప్పబోయి నాలుక తిరగబడింది."

"ఫరవాలేదు. మీరు బాధపడకండి!"

"మీ అల్లుడుగారిని విదేశం నుండి రప్పించుతున్నారా?"

గోపాలరావుగారు బలవంతంమీద మాట అపుకున్నారు. "ఆ ప్రయత్నం చేయాలి! ఇప్పటికే ఆలస్యమయిపోయింది కదా!" అన్నారు.

మెట్లమీద చప్పుడయింది. భీమరాజు అటు చూచి నవ్వాడు. రమేష్ కూడా పలకరింపుగా నవ్వి మెట్లు దిగ

బోయాడు.

"రమేష్!" అంది అనసూయ.

రమేష్ వెనక్కి తిరగకుండానే, "ఏమిటమ్మా!" అన్నాడు.

"ఒక్కసారి రా."

"రమేష్ వెనక్కి తిరిగి వెళ్ళాడు.

"మీ మేనల్లుడు ఏం చేస్తున్నాడు?" అడిగాడు భీమరాజు.

"పల్వరైజింగ్ మిల్సులోనే...."

తండ్రి మాట ముగియకముందే మాధవి కాఫీలతో వచ్చింది. భీమరాజు తలవాల్చుకున్నాడు. మాధవి కాఫీ అందించి వెళ్ళిపోయింది.

భీమరాజు లేచాడు. "గోపాలరావుగారూ! సెల విప్పించండి!" అన్నాడు.

గోపాలరావుగారు అతడిని గుమ్మందాకా సాగనం పారు. ఆయన తిరిగివచ్చేటప్పటికి మాధవి మెట్లకిందే నిల బడి భీమరాజు వెళ్ళినవైపే చూస్తోంది.

"నాన్నగారూ! ఈయనెవరు?" అడిగింది మాధవి.

"కావాలనే నీకు పరిచయం చేయలేదమ్మా, భీమరాజు అంటే యితడే!"

"అదే పంచెకట్టూ, అవే జోళ్ళూ...."

"ఏమిటమ్మా?"

"అత్తయ్య ప్రక్క ఆరోజు ఆటోలో చూచింది అదే పంచెకట్టూ, అవే జోళ్ళూ...."

"ఏమిటి నువ్వనేది?"

"అవును నాన్నగారూ! నిజమే! నా కళ్ళు నన్ను మోసం చెయ్యవ్."

గోపాలరావుగారు చటుక్కున ముందు కడుగువేసి పైకి చూశారు. అనసూయ కిందకే చూస్తోంది. అన్న గారిని చూడగానే తడ డింది. చూపు మరల్చుకుంది.

"బజారుకు వెళ్ళి రా, రమేష్!" అంది అనసూయ.

రమేష్ మెట్లు దిగి బయటకు వెళ్ళిపోయాడు. గోపాల రావుగారి మొహం తెల్లకాగితంలాగా అయింది. అసలు భీమరాజు యిలా యింటికి ఎందుకు వచ్చాడు? కేవలం క్షమాపణ చెప్పుకోడానికేనా? ఏమో....తనకు నమ్మకం కలగడంలేదు.

భీమరాజు తేనెపూసిన కత్తి. మాధవిమీద అతడి దృష్టి తప్పిపోయిందనటానికి లేదు. భీమరాజు మొండి మనిషని చెప్పుకుంటారు.

గోపాలరావుగారు ఊయ లూగినట్లు అటూ యిటూ వూగారు. ఒక దశలో చెల్లెలినే అడిగి విషయం తేల్చు కోవా లనుకున్నారు. చెల్లెలు నిజం చెబుతుందని యేమిటి?

"ఈ సంగతి నీలోనే వుంచుకో మాధవి!" అని గోపాలరావుగారు బయటికి వెళ్ళిపోయారు.

# 5

ఎయిరిండియావారి బోయింగ్ విమానం అట్లాంటిక్ సముద్రజలాలమీద ఎగురుతోంది. దూరంగా విశాలమైన అమెరికా ఖండం జలాలకు అంచులో తేలుతోన్నట్టు కనిపిస్తోంది. ఎత్తయిన భవనాలు ఖండానికి వింత హుందా తనాన్నిస్తున్నాయి.

డిటెక్టివ్ శిరీష్ వాచీ చూసుకున్నాడు. సరిదిద్దుకున్న సమయం ప్రకారంగా ఉదయం పదిగంటల ముప్ఫయి నిమిషాలయింది. మరో అరగంటలో విమానం కాలి

ఫోర్నియా రాష్ట్రంమీద ఎగురుతోంది. మాడ్రిల్ ఎయిర్ పోర్టులో విమానం దిగింది.

డిటెక్టివ్ శిరీష్ విమానం దిగి అనవాయితీలు ముగించుకుని టాక్సీలో బయలుదేరాడు. పారగన్ హోటల్లో గది తీసుకుని బడలికతీర్చుకున్నాడు. తరువాత టాక్సీ కట్టించుకుని వాషింగ్టన్ వీధిలో 106-సి, అపార్ట్మెంట్ ముందాగాడు.

గేటుకు డబ్ల్యు. బి. జానీ అని బోర్డు వుంది.

కాలింగ్ బజ్జర్ నొక్కాడు శిరీష్. తలుపు తెరుచుకుంది. ముసలావిడ ప్రత్యక్షమయింది. డ్రాయింగ్ రూం లోకి దారి చూపించింది.

"అబ్బాయి నిద్రపోతున్నాడు" అంది ముసలావిడ.

"ప్లీజ్! అతడిని నిద్ర లేపండి. నేను భారత దేశం నుండి వచ్చాను."

ముసలావిడ లోపలకు వెళ్ళి రెండు నిమిషాలలో జానీను పంపించింది. పరస్పరం విష్ చేసుకున్నారు.

జానీకు నలభైఅయిదు సంవత్సరాలుంటాయి. బట్ట తల. ఎర్రగా మిగులముగ్గిన యాపిల్ పండు లాంటి శరీరం.

"మిమ్మల్ని గోపాలరావుగారు పంపించారా?" అడిగాడు జానీ.

శిరీష్ తలూపాడు.

"పనిమీద వచ్చారా?"

"మూర్తిని భారతదేశం తీసుకువెళ్ళాలని వచ్చాను."

జానీ భయంగా చూశాడు. చటుక్కున లేచి కిటికీలు తణిఖీ చేసి వచ్చాడు.

"మిమ్మల్ని యెవరూ వెంటాడలేదు కదా!"అన్నాడు.

శిరీష్‌కి అతడి ప్రవర్తన విచిత్రంగా తోచింది.

"లేదు" అన్నాడు.

"తీవ్రవాదుల విషయం ఎత్తితే చాలు ప్రభుత్వం జెయిలులో పెట్టాలని చూస్తోంది. మూర్తిని మనం మార్చలేము."

"తీవ్రవాదులు ఏమాత్రం సంఖ్యలో వుంటారు?"

"ప్రభుత్వం లెక్కల ప్రకారం నూటయాభైమంది!"

"అన్ని రాష్ట్రాలలోనూ వున్నారా? ఒక్క రాష్ట్రంలో నే వున్నారా?"

"వాళ్ళు ఎక్కడ ఏ రూపంలో వుంటారో చెప్పలేం. నన్నడిగితే మీరు మౌనంగా వెనక్కి తిరిగి వెళ్ళిపోతే మంచిదేమో!"

"మీ సలహాకి థాంక్స్."

"మూర్తి నాకు టెక్సాస్ రాష్ట్రంలో కనిపించాడు."

"మీతో మాట్లాడాడా?"

"లేదు. అతడు మారువేషంలో వెళ్తోంటే గుర్తుపట్టి పిలిచాను. పలకరించవద్దన్నట్టుగా కళ్ళు పెద్దవిచేసి చూచి, టాక్సీ కుదుర్చుకుని వెళ్ళిపోయాడు."

"టెక్సాస్ రాష్ట్రంలో ఏ నగరంలో అతడు మీకు కనిపించాడు?"

జానీ కొన్ని నిమిషాలపాటు ఆలోచించుకుంటూ వుండిపోయాడు. తర్వాత అన్నాడు "పిట్స్‌బర్గ్!"

"తీవ్రవాదుల కార్యకలాపాలు ముఖ్యంగా ఏ సమస్యలను కేంద్రీకరించి వున్నాయో చెప్పగలరా?"

"నాకు తెలియదు మిస్టర్ శిరీష్!"

"పిట్స్‌బర్గ్‌లో బొగ్గుగనులున్నాయి కదూ!"

"అవును. వున్నాయి."

"అక్కడి కార్మికుల సమస్యలమీద తీవ్రవాదులు పని చేస్తున్నారా?"

"చేయవచ్చును."

"నన్ను పిట్స్‌బర్గ్ వెళ్ళమంటూరా?"

"నేనయితే వెళ్ళమనను. గోపాలరావుగారు ఒకటి, మీ రొకటీ కాదు."

"థాంక్స్."

"మూర్తి ఈ ఖండం వదలిపెట్టి రాడనుకుంటాను. ఐమీన్ — రాలేడనుకుంటాను."

"ఏం? ఎందువలన?"

"నేనొకసారి కదిపాను. అతడి చివరి రక్తంబొట్టు యీ గడ్డమీదనే రాల్చాలని వుందట!"

"అదేమిటి? మాతృదేశానికి రక్త తర్పణ చేసేవాడికి లాగా!"

జానీ పెదిమలు చప్పరించాడు.

జానీ తల్లి డ్రింక్స్ అందించింది.

"మూర్తిని తీసుకువెళ్ళాలంటే ప్రభుత్వం వొప్పుకుంటుందా?" అడిగాడు శిరీష్.

"వొప్పుకోదు."

శిరీష్ సెలవుతీసుకుని బయటకు కదిలాడు. టాక్సీ పట్టుకుని పారగన్ హోటల్ చేరుకున్నాడు. జానీ చెప్పిన విషయాలు మననం చేసుకున్నాడు.

మూర్తిని జానీ ఎందుకు భారతదేశం పంపించలేక పోయాడు? మూర్తికి పరాయిదేశంమీద అంత మోజెందుకు కలిగింది? మూర్తిని కలుసుకోవద్దన్నట్టు జానీ పరోక్షంగా హెచ్చరించాడు. మూర్తితో తారసపడటం

నిజంగా అంత ప్రమాదంగా వుందా?

కిటికీలోంచి క్రిందకు చూశాడు. రోడ్డుమీద రద్దీగా వుంది. అవతలప్రక్క పార్కింగ్ ప్లేస్‌లో కారాగింది. కారులోంచి జానీ దిగాడు. శిరీష్ అతడివైపు నుదురు చిట్లించి చూశాడు.

డిటెక్టివ్ శిరీష్ చకచక అద్దం ముందు నిలబడి వేషం మార్చుకోసాగాడు. అయిదు నిమిషాలలో అచ్చంగా యూరోపియన్‌లాగా మారాడు. గదికి తాళంపెట్టి క్రిందకు దిగాడు. జానీ కౌంటర్‌లో యేదో విషయం దర్యాప్తు చేసినట్టుంది. వెనక్కి తిరిగి పార్కింగ్ ప్లేస్ వైపు వెళుతున్నాడు. శిరీష్ అతడివైపు చూడకుండా అటు తిరిగి కారుకు అటువైపు వచ్చాడు.

కారులో డ్రయివర్ లేడు. అతడే స్వయంగా డ్రయివ్ చేసుకువచ్చినట్టుంది. అతడు తల తిప్పకుండా వచ్చి కారులో కూర్చున్నాడు. డిటెక్టివ్ శిరీష్ చేతిలో వున్నవస్తువును క్రిందకు జారవిడిచి మధ్యలోనే బూటుతో అందుకుని కారు వెనుక చక్రం ఉబ్బెత్తు పళ్ళానికి తాకించాడు. పళ్ళెం రంగులో పల్చగా దానికి అతుక్కుపోయింది.

కారు కదిలింది.

డిటెక్టివ్ శిరీష్ అటూ యిటూ తచ్చాడి చుట్టూ పరకాయించి చూసుకున్నాడు. తనను ఎవరూ పరిశీలించడంలేదు.

# 6

అర్ధరాత్రి క్రమంగా గడుస్తోంది. నగరం దాదాపు నిద్రావస్థలో వుంది. ఇంకా రెండో ఆట సినిమాలు వదలిపెట్టలేదు.

గోపాలరావుగారు మోటార్ సైకిలు నడుపుతూ మేఫెయిర్ జంక్షన్ దాటారు. వీధిదీపాల వెలుతురు అంతగా ప్రతిఫలించని చోట మోటార్ సైకిలు ఆపారు. దిగి స్టాండు వేసి చుట్టూ చూశారు.

ఒక ప్రక్కగా బార్ వుంది. దాని ప్రహారీగోడకు అనుకుని పూరిగుడిసె లున్నాయి. ఎక్కడో పూరకుక్క మొరుగుతోంది. సైకిలుకు తాళంపెట్టి నెమ్మదిగా నడవసాగారు.

భీమరాజు యిల్లు నిశ్శబ్దంగా వుంది. వాకిట్లో పదిహేను కాండిల్ బల్బు నీరసంగా వెలుగుతోంది. గోపాలరావుగారు ఇంటిని చుట్టవచ్చారు. వీధిగుమ్మం తెరిచివుంది. మెయిన్ హాలులో జీరో బల్బు వెలుగుతోంది.

హాలులో ప్రవేశించారు గోపాలరావు. భీమరాజు గది తలుపు దగ్గరగా చేరవేసి వుంది. గోపాలరావుగారు మిగతా గదుల్లోంచి అలికిడి కోసం చెవు ఓరగా పెట్టి విన్నారు. పిల్లలు కానీ, భీమరాజు భార్యకానీ మెలకువలో లేరు.

భీమరాజు గదితలుపు మెల్లగా తోశారు గోపాలరావుగారు. తలుపు తెరచుకుంది. గదిలో చీకటిగా వుంది. గోపాలరావుగారు జేబులోంచి టార్చిలైటు తీశారు. అరచేతిని అడ్డంపెట్టి టార్చి వెలిగించారు. వ్రేళ్ళ మధ్యనుండి కాంతి నేలమీద పడుతోంది.

గదిని వెతకసాగారు గోపాలరావుగారు.

గదిలో ఒక మూలగా కూర్చుండి వున్నాడు భీమరాజు. అతడి వీపు గోడమూలకు కాస్త ఒంపుగా చేరగిల పెట్టి వుంది. కాళ్ళు బార్లగిల చాపి వున్నాయి. రెండు చేతులూ రెండు తొడలమీదా ఆన్చివున్నాయి. మొహం

ఒకప్రక్క గోడకు తాకుతోంది. ఎడమకన్ను స్పష్టంగా కనిపిస్తోంది. పగిలిన పత్తి కాయలాగా తెరుచుకుని వుంది.

గోపాలరావుగారి చేతిలోంచి టార్చిలైటు పడిపోయింది. అద్దం చప్పుడు చేస్తూ చిట్లింది. నేలమీద అస్తవ్యస్తమైన వెలుగుచార దొర్లుతోంది.

అవతల గదిలో అలికిడయింది.

"ఒరేయ్ పెద్దోడా! ఎక్కడో చప్పుడయిందో రేయ్!" అంది భీమరాజు భార్య.

పెద్ద కొడుకు మాట్లాడలేదు. ఆమెకీ నిద్ర బధకంగా వుంది. గోపాలరావుగారికి తానున్న పరిసితేమిటో అర్థం కావడంలేదు. భీమరాజు చచ్చిపోయి వున్నాడు. ఎలా చచ్చిపోయాడు? గది మూలగా కూర్చుండి యెందుకు చచ్చిపోయాడు?

గోపాలరావుగారి వెన్ను జలదరించింది. తనకంటె యింట్లో ముందుగా ఎవరో ప్రవేశించారు. వాళ్ళు భీమరాజును చంపేశారు. గోపాలరావుగారి శరీరమంతా వొణుకుతోంది.

గోపాలరావుగారు కొంతసేపటికి కుదుటపడ్డారు. వణుకుతున్న వ్రేళ్ళతో టార్చిలైటు అందుకున్నారు. వెలుతురు భీమరాజుమీద పడేలాగా పట్టుకున్నారు.

భీమరాజు ఒంటికంటి రాక్షసుడిలాగా కనిపిస్తున్నాడు పొడవు కమీజూ పంచెకట్టూమీదా వున్నాడు. ఒంటిమీద ఎక్కడా గాయం కనిపించడంలేదు. గాయం అటు గోడవైపు వున్న శరీరభాగంలో వున్నదేమో! నేలమీద రక్తం కూడా లేదు.

గోపాలరావుగారు యిక చూడలేక పోయారు.

వెనక్కి తిరిగారు. తలుపు దాటి మెయిన్ హాల్లోకి వచ్చారు.

కళ్ళు మిరుమిట్లు గొలిపేలాగా లైట్లు వెలిగాయి. గోపాలరావుగారు స్థాణువై పోయారు. కళ్ళు కొద్దిసేపటివరకూ వెలుతురుకు అలవాటుపడలేదు.

"ఎవరు మీరు?" అరచింది ఆమె.

గోపాలరావుగారు ఆమెను భీమరాజు భార్యగా గుర్తించారు.

"ఏమండీ! దొంగ! దొంగ! ఏమండోయ్! పిల్లలూ! పెద్దోడా! మన యింట్లో దొంగ పడ్డాడు." ఆమె పెడబొబ్బలు పెడుతోంది. గోపాలరావుగారు శక్తి తెచ్చుకుని బయటకు కదిలారు. ఆమె తన భర్త గదిలోకి పరుగెత్తింది.

కేకలు పెట్టుకుంటూ పిల్లలు లేచారు. ఇరుగు పొరుగు లేచివచ్చారు. గోపాలరావుగారిని పట్టుకున్నారు.

భీమరాజు గదిలోంచి శోకాలు వినిపిస్తున్నాయి. "హాయ్యో.... నా దేవుడిని చంపేశారండోయ్.... నే నేం చేతున్రోయ్...." అంటోంది భీమరాజు భార్య.

క్షణాలలో పోలీసులకు కబురు వెళ్ళింది.

"భీమరాజు గారిని మీరు గొంతు పిసికి చంపారు. అవునా?" అడిగాడు క్రయిమ్‌బ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ కుమార్.

గోపాలరావు తల అడ్డంతిప్పారు. "నేను కాదండి ఇన్‌స్పెక్టర్ గారూ! భీమరాజుతో ఒక రహస్యమైన విషయం గురించి అడగాలని వచ్చాను" అన్నారు.

"ఏమిటది?"

"చెప్పకూడదు."

కుమార్ కోపంగా చూచి, "దయచేసి ఏం జరిగిందో చెబుతారా?" అన్నాడు.

"చెబుతాను. భీమరాజుకు భార్యా పిల్లలూ వున్నారు. నా అల్లుడు తాత్కాలికంగా విదేశాలలో నివశిస్తున్నాడు. నా కూతురును తనకు యిచ్చి రెండో పెళ్ళి చెయ్యమంటాడు. అంతేకాదు. వితంతువైన నా చెల్లెలిని రకరకాల మాటలంటున్నాడట."

అతడు నా కూతురుపట్ల మాట్లాడిన విషయానికి మొన్న మా ఇంటికి వచ్చి క్షమాపణ అడిగాడు. మరల యీ రోజు క్లబ్బులో మరల అదే విషయం లేవనెత్తాడు. ఇక యింట్లో అతడు ఏకాంతంగా వున్నప్పుడు యీ విషయాల గురించి చర్చించి అతడితో క్షమాపణ ఉత్తరం రాయించుకోవాలనుకున్నాను.

భీమరాజు రాత్రి ఒంటిగంటవరకూ నిద్రపోడు. తన వ్యాపారం లెక్కలు జమ చూసుకుంటాడు. కాని నేను గదిలోకి వెళ్ళేసరికే అతడు చచ్చిపోయి వున్నాడు. నాకు అంతే తెలుసు!"

"ఇంట్లోకి ఎలా ప్రవేశించారు?"

"ప్రవేశ ద్వారం తెరచే వుంది."

"భీమరాజుగారు మీకు క్షమాపణ వుత్తరం రాసివ్వకపోతే హత్య చేయాలని వచ్చారా?"

"ఇన్స్పెక్టర్ గారూ! ఈ నగరంలో అంతో ఇంతో నా పేరు వినే వుంటారు. భీమరాజును హత్యచేయాలంటే నేనే స్వయంగా రావాలా? కిరాయి మనుషులను నియమించగల సత్తా వున్నవాడినని మీరూ ఒప్పుకుంటారు. భీమరాజును ఎవరు హత్యచేశారు? మీరు తెలుసుకోవాలి."

కుమార్ తలపంకించాడు. "గోపాలరావుగారూ! ఈ హత్య కేసు తేలేవరకూ మీరు నగరం విడిచిపెట్ట కూడదు. బెయిలు కావాలంటే యాభైవేల రూపా యిలకు పూచీకత్తు యివ్వాలి!"

గోపాలరావుగారు తలూపారు.

ఇన్‌స్పెక్టర్ కుమార్ శవంవున్న గదిలోకి వెళ్ళాడు. ఫోటోగ్రాఫరూ, వ్రేలిముద్రల నిపుణుడూ తమ తమ విధి నిర్వహణలో తలమునకలవుతున్నారు. కుమార్ గదిని పరిశీలించి చూడసాగాడు.

మెల్లగా పెదిమ విరిచి శవంవైపు తిరిగాడు.

# 7

డిటెక్టివ్ శిరీష్ చేతివాచీ చూసుకున్నాడు. వాచీలో సగం భాగం సమయం చూపిస్తోంది. మిగతా సగం మినీ కంప్యూటర్. రకరకాల మీటలున్నాయి. మీట నొక్కి అట్టే పెట్టాడు శిరీష్. సమయం చూపించే తెర తెల్లగా అయింది.

"రింగ్ .... రింగ్ ...." తెల్లటి తెరమీద చుక్క కదలడం ప్రారంభమయింది. ఎర్రటి చుక్క వేగంగా కదులుతోంది.

డిటెక్టివ్ శిరీష్ కారు స్టార్టుచేశాడు. చుక్క కదులు తోన్న దిశను డిగ్రీలతో గుర్తించి కారును అటు కదిపాడు. నున్నటి విశాలమైన సిమెంట్ రోడ్డుమీద కారు పాదరసంలాగా జారుతోంది. చుక్క దిశమారి క్రిందకు జరుగుతోంది. రోడ్డుప్రక్క బోర్డులు కనిపించి మాయ మవుతున్నాయి.

ముందు ప్రయాణిస్తోన్న చుక్క పిట్స్‌బర్గ్ వైపు

ప్రయాణిస్తోంది. పిట్స్‌బర్గ్ యింకా యిరవై కిలోమీటర్లుండగా చుక్క ఆగిపోయింది. డిటెక్టివ్ శిరీష్ కారు వేగం పెంచాడు. రానురాను చుక్క దగ్గరపడుతోంది.

డిటెక్టివ్ శిరీష్ కారును రోడ్డుదింపి పొదలమధ్య ఆపాడు. వాచీ చూసుకుంటూ ముందుకు కదిలాడు.

దూరంగా పాడుపడిపోయిన కోట గోడలు కనిపిస్తున్నాయి. పొదలలోంచి ప్రాకుతూ గోడలకు సాధ్యమైనంత దగ్గరగా వెళ్ళాడు. గోడలమధ్య ఖాళీస్థలం వుంది. ఆ స్థలంలో నలుగురు యువకులు మెషీన్ గన్స్ పట్టుకు కూర్చున్నారు. వాళ్ళకు యివతల జానీ విలబడి ఒక యువకుడితో మాట్లాడుతున్నాడు. ఖాళీస్థలంలో విమానం ఆగివుంది.

డిటెక్టివ్ శిరీష్ ఆ యువకుడిని గుర్తుపట్టాడు. అతడు గోపాలరావుగారి అల్లుడు. మొహంలో ఒక రకమైన ప్రశాంతత వుంది. ప్రశాంతత వెనుక ఎలాంటి ఆవేశం వుందో కాని చీటికి మాటికి పళ్ళు పటపటలాడిస్తున్నాడు. జానీవైపు చూడకుండా జవాబులు చెబుతున్నాడు.

"హోటల్‌లో దిగాడంటే మాట్లాడవేం?" అన్నాడు జానీ.

"నేను భారతదేశం వెళ్ళేది లేదుకదా! యెందుకు కంగారు పడతావు?" అన్నాడు మూర్తి.

"అతడిని కూడా వెళ్ళనివ్వకుండా చేయాలి."

"చెయ్యి. నాకు చెబుతావేం?"

"నిన్ను వెతకడానికి మీ మామయ్య యెంతమందిని పంపుతాడో చూడాలి. ప్రతి ఒక్కడిని యిక్కడ చంపి పారెయ్యాలి!"

"పూఁ! చంపెయ్! నాకెందుకు చెబుతావు?"

"తప్పకుండా! ఈ రోజు బొగ్గుగని కార్మికుల గురించి వాళ్ళ యజమానులతో మాట్లాడతానన్నావుగుర్తుందా?"

"ఆః! బయలుదేరదాం!" మూర్తి కదిలాడు. తన అనుచర వర్గానికి జాగ్రత్తగా వుండమని చెప్పి జానీతో కలిసి బయలుదేరాడు.

డిటెక్టివ్ శరీఫ్‌కి కొన్ని క్షణాలపాటు ఏం చేయాలో అర్థంకాలేదు. మూర్తిని పిట్స్‌బర్గ గని కార్మికుల సమావేశంవరకూ వెంబడించి వెళ్తే ప్రయోజనం ఏముంటుంది? అతడి కారుకే తాను ట్రాన్స్‌మీటర్ అతికించి మూర్తి వుంటున్న రహస్య స్థావరం తెలుసుకున్నాడు.

జానీ అంతరాంతరాల్లో వున్న కోరిక ఏమిటి? ఎందుకతడు కావాలని మూర్తి చిరునామాను గోపాలరావు గారికి యిచ్చాడు? కావాలని తనమీద దాడికి సిద్ధపడుతున్నాడు?

జానీ, మూర్తి కలసి బయలుదేరుతున్న కారు బయలుదేరింది. డిటెక్టివ్ శరీఫ్ వచ్చిన దారినే తిరిగి వెళ్ళి కారులో కూర్చున్నాడు. వాచీ చూసుకున్నాడు. తెల్లటి తెరమీద చుక్క తిరిగి ప్రయాణం మొదలుపెట్టింది.

శరీఫ్ కారును రోడ్డుమీదకు మళ్ళించి చుక్కను వెంబడించసాగాడు.

పిట్స్‌బర్గ్ బొగ్గుగనులు రానురాను దగ్గరవుతున్నాయి. విశాలమైన ఆరుబయలులో ఎత్తయిన భవనాలు నిర్మించి వున్నాయి. బొగ్గు తీసుకు వెళ్ళడానికి ప్రత్యేకంగా మీటర్ గేజ్ రైల్వే లైను రోడ్డుకు సమాంతరంగా నిర్మించి వుంది. వుండి వుండి గూడ్సుబండి నలభై యాభై వేగన్‌లతో బొగ్గు తీసుకు వెళుతోంది.

తెల్లటి తెరమీద చుక్క ఆగింది. ఎత్తయిన భవ

నాలుకు యిళతల కారు ఆగి వుంది. ఆ కారులోంచి మూర్తి దిగాడు. కారు తీసుకుని జానీ వెళ్ళిపోయాడు. డిటెక్టివ్ శరీష్ కారును రోడ్డుకు బాగా ప్రక్కకుతీసి భవనాలవైపు నడక సాగించాడు. బొగ్గు గనుల్లో కార్మికుల కేకలు వినిపిస్తోన్నాయి.

మూర్తి లోపలకు వెళ్ళిన భవనం గుర్తుపెట్టుకున్నాడు. ఆ భవనంలో అడుగుపెట్టాడు. డిటెక్టివ్ శరీష్ చురుకుగా అటు నడిచాడు.

క్రేన్స్ పెద్ద పెద్ద బరువులను వాగన్స్‌లో దింపడం వలన శబ్దాలవుతున్నాయి. గోడవారనుండి కదిలాడు శరీష్. మూర్తిని ఎలా ఎదుర్కోవడం? అతడు జానీతో మాట్లాడినప్పుడు 'నేను భారతదేశం వెళ్ళేది లేదు కదా, ఎందుకు కంగారు పడతావు?" అన్నాడు. అంటే మూర్తికి స్వదేశం తిరిగి వెళ్ళిపోవాలని వుంది. ఇక్కడి పరిస్థితులు అతడిని తిరిగి వెళ్ళకుండా చేస్తున్నాయి. ఏమిటవి?

గోడపక్కనుండి స్తంభంవైపు జరిగాడు డిటెక్టివ్ శరీష్.

"చేతులెత్తి వుంచు మిష్టర్ శరీష్."

శరీష్ కనుబొమలు ముడిపడ్డాయి. యథాలాపంగా చేతులెత్తి వుంచాడు.

"నీకోసం హోటలుకు వెళ్ళారు నా మనుషులు. నువ్వు చాలాసేపటి క్రితంనుండి గదిలో లేవు. ఆ విషయం యిప్పుడే నాకు వైర్‌లెస్‌లో పంపారు. నువ్వు పిట్స్‌బర్గ్ వస్తావని తెలుసు నాకు! మూర్తిని భారతదేశం తీసుకు వెళ్ళాలన్న నీ వూహ కట్టిపెట్టు."

"జానీ! అతడికి భారతదేశం తిరిగి వెళ్ళిపోవాలని

వుంది. నువు అతడిని తీవ్రవాద కార్యకలాపాలలో యిరికించి వెళ్ళకుండా చేస్తున్నావు. కారణం తెలుసుకో వచ్చునా?"

జానీ నవ్వి, "ఆ కారణం నువు తెలుసుకుంటే భారత దేశం వెళ్ళలేవు. ఈ గనుల్లో ఎక్కడో సజీవ సమాధి అవుతావు!" అన్నాడు.

శరీఫ్ ఆలోచించదల్చుకోలేదు. జానీలాంటి ముసలివాడివద్ద పిస్తోలు వుండనీ, ఎటువంటి మారణాయుధం వుండనీ — అతడిని లొంగతీసుకోవడం పెద్ద సమస్య కాదు.

"చెప్పు. ఏం ఫరవాలేదు."

"శరీఫ్! నామాట అబద్ధం అనుకోవద్దు. నిజంగా నీ నిన్ను యిక్కడ చంపేస్తాం!"

శరీఫ్ మందహాసం చేశాడు. మా దేశంలో ఒక సామెత వుంది. మొరిగే కుక్క కరవదు! అని, ఆట్టే వాగక నువు మూర్తిని ఎందుకు స్వదేశం వెళ్ళనివ్వడం లేదో చెప్పు."

"మూర్తి ఇక్కడ నా చెల్లెలిని పెళ్ళి చేసుకున్నాడు."

"అదెలా సాధ్యం? అతడికోసం భారత దేశంలో ఎదురు తెన్నులు చూస్తున్న అతని భార్య వుంది. అతడికోసం ఎంతయినా ఖర్చు పెట్టగల మామగారు వున్నారు."

"ఆ ఆస్తి నాకు కావాలి. మూర్తి మొహమాట పడుతున్నాడు. గోపాలరావు యెప్పటికయినా తన ఆస్తి మొత్తంగానయినా నన్ను తీసుకోమని చెప్పి అల్లుడిని పంపించమని కోరతాడు. అందుకోసమే వెయిట్ చేస్తున్నాను. మధ్యలో నువు పానకంలో పుడకలాగా వచ్చావు."

"నీ మనసులో వున్న మాట గోపాలరావుగారికి రాయ వచ్చును కదా!"

జానీ పిస్తోలు గొట్టంతో అతడి మెడమీద పొడిచాడు. "ప్రస్తుతం ఆ ప్రయత్నంలోనే వున్నాను. నడువు....లోపలకు...." అన్నాడు.

శరీఫ్ మెల్లగా కదిలాడు.

"యూ త్రిని మీ దేశం చట్టం క్షమించదు. తీవ్రవాద చర్యలపట్ల మీ అధ్యక్షుడు ఆందోళన వెలిబుచ్చాడు. అతడితో నీ చెల్లెలు మాత్రం ఏం సుఖపడుతుంది?" అన్నాడు శరీఫ్.

జానీ మాట్లాడలేదు.

పిస్తోలు మాత్రం అతడి వెన్నులో గుచ్చి "పద!" అని అరిచాడు.

డిటెక్టివ్ శరీఫ్ ముందుకు మెల్లగా అడుగువేశాడు. గుమ్మం దగ్గరాతోంది. గుమ్మం ప్రక్కనే కిటికీ వుంది. చటుక్కున కిటికీ చువ్వలు పట్టుకున్నాడు. రెండు చేతులతో మొత్తం శక్తిని కేంద్రీకరించుకున్నాడు. శరీరం మొత్తం చేతుల శక్తిమీద వెనక్కి గాలిలో లేచి ఫెడీల్మని జానీను తన్నాడు.

జానీ యీ వెనుకవాటు దెబ్బ కాచుకోవడానికి సిద్ధంగా లేడు. ఆ దెబ్బ ఎక్కడ తగలాలో అక్కడే తగిలింది. జానీ మారుమాట లేకుండా నిశ్శబ్దంగా నేల మీదకు ఒరిగిపోయి స్పృహ తప్పి పడిపోయాడు. డిటెక్టివ్ శరీఫ్ చటుక్కున అతడి చేతిలోంచి పిస్తోలు తీసుకున్నాడు. అతడిని ఎవరు చూడని మారుమూల ప్రదేశానికి యీడ్చి జేబులోంచి నైలాన్ తాళ్ళుతీసి కాళ్ళకూ చేతులకూ బంధాలు వేశాడు. తర్వాత నోటికి ప్లాస్టర్

వేశాడు.

తరువాత చుట్టూ చూసుకుంటూ వెళ్ళి కారులో కూర్చున్నాడు శిరీష్. ఓపికగా మూర్తికోసం వేచి చూడ సాగాడు. గంట తర్వాత మూర్తి భవనంలోంచి యివతలకు వచ్చాడు. అటూ ఇటూ చూశాడు. తర్వాత తానూ జానీ కలసి వచ్చిన కారుకోసం చూశాడు.

రోడ్డుమీద శిరీష్ కారు కనిపించింది. శిరీష్ తన మొహాం కనిపించకుండా వెనక్కి తిరిగి కూర్చున్నాడు. బొగ్గుగనుల ప్రాంతం కావడంతో, దూరప్రదేశం కావడంతోనూ ప్రయివేట్ రవాణా సౌకర్యాలుండవు. మూర్తి అందుకే శిరీష్ కూర్చున్న కారువైపు వచ్చాడు.

"లిఫ్ట్ యిస్తారా మిస్టర్?" అన్నాడు మూర్తి.

అతడి మాట నోటిలోనే ఆగిపోయింది. డిటెక్టివ్ శిరీష్ అతడి నోటిలో పిస్తోలు గొట్టం వుంచి, "సేఫ్టీ కాచ్ తప్పించాను.... తెలుసా?" అన్నాడు.

మూర్తి కళ్ళు పెద్దవిచేశాడు. మాట్లాడబోయాడు. సాధ్యం కాలేదు.

"మూర్తీ! ట్రిక్స్ అనవసరం" శిరీష్ రెండో చేత్తో చటుక్కున చేతిలో సిద్ధంగా వుంచుకున్న సూదిని మూర్తి చేతిమీద బలంగా గుచ్చాడు. మూర్తి ప్రతిఘటించేలోపుగానే సూదిని చివర పూసిన ఘాటైన మత్తుమందు రక్తంలోకి రవాణా అయింది. మూర్తి మగతగా జోగాడు. వెనక్కుతూలి రోడ్డుమీదకు మెల్లగా ఒరిగిపోయాడు.

శిరీష్ అతడిని కారులోకి చేర్చాడు. అతడి కాళ్ళూ, చేతులూ నైలాన్ త్రాటితో బంధించి, నోటికి ప్లాస్టరంటించాడు. కారు వెనక్కి తిరిగింది. వచ్చిన దారినే

ప్రయాణం మొదలుపెట్టింది.

తీవ్రవాదుల స్థావరం దగ్గరవుతోంది. గాలి చల్లగా వీస్తోంది. డిటెక్టివ్ శరీఫ్ ఏమరుపాటు లేకుండా చుట్టు ప్రక్కలా, వెనక్కీ, స్థావరంచుట్టూ వున్న చెట్లలోకి చూడసాగాడు. అతడి నుదురు ముడతలు పడింది. పెదిమలు బిగుసుకున్నాయి.

చెట్ల చాటునుండి సాయుధులు ఒక్కరొక్కరు రోడ్డుకు అడ్డంగా వచ్చి నిలబడ్డారు. మొత్తం నలుగురు. వారిలో ఒకడు జపానీ.

'చంపుతావా! చస్తావా?' అన్నట్టు తీక్షణంగా కారు వైపే చూస్తున్నారు. సాయుధులకు సమాచారం ఎలా అందింది? మూర్తి తన దుస్తుల్లో మినీ ట్రాన్స్‌మీటర్ అమర్చుకుని బయలుదేరతాడా?

కారుదగ్గర పడుతూంటే వాళ్ళు మెషీన్‌గన్స్ కారుకు గురిపెట్టి వుంచారు. డిటెక్టివ్ శరీఫ్ చటుక్కున స్టీరింగ్ వీల్ మీద బూటుకాలుంచి వెనక సీటుమీద కూర్చుండి మూర్తిని అతికష్టంమీద ముందుకి లాక్కున్నాడు. మూర్తి సీటుమీద అడ్డదిడ్డంగా వాలిపోయి వున్నాడు.

మెషీన్‌గన్స్ ప్రేలుతున్నాయి. కారు యింజన్ భాగం మోత మోగిపోతోంది. డిటెక్టివ్ శరీఫ్ కారాపాడు. మూర్తి మొహాన్ని కిటికీలోంచి బయటికి కనబడేలాగ పట్టుకున్నాడు.

"డిక్కీలో జానీ వున్నాడు. జాగ్రత్త! పెట్రోలు టాంకు అంటుకునిమండే ఏర్పాటు చేశాను. నాతోబాటు జానీ, మూర్తీ ఇద్దరూ మాడి మసై పోతారు" అరిచాడు శరీఫ్.

సాయుధుల కాల్పులు ఆగలేదు. ఇంజన్ తుక్కు-

తుక్కుగా చెడిపోతోంది. మూర్తి శరీరం చాటునుండి పిస్తోలు వాళ్ళవైపు గురిపెట్టాడు శరీఫ్. మూర్తి శరీరాన్ని తప్పించి పిస్తోలును చకచక ప్రేల్చాడు.

బులెట్లు గురి తప్పలేదు. ముగ్గురు సాయుధులు రోడ్డు మీద పడిపోయారు. నాలుగోవాడు మెషీన్ గన్ ని గురి మార్చి శరీఫ్ వైపు కాల్చాడు. విండ్ స్క్రీన్ భళ్ళున పగిలిపోయింది.

శరీఫ్ తల వాల్చి పిస్తోలు ప్రేల్చాడు. నాలుగోవాడు తుళ్ళి రోడ్డుకు అవతలపడ్డాడు. అతడి చేతిలోని మెషీన్ గన్ ఎగిరి అవతలపడింది. అతడు విసురుగా లేవబోయాడు. సాధ్యపడలేదు. వెన్నెముకమీద పెద్ద దెబ్బ తగిలింది. డిటెక్టివ్ శరీఫ్ రెండు నిమిషాలు వ్యవధి పోనిచ్చి అతడిని సమీపించాడు.

అతడు కోపంగా చూస్తున్నాడు. జపాన్ దేశీయుడు.

"స్థావరంలో యెంతమంది వున్నారు?" అడిగాడు శరీఫ్.

అతడు మాట్లాడలేదు. డిటెక్టివ్ శరీఫ్ అతడిని యీడ్చిపెట్టి తన్నాడు. అతడి చెక్కిలి చిట్లి రెండు దంతాలూ రాలాయి. బాధను పండ్లబిగువున ఓర్చుకున్నాడు. శరీఫ్ మరల కాలెత్తాడు.

ఎవరూ లేరన్నట్లు అతడు సంజ్ఞ చేశాడు. డిటెక్టివ్ శరీఫ్ అతడిని కూడా కారులో కూర్చుండబెట్టాడు. తరువాత కారును రోడ్డు క్రిందకు దింపాడు. నేరుగా పాడుపడిన కోట ప్రక్కగా ఆగివున్న విమానం వద్దకు తీసుకుపోయాడు. ఇరవై మంది ప్రయాణించగల కారవెల్లీ విమానం!

జపనీ చెప్పినట్లు స్థావరం ఖాళీగా వుంది. డిటెక్టివ్

శరీఫ్ మెల్లగా మూర్తిని విమానంలోకి చేర్చాడు.

శరీఫ్ పైలట్ సీటులో కూర్చున్నాడు. విమానం రన్‌వేమీద పరుగెత్తుతోంది.

విమానం చిన్న కుదుపుతో గాలిలోకి లేచింది.

# 8

"అత్తయ్యా! అత్తయ్యా!" మాధవి మెయిన్ హాలులో నిలబడి అరుస్తోంది.

అనసూయ మెల్లగా పిట్టగోడకు వచ్చింది. కిందకు చూచింది.

"అత్తయ్యా! నాన్నగారు యింకా లేవలేదు. లోపలి వైపు గడియపెట్టి మరీ పడుకున్నారు" అంది మాధవి.

"అరరె! యింకా లేవలేదా? ఇంతసేపు యెన్నడూ నిద్రపోడు అన్నయ్య."

"అవును అత్తయ్యా!"

"రాత్రి నీతో ఏమీ చెప్పలేదా?"

"చెప్పారు ఉదయాన్నే భీమరాజు యింటికి వెళ్ళి అన్నారు. హత్య జరిగిన రోజు రాత్రి భీమరాజు ఇంటికి వచ్చిన స్త్రీని ఇరుగుపొరుగు ఎవరో చూశారట. పోలికలు అడగడానికి వెళ్తానన్నారు."

"ఇదెక్కడి చోద్యం మాధవీ! పోలీసులు పరిశోధిస్తారు కానీ....మన కెందుకొచ్చిన గోల!"

మాధవి మాట్లాడలేదు. మరల వెళ్ళి తండ్రి గది తలుపులు తట్టి వచ్చింది. అనసూయకూడా వెళ్ళి "అన్నయ్యా! అన్నయ్యా!" అని నిద్ర లేపాలని ప్రయత్నించింది.

"లాభం లేదమ్మా! తలుపులు తెరిపించాలి. అన్నయ్య యింత మత్తుగా ఎందుకు నిద్రపోతాడు?"

"అంటే..." మాధవి గొంతు వణికింది,

అనసూయ పనివాడిని పిలిచింది.

"ఎవరినయినా వడ్రంగిని తీసుకురా! అయ్యగారి గది తలుపు తెరిపించాలి!" అంది అనసూయ.

మాధవి పనివాడిని వారించి, "అత్తయ్యా! నాకేదో భయంగా వుంది. ఇన్‌స్పెక్టర్ కుమార్‌కి ఫోన్ చేద్దాం. ఎందుకయినా మంచిదికదా!" అంది.

అనసూయ అంగీకారంగా తలూపింది.

పావుగంటలో కుమార్ తన సిబ్బందితో దిగబడ్డాడు. బలవంతంగా తలుపులు తెరిపించాడు.

గోపాలరావుగారు మంచంమీద వెల్లకితలా పడుకున్నారు. కళ్ళు తెరచుకుని వున్నాయి. నోరు ఆవులించి వుంది. కాళ్ళూ చేతులూ నిట్రాటల్లాగా బిగుసుకుపోయి వున్నాయి.

మాధవి గొల్లున యేడవబోయింది. స్పృహ తప్పి తండ్రిమీద పడిపోయింది. అనసూయ ఏడుస్తోనే మేనకోడలిని ప్రక్కకు తప్పించి వేసింది. బయట సోఫాలో పడుకోబెట్టింది.

ఇన్‌స్పెక్టర్ కుమార్ తన సిబ్బందికి సూచనలిస్తున్నాడు. పోర్టికోలో టాక్సీ ఆగింది. డిటెక్టివ్ శిరీష్ మూర్తి చకచక అడుగులువేసుకుంటూ లోపలికి వచ్చారు.

సోఫామీద మాధవి నిద్రపోతోంది. మూర్తి ఆమె వద్ద కూర్చున్నాడు. డిటెక్టివ్ శిరీష్ లోపలకు నడిచాడు.

కుమార్ అతడిని కౌగలించుకున్నంత పనిచేసి, "సమయానికి వచ్చావు సోదరా! హత్య కేసులూ, చావులూ.. చస్తున్నాననుకో!" అన్నాడు.

అతడి భుజం తట్టాడు శిరీష్. గోపాలరావుగారి మొహంలోకి చూశాడు. కళ్ళు పత్తికాయల్లాగా తెరచు

కని వున్నాయి. ఎడమ కన్ను ఎర్రటి నెత్తురు గడ్డలాగా అయి క్రమంగా నిలబడినట్టుంది.

"ప్రాథమిక దర్యాప్తులో గోపాలరావుగారి గుండె ఆగి మరణించి వుండాలనిపిస్తోంది. సుఖమైన మరణం! గోపాలరావుగారికి గుండె జబ్బుకు సంబంధించి ఆయన కుటుంబ వైద్యుడిని సంప్రదించాలి" అన్నాడు పాథాలజీ సర్జన్.

"కన్ను నెత్తుటిగడ్డలాగా కావడం ఏమిటి? గుండె ఆగి మరణించినప్పుడు ఇలా కావడం ఎన్నడూ వినలేదు" అన్నాడు శిరీష్.

సర్జన్ తలూపి, "కంట్లో ప్రాణం పోకముందు క్షార పదార్థం పడివుండాలి. ఆ బాధ తట్టుకోవడానికి ప్రయత్నిస్తూంటేనే గోపాలరావుగారిలో గుండెపోటు రేగి వుండాలి" అన్నాడు. "కాని....ఆ బాధ కూడా కొన్ని క్షణాలపాటే!"

"ప్రాణంపోయి ఎంత సేపయి వుంటుంది?"

"రిగర్ మార్టిస్ ప్రారంభమయింది. 5–8 గంటల లోపు అంటే రాత్రి పదకొండు తర్వాత ఒంటిగంట కంటె ముందు ప్రాణంపోయి వుండాలి."

డిటెక్టివ్ శిరీష్ గదిని కలయ తిరిగాడు. గదిలో యెక్కడా విచిత్రంగా గానీ, అనుమానించదగిన వస్తువు గానీ కనిపించలేదు.

"ప్రాణం క్షణాలలో పోయింది కదూ సర్జన్ గారూ!" అడిగాడు శిరీష్.

"అవును. రోగి యెలాంటి హింసా పడకుండా నే ప్రాణంపోయింది."

"గుండెపోటు వచ్చిన వ్యక్తి అలా పోడు."

"కావచ్చు. గుండెపోటు తీవ్రతమీద అది ఆధారపడి వుంటుంది."

"నీ సందేహం ఏమిటి శిరీష్?" కలగజేసుకున్నాడు కుమార్.

"కంట్లో పడిన పదార్థం ఏమిటి? ప్రాణం పోవ డానికి అది ఎంతవరకూ కారణం? గుండెపోటు కారణమై వుండదేమో...."

"అది శవ పరీక్షలో నిర్ధారణ అవుతుంది. దానివల్లే ప్రాణంపోయి వుంటే....?"

"అది గోపాలరావుగారి గదిలోకి ఎలా వచ్చింది? కిటికీ మంచానికి దూరంగా వుంది. తలుపులు లోపలనుండి వేసివున్నాయి. ఎలా సాధ్యం?"

సర్జన్ చిరాకుగా చూచి, "మామూలు మరణం కేసుకు మీరు హత్య రంగు పూస్తున్నారేమో శిరీష్ గారూ!" అన్నాడు.

శిరీష్ మందహాసం చేసి, "నా అనుమానం తప్పు కావచ్చు. జపాన్ నుండి అతికష్టంమీద భారతదేశం విమానంలో వచ్చాం. మనసు యింకా కుదుటపడలేదు" అన్నాడు.

సర్జన్ మొహంలో విజయగర్వం ప్రతిఫలించింది. అప్పటికి ఫోటోగ్రాఫరూ, వ్రేలిముద్రల నిపుణుడూ తమ బాధ్యతలు ముగించుకున్నారు. గోపాలరావుగారి భౌతిక కాయాన్ని అంబులెన్స్‌లో చేర్పించాడు కుమార్.

కదులుతోన్న అంబులెన్స్‌వైపు నిర్లిప్తంగా చూశాడు మూర్తి.

"మూర్తిగారూ! మీ మామయ్యగారిని యెవరో తెలివిగా హత్యచేశారు. కంట్లో సైనెడ్—అది పొటా

షియం సైనైడ్ కావచ్చును. దాన్ని కంట్లో పడేలాగా చేసి ప్రాణాలు తీశారు."

మూర్తి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తరువాత అతడి పిడికిళ్ళు బిగుసుకున్నాయి. "శరీఫ్‌గారూ! గోపాలరావు గారు ఉత్తముడు. అలాంటివారిని పొట్టన పెట్టుకున్న వారిని వదలిపెట్టను" అన్నాడు.

శరీఫ్ అతడి భుజంతట్టి, "హంతకులను మీరు ఇక్కడ లేకపోవడం బాగా సహకరించింది. హత్యకు ప్రేరేపించింది కూడా మీ గైర్‌హాజరే! మీరు నిగ్రహంతో వ్యవహరించాలి" అన్నాడు.

"శరీఫ్‌గారూ! మీకు ప్రామిస్ చేస్తున్నాను. మాధవిని విడిచి ఇక ఎక్కడికీ వెళ్ళను. విప్లవం జోలికి అసలే వెళ్ళను" అన్నాడు మూర్తి సిన్సియర్‌గా.

# 9

డాట్సన్ కారును బయలుదేరతీశాడు. భీమరాజు యింటిముందు కారాపాడు.

భీమరాజు భార్య చిరాకుగా చూచి, "ఆయనపోయి నేను ఏడుస్తున్నాను. ఆయనను యింతవరకూ యెవరు గొంతు నులిమి పొట్టన పెట్టుకున్నారో కనిపెట్టలేకపోయారు, కాని ప్రశ్నలతో బతికివున్న నన్నుకూడా చావగొడుతున్నారు" అంది.

డిటెక్టివ్ శరీఫ్ ఓపికగా చూచి, "భీమరాజుగారు చనిపోయిన రాత్రి ఒక స్త్రీ మీ యింటికి వచ్చింది. కొత్త స్త్రీ కాదనీ, మీరే ఆ రాత్రి 9-30కీ 10 గంటలకూ మధ్యలో ఎక్కడికో వెళ్ళి తిరిగి వచ్చారనీ పోలీసుల పరిశోధనలో తేలింది. ఏమంటారు మీరు?" అన్నాడు.

భీమరాజు భార్యకు మొహం కళ తప్పింది.

"మీతో ఆ మాట ఎవరు చెప్పారు?"

"పోలీసులు. అం తే కా దు. ఇరుగు పొరుగువారు మిమ్మల్ని ఆ సమయంలో యింట్లోకి రావడం చూశారు. అవునా?"

భీమరాజు భార్య అరచేతులలో మొహం కప్పుకుంది. "నిజమే!" అంది.

"ఆ రాత్రివేళ మీరు ఎక్కడినుండి తిరిగివచ్చారు?" అన్నాడు శిరీష్.

"నా భర్తకోసం ఒక స్త్రీ యీ దగ్గరలో వున్న సిటీ బస్ స్టాప్‌లో వెయిట్ చేస్తున్నదని ఒక కుర్రవాడు తీసుకువచ్చిన చీటీవల్ల తెలుసుకున్నాను. అప్పుడు రాత్రి తొమ్మిదయింది. నేను ఒక్కతెనూ సిటీ బస్‌స్టాప్‌కి వెళ్ళి అక్కడ నిలబడ్డాను. నా భర్త యింట్లో తన గదిలోనే వున్నాడు. బస్సుకోసం వెయిట్ చేస్తున్న స్త్రీలు మాత్రమే ఒకరిద్దరు తమ బస్సులు రాగానే వెళ్ళిపోయారు. నేను తిరిగి వచ్చాను."

"మీ భర్త గదిలోకి వెళ్ళారా?"

"లేదు.. ఆయన అప్పటికే పూర్తి నిషాలో వుంటారు."

"మీ భర్త గదిలోనే వున్నట్టు నిర్ధారణ చేసుకున్నారు కదూ!"

"చేసుకున్నాను. ఆయన గదిలో మూలగా కూర్చుని వున్నారు.." ఆమె గొంతు బొంగురుపోయింది. "ఆయన అప్పటికే ప్రాణాలు పోయి ఆ స్థితిలో వున్నారని గ్రహించలేకపోయాను. పాపిష్ఠిదాన్ని."

"మీరు యిల్లు వదలిపెట్టి తిరిగివచ్చే లోపుగా ఎవరో యింట్లో ప్రవేశించి వుంటారు, అవునా?"

"అవునండి. ఇంటికి గొళ్ళెం పెట్టి వెళ్లాను. తిరిగివచ్చే టప్పటికి గొళ్ళెం అలాగే వుంది. ఎవరో ప్రవేశించి తిరిగి వెళ్ళిపోయి వుంటారని వూహించలేకపోయాను!"

"మీరు తిరిగివస్తూంటే దారిలో ఎవరయినా యెదురు వచ్చారా?"

"ఒక నడివయస్కురాలు కాబోలు..ఎదురువచ్చింది."

"ఆమెను మరల చూస్తే గుర్తుపట్టగలరా?"

"తలమీదనుండి పమిటకొంగు తిప్పుకుంది. స్పష్టంగా చూశానని చెప్పలేను."

"ఆమెను అంతకుముందుకూడా చూచి వుండరు. అవునా?"

"అదీ చెప్పలేను."

"ఆమె తప్ప దారిలో మీకెవ్వరూ కనిపించలేదా?"

"లేదు."

"మీరు దారిలో చూచిన ఆమె గురించి మరికాస్త వివరాలు చెప్పడానికి ప్రయత్నించండి. బహుశా ఆమె మీ యింట్లో ప్రవేశించడంకోసం మాత్రమే మిమ్మల్ని బస్‌స్టాప్‌కి పంపించడం జరిగింది."

భీమరాజు భార్య తెల్లబోయింది.

"ఒక్కసారి భీమరాజుగారి గది చూపిస్తారా?"

ఆమె తలూపి బయలేరింది. భీమరాజు గదిలోకి శిరీష్‌ను ప్రవేశపెట్టింది. శిరీష్ ఆ గదిని పరిశీలించాడు. ఆ గదికి రెండు గుమ్మాలున్నాయి. రెండో గుమ్మంలోంచి పెరట్లోకి వెళ్ళవచ్చును.

డిటెక్టివ్ శిరీష్ పెరట్లోకి నడిచాడు. పెరట్లోంచి సందులోకీ, అటునుంచి రోడ్డుమీదికీ వచ్చాడు.

భీమరాజు హత్య విషయంలో, గోపాలరావుగారి

హత్యవిషయంలో ఎవరున్నారు? అసలు గోపాలరావుగారి మరణం ఎవరికి లాభిస్తుంది?

డిటెక్టివ్ శిరీష్ చుట్టు తిరిగి కారువద్దకు వచ్చాడు. కారును గోపాలరావుగారింటి వద్దకు తోలాడు. మాధవి తన గదిలో ఏడుస్తూ కూర్చునివుంది.

డిటెక్టివ్ శిరీష్ ఆమెను వూరడించాడు.

"మూర్తిగారు లేరా?" అడిగాడు శిరీష్.

"ఎవరో స్నేహితులు ఆయనకు ఫోన్ చేసి రప్పించుకున్నారట."

"ఎక్కడికి?"

"ఎక్కడికో తెలియదు సార్! ఆయన వెళ్ళడం నాకే తెలియదు. పనివాడు చెప్పాడు."

శిరీష్ నుదురు చిట్లించాడు. మూర్తిని ఇల్లు కదలవద్దని తాను హెచ్చరించాడు. తీవ్రవాద ముఠాలోంచి ఒక వ్యక్తి బయటపడటం ఆ ముఠాలో వున్న జానీకు హితవుగా వుండదు. మూర్తిని భారతదేశం వరకూ వెంబడించుకు వచ్చినా ఆశ్చర్యంలేదు.

శిరీష్ తన ఆందోళనను తనలోనే యిముడ్చుకున్నాడు.

"నాన్నగారి గది ఒకసారి చూపించాలి మాధవిగారూ!"

మాధవి అతడిని తండ్రి గదిలోకి తీసుకువెళ్ళింది.

"మీ నాన్నగారు తన ఆస్తి మొత్తం తన తదనంతరం మీకే రాశారా, మాధవిగారూ!"

"మా మేనత్తకు కూడా కొంత ఆస్తి రాశారు."

"మీ మేనత్త యెటువంటిది? అంటే ఆస్తికోసం యెలాంటి అఘాయిత్యానికయినా సిద్ధపడే తరహా

మనిషా?"

"అటువంటిదో, కాదో చెప్పలేనుకొని,నన్ను మాత్రం తన కొడుకుకు ఇచ్చి పెళ్ళి చేసుకోవాలని ఉబలాట పడేది."

"ఆమె గది ఎక్కడ?"

ఆమె వ్రేలు పైకి చూపించి, "సరిగ్గా పై గదే! వెళ్దామా?" అంది.

డిటెక్టివ్ శరీఫ్ మొహంలో వెలుగు కనిపించింది. పైకి చూశాడు. గోపాలరావుగారు పడుకునే బెడ్ కి తలపైపుగా సీలింగ్ ఫాన్ వుంది.

"పై గదికి వెళ్దాం. అన్నట్టు మీ అత్తయ్య వుందా?"

"లేదు. తల్లీ కొడుకులు బయటికి వెళ్ళారు."

"రమేష్ ఎలాంటి వాడు?"

"అందితే జుత్తూ, అందకుంటే కాళ్ళూ పట్టుకునే రకం!"

"మాధవిగారూ! భీమరాజుకు మీ యింట్లో అందరి తోనూ పరిచయం వుందా?"

"వున్నదనే నా అనుమానం! కాని నిరూపించలేను."

"నిరూపణా! ఏ విషయంలో?"

"ఒకసారి మా అత్తయ్య, భీమరాజూ కలిసి ఒకే ఆటోలో వెళ్తున్నట్టు నా అనుమానం! ఆ వ్యక్తి భీమరాజు కాకపోయినా మరో మగాడు నూటికి అవును. నాన్నగారు మాత్రం నన్ను నమ్మలేదు."

"భీమరాజే అయివుండవచ్చునేమో!"

"నూటికి తొంభైతొమ్మిదిపాళ్ళు."

"గుడ్....చాల లింకులు విడిపోయాయి...."

అనసూయ గదిలో ప్రవేశించాడు డిటెక్టివ్ శరీఫ్.

నేలమీదకు చూశాడు. అతడి కళ్ళు గచ్చుమీద పరిశీలనగా వెతుకుతున్నాయి. క్రింద ప్రక్క ఫాన్ కొక్కెం తగిలించి వుండే ప్రదేశంలో చేతితో తడిమాడు. నున్నటి గచ్చుమధ్య గరుకు సిమెంటు తగిలింది.

డిటెక్టివ్ శరీన్ పాడవుపాటి చువ్వ సంపాదించి సిమెంటును దొలిచాడు. సీలింగులో పొడవుపాటి సన్నటి రంధ్రం ప్రత్యక్షమయింది. సన్నపాటి ట్వయిన్ దారాన్ని ఆ రంధ్రంలోకి జొనిపి ట్వయిన్ దారంమీద నీళ్ళ చుక్కలు పోశాడు.

మాధవి క్రింద గదిలో వెళ్ళి చూచింది. నీళ్ళచుక్క తలగడమీద పడింది.

"నాన్నగారి మొహంమీద ఈ రకంగా సోడియం సైనెడ్ వేసి హత్య చేసింది ఆ త్రయ్యా!" అరిచింది మాధవి.

"అవును. ఈ దారం మొహంవరకు సంపి ఖచ్చితంగా పెదిమలమధ్య సైనెడ్ ద్రవం పడేలాగా చేయాలనుకుంది. అయితే నాన్నగారు నిద్రలో అటు యిటు కదిలివుంటారు. అందుకే ద్రవం పెదిమల మధ్య కాకుండా ఆయన కనుకొలకుల్లో పడింది. మూసిన గదితలుపుల మధ్య పకడ్బందీగా హత్య సృష్టించగలిగింది."

మాధవి ఏడుస్తోంది.

అప్పుడే పోర్టికోలో ఆటోరిక్షా ఆగిన చప్పుడయింది. డిటెక్టివ్ శరీన్ చెవులొరగా పెట్టి వినసాగాడు. ఆటో తిరిగి బయలుదేరింది. ఆటో దిగిన వాళ్ళెవరూ లోపలకు రాలేదు.

డిటెక్టివ్ శరీన్ చటుక్కున మెట్లు దిగి బయటకు పరుగెత్తాడు. ఆటో రోడ్డుమీద చాల దూరం పోయింది. డాట్సన్ కారులో డిటెక్టివ్ దాన్ని వెంబడించాడు.

# 10

ఆటో శ్రీనివాసా లాడ్జిముందు ఆగింది.

రమేష్ ఆటోలోంచి దూకి లాడ్జిలోకి పరుగెత్తాడు. డిటెక్టివ్ శరీష్ కారాసి దిగాడు. కౌంటర్ దాటి నడవలోకి పరుగెత్తాడు. మలుపులో అడుగుల చప్పుడు వినిపిస్తోంది. మలుపు తిరగబోయాడు డిటెక్టివ్.

ఫట్ మంది.

డిటెక్టివ్ తల పట్టుకొని అలాగే కూలబడిపోయాడు. తలలో వేలాది సూదులు దింపుతున్నట్టుగా బాధాకరమైన అనుభూతికి లోనయ్యాడు. అలాగే అతికష్టంమీద కళ్ళు తెరచి చూడసాగాడు.

నడవాలో అనసూయ నిలబడివుంది. ఆమె చేతిలో ఇనుపరాడ్ వుంది. మూర్తి ఆమె ప్రక్క నిలబడి వున్నాడు. అతడి చేతులు విరచి కట్టి వున్నాయి.

రమేష్ ఉత్సాహంగా డిటెక్టివ్‌ను సమీపించి ప్రక్కనే వున్న గదిలోకి యీడ్చాడు. తరువాత మూర్తిని అటు నడిపించాడు.

"అనసూయా! భీమరాజు నెందుకు చంపావు?" అడిగాడు డిటెక్టివ్.

రమేష్ తలుపు మూశాడు.

అనసూయ పిశాచంలాగా నవ్వింది. నోరు విప్పబోయి ఆగింది. కిటికీ రెక్క భళ్ళున తెరచుకుంది. డిటెక్టివ్ అటు చూశాడు.

జానీ! అతడి చేతిలో పిస్తోలు మిలమిలలాడింది.

"మూర్తీ!" అరిచాడు జానీ.

డిటెక్టివ్ నిర్ఘాంతపోయాడు. తీవ్రవాదంలో ఉన్న తమకంతోనో, గోపాలరావుగారి ఆస్తిమీద కన్నువేసో,

జానీ ఆరువేల మైళ్ళపాటు తననూ, మూర్తినీ వెంబడించుకు వచ్చాడు.

"మూర్తీ! నువు నన్ను వెన్నుపోటు పొడిచావు. నిన్నూ, నన్ను యింతదూరం వెనక్కు తీసుకు వచ్చిన డిటెక్టివ్‌ను వదిలిపెట్టను" ట్రిగ్గర్ నొక్కాడు జానీ.

మూర్తికి మోకాళ్ళ వెనుక ఎవరో తన్నినట్టయింది. కట్టె విరిగి పడ్డట్టుగా వెనక్కి పడ్డాడు. అతడిని భద్రంగా చేతులు అడ్డు పెట్టి పెట్టున్నాడు డిటెక్టివ్.

అనసూయ 'కెవ్వు'న అరచింది. బులెట్ ఆమె ఛాతీలో దిగబడింది. ఆమె నేలమీదకు దబ్బున పడింది. ఇనుపరాడ్ ఖంగున శబ్దంచేసి డిటెక్టివ్ వైపు దొర్లింది. రమేష్ తల్లిమీదపడి రోదించ సాగాడు.

జానీ తిరిగి పిస్తోలు ప్రేల్చాడు. బులెట్ గచ్చుమీద తగిలి ఖంగుమని పైకి రిఫ్లెక్టు అయి సీలింగులో ప్రవేశించింది. డిటెక్టివ్ యినపరాడ్ అందుకున్నాడు. జానీ వైపు దాన్ని విసిరాడు. రాడ్ కిటికీ చువ్వకు బలంగా తగిలింది. జానీ అది తనను తాకుతోందని భ్రమించాడు. చెయ్యి చటుక్కున లాక్కున్నాడు. పిస్తోలు లోపలి ప్రక్కకు జారిపోయింది.

, జానీ పిస్తోలు అందుకోబోయాడు డిటెక్టివ్ ఒక్క వుదుకులో కిటికీని సమీపించి అతడి చెయ్యి దొరకబుచ్చుకున్నాడు. బలంగా ముందుకు లాగిపెట్టి జుత్తు అందుకున్నాడు.

తలలో నూదులు దబ్బనాల్లాగా అయి మరీ పోటు పెడుతున్నాయి. అయినా జానీ జుత్తును పట్టుకుని కిటికీ చువ్వలకు శక్తికొద్దీ తాకించి కొడుతున్నాడు. జానీ కాళ్ళు గిలగిలలాడి గచ్చుమీద జారిపోతున్నాయి.

అయినా, డిటెక్టివ్ జాలి చూపించదల్చుకోలేదు.

గది తలుపులు ఎవరో కొడుతున్నారు. రమేష్ తలుపు తెరిచాడు. పోలీసులు లోపలకు వచ్చారు.

జానీ నిస్త్రాణగా కిటికీకి చేరగిల పడిపోయాడు.

ఇన్‌స్పెక్టర్ కుమార్ వంగి అనసూయ నాడి పట్టుకున్నాడు.

* * *

"భీమరాజు నన్ను చేరదీశాడు. నాలో యింకా తీరని కోరికలకు అతడు ఆజ్యం పోశాడు. మధ్యలో ఏమనుకున్నాడో మాధవి గురించి నన్ను ప్రశ్నలు వేసేవాడు. క్రమంగా ఆమెమీద మోజు పెంచుకోసాగాడు. గోపాలరావు అన్నయ్య అతడితో క్లబ్బులో ఘర్షణ పడ్డాడు. నేను భీమరాజును వదిలించుకుంటే నేగాని మాధవికి నా కొడుకును భర్తగా చేయలేను. గోపాలరావన్నయ్య అతడితో ఆ రాత్రి నా గురించి భీమరాజును అడిగి మా రహస్య జీవితం గురించి తెలుసుకుంటాడని గ్రహించాను. నేను నా కొడుకుతో కలసి భీమరాజును చంపి యింటి తలుపులు తెరచి తిరిగి వచ్చేశాం.

సోడియం సైనెడ్ సంపాదించి అన్నయ్యను చంపేశాం. మాధవి భర్త ఇక రాడనీ, మాధవి ఒంటరిగా తై అయి రమేష్‌ను వరించక తప్పదని నేనే అన్నయ్యను హత్య చేశాను" అంది అనసూయ.

ఇన్‌స్పెక్టర్ కుమార్, ఆమెనుండి మరణ వాఙ్మూలం తీసుకున్నాడు.

రమేష్ తన కథనంలో ఒక విషయం చెప్పాడు.

అతడు అంతకు క్రితం వారమే 'థండర్ బాల్' చిత్రం చూశాడు. జేమ్స్‌బాండ్‌ను పై అటకమీదనుం-

దారంద్వారా విషంపంపి చంపాలని ప్రయత్నించుతారు. ఆ పథకం మేనమామమీద ప్రయోగించాలనిపించింది రమేష్‌కి. తల్లికి హత్యా పథకం చెప్పాడు.

"మీ ఫీజు చెల్లిస్తాను" అన్నది మాధవి.

డిటెక్టివ్ శిరీష్ ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"మీ యిద్దరూ ఏ ఒడిదుడుకులు లేకుండా సుఖంగా సంసారం చేయండి" అన్నాడు శిరీష్ ఆమె భర్తను ఓరకంట చూచి.

—:అయిపోయింది:—

సీరియల్

# అగ్ని ప్రస్థానం

## ప్రతాప రవిశంకర్

(గత సంచిక తరువాయి)

"ఆల్ రైట్.... జరిగిందేదో జరిగిపోయింది. ఇక ఆ విషయాన్ని వదిలెయ్యి."

స్టెల్లా ఇక మాట్లాడలేదు.

తొందరగానే కస్టమ్స్ చెకింగ్ పూర్తి చేసుకుని అక్కడినించి బయటపడి లాండయి వున్న ప్లేన్ దగ్గరకు వెళ్ళారు.

రెండు నిమిషాల్లో ప్లేన్‌లో ఎక్కారు.

అప్పటికే చాలావరకు నిండిపోయి వుంది. ఇంకో పది సీట్లు మాత్రమే ఖాళీగా వున్నాయి.

ప్లేన్ బయల్దేరటానికి ఇంకో పదినిమిషాల సమయం వుంది.

సిగరెట్ వెలిగించాడు భారత్.

స్టెల్లా కూడా ఓ సిగరెట్టు ముట్టించింది.

అతని మవునాన్ని ఆమె భంగపరచదల్చుకోలేదు.

అతనో సెంటిమెంటల్ ఇండియన్ అని ఆమె మనసులోనే నవ్వుకుంది.

చిన్నతనంనించీ స్టెల్లా విచ్చలవిడిగానే పెరిగింది. చిన్నతనంలోనే ఆమె తల్లిదండ్రులు అమెరికానించి వచ్చి కంపూచియాలో స్థిరపడిపోయారు. ఒక్కతే కూతురు కావటంతో ఆమె గారాబంగా అలా పెరిగింది.

రెండేళ్ళ క్రితం ఓ ప్లేన్ యాక్సిడెంట్లో స్టెల్లా తల్లిదండ్రులిద్దరూ పోయారు.

అప్పుడే స్టెల్లా ఒంటరిదై పోయింది.

మరికొన్ని నిమిషాల్లో ప్లేన్ బయల్దేరబోతున్నట్టు ఎనౌన్స్ చేశారు.

ప్లేన్ పూర్తిగా నిండిపోయింది.

కొన్ని క్షణాల తర్వాత ప్లేన్ కదిలింది. ముందుకు పరుగుతీసి గాల్లోకి లేచింది.

"గుడ్ బై టు కంపూచియా" అన్నది స్టెల్లా.

* * *

"ఇంకా నువ్వు ఆ డర్టీ డెవిల్ ఆలోచనలనించి బయటపడలేదా?" అడిగింది.

తలవూపి "ఓ మంచి మనిషిని హత్యచెయ్యటం ఎంత కాదనుకున్నా నాకు బాధనే కలిగిస్తోంది" అన్నాడు.

"మీ ఇండియన్స్ అంతా ఇంతేనా?"

"అంటే?"

"నీలాగే ఓ హత్యచేసి వణికిపోతూ బాధపడే మనుషులేనా?"

"చాలావరకు అంతే కావచ్చు."

నవ్వింది స్టెల్లా.

"అవునులే.... ఇండియా శాంతికాముక దేశం కదూ?" అన్నది తర్వాత.

"కెరోన్‌ను మనం హత్య చెయ్యక తప్పదు. దాన్ని చంపకూడా వున్నట్లయితే ఆమె మనల్ని రొనాల్ట్ ఎపార్టుమెంట్స్‌లో నించి బయటకు కూడా రానిచ్చి వుండేదికాదు" చిన్నగా అన్నది అతనికే వినపడేలా.

"నిజమే....నువ్వు కనపడకుండా వుంటే బావుండేది. నేనొక్కడినే వినట్లయితే ఎలాగో ఆమెను కన్విన్స్ చేసే వాడిని. మనిద్దరం ఏర్‌పోర్టు దగ్గర కలుసుకునేవాళ్ళం."

"నో....ఎన్నటికీ అలా జరిగివుండేది కాదు. కేరోన్ అంత సులభంగా నిన్ను వదిలిపెట్టేది కాదు! చివరకి ఆదే ఈ స్థానంలో నీ పక్కనే కూర్చునేది."

భారత్ తిరిగి మౌనం వహించాడు.

మూడునెలల క్రితం అతను కంపూచియా వచ్చాడు. అంతకుముందు కూడా అతను యెన్నోసార్లు అక్కడకు వచ్చాడు భారతదేశంనించి. మిగిలిన దేశాల్లో కంటే అక్కడ మేలురకం వజ్రాలు దొరుకుతాయని అతని నమ్మకం.

ఓసారి ఓ బిజినెస్ ఏజెన్సీలో కెరోన్‌తో పరిచయ మయ్యింది. అతని అందం చూసి కెరోన్ పరవశించి పోయింది. అప్పటికప్పుడే అతనికి తన హృదయాన్ని ఇచ్చేసింది. ఆ విషయాన్ని తెలుసుకున్న భారత్ ఆమె అందంతో ఆటలాడుకున్నాడు. ఆమె యవ్వనాన్ని కొల్ల కొట్టాడు.

బిజినెస్ పరంగా కూడా కెరోన్‌తో తన పనులు ఎన్నో నెరవేర్చుకున్నాడు.

ఆ తర్వాతనే అతనికి ఓ ఎగ్జిబిషన్‌లో స్టెల్లాతో పరి

చయం జరిగింది. స్టెల్లా కెరోన్‌కంటే ఎన్నో రెట్లు అందమైన యువతి కావటంతో భారత్‌కి కెరోన్ మీద ఇంట్రెస్టు బాగానే తగ్గిపోయింది.

స్టెల్లా కూడా అతనితో ఇండియాకు వస్తానన్నది. సంతోషంగా ఒప్పుకున్నాడు భారత్.

అక్కడక్కడ ఒకరిద్దరు మాట్లాడుకుంటున్నా చాలా మంది ప్రయాణీకులు మౌనం వహించారు.

స్టెల్లా ఒకటి రెండుసార్లు భారత్‌తో మాట్లాడాలని అనుకున్నది. కాని అతన్ని చూసిన తర్వాత ఆ ప్రయత్నం చెయ్యలేదు.

ఆమెకూడా ఆలోచనల్లోనే మునిగిపోయింది.

తన తల్లిదండ్రులు అప్పుడప్పుడు ఇండియా గురించి గొప్పగా చెబుతూ వుండేవాళ్ళు.... భారతీయుల గురించి భారత స్త్రీల అందచందాల గురించి వింటూ వుండేది. భారతీయుల నాగరికత, వాళ్ళ స్నేహస్వభావం గురించి కొన్ని నవలల్లో కూడా చదివింది.

అప్పుడే స్టెల్లా ఎప్పటికైనా తను ఇండియా వెళ్ళి అక్కడ కొన్ని రోజులు గడపాలని యెంతో గాఢంగా అనుకున్నది.

అందుకే మొదటిసారిగా—కంపూచియాలో జరుగుతున్న ట్రేడ్ ఎగ్జిబిషన్‌లో భారత్‌ను కలుసుకున్నప్పుడు ఆమె హృదయం సంతోషంతో ఎగిరిపడింది.

ఒకరి అందం ఒకరిని అమితంగా ఆకర్షించటం వల్ల కొన్ని నిమిషాల్లోనే ఇద్దరూ గొప్ప ప్రేమికుల్లా మారిపోయారు.

భారత్ రూపం ఆమెలో చెరగని ముద్రవేసింది.

"స్టెల్లా" చిన్నగా పిల్చాడు భారత్.

"ఏమిటికి?" అతనివైపు తిరిగింది.

"ఆలోచిస్తున్నావు ఎవరి గురించి?"

"నీ గురించే."

"నీకు మరో పని లేదా నా గురించి ఆలోచించటం తప్పించి."

"లేదు. నేను నీకోసమే బతుకుతున్నాను. ఐయామ్ బ్రీదింగ్ ఓన్లీ ఫర్ యూ."

"థాంక్ యూ" సున్నితంగా ఆమె చేతిమీద ముద్దు పెట్టుకున్నాడు.

"నాకు భయంగా వుంది భారత్."

"ఎందుకు?"

"ఇండియా వెళ్ళిన తర్వాత అక్కడి అందగత్తెల వలలో చిక్కి నన్ను మరచిపోవు కదా."

"యూ సిల్లీ .... ఈ భారత్ ఎప్పటికీ నీ మనిషే. అలాంటి భయాన్ని నీలోనించి దూరంగా తరిమివెయ్యి స్టెల్లా."

"ఐయామ్ డామ్ లక్కీ భారత్."

* * *

ప్లేన్ ఆకాశంలో దూసుకు వెళుతోంది.

నిమిషాలు—గంటలు గడుస్తున్నాయి.

ఉన్నట్టుండి ఏదో గొడవ వినిపించింది.

స్టెల్లా మాట్లాడబోయి ఆగిపోయింది.

వెనక్కి తిరిగి చూశారు.

ఎవరో ఇద్దరు—బల్గేరియా దేశస్థుల్లా వున్నారు.... ఒకరిమీద ఒకరు కలియబడుతున్నారు.

"ఐ విల్ డ్రింక్ యువర్ బ్లడ్" ఒక వ్యక్తి అంటున్నాడు. అతనికి నలభై యేళ్ళలోపు వుంటాయి.

కొంచెం సన్నగా వున్నాడు.

"యూ ఇడియట్" రెండో మనిషి అతనిమీదకు వచ్చాడు.

అసలు ఏం జరిగిందో ఎందుకు వాళ్ళిద్దరూ అలా తిట్టుకుంటున్నారో ఎవ్వరికీ అర్థంకాలేదు.

"వాట్ హేపెండ్?" ఓ ముసలాయన స్టెల్లాను అడిగాడు.

"ఐ డోంట్ నో."

వాళ్ళు తిట్టుకుంటున్నారు. అప్పుడే కునుకు తియ్యబోతున్న కొంతమంది విసుక్కుంటున్నారు.

"వాటీజ్ దిస్ న్యూసెన్స్" అన్నాడా ముసలాయన.

ఆయన పక్కనే కూర్చున్న యువతి లేచి నిల్చుని టాయ్‌లెట్ రూమ్ కేసి నడిచింది

ఆ యువతి అందం చాలామందిని ఆకర్షించింది.

మెరుపు తీగెలా వుంది.

భారత్ కూడా ఆమె కనిపించినంతవరకు చూశాడు. అప్పటివరకు ఆమెను గమనించనందుకు బాధపడ్డాడు.

"భారత్....ఆమె నాకంటే అందంగా వున్నదా?"

అతను నవ్వి "లేదు. ఆమె నీకంటే అందంగా లేదు. నీ అంత అందంగా వున్నది" అన్నాడు.

"ఏమైనా ప్లేన్‌లో చాలామంది మగాళ్ళ దృష్టిని ఆకర్షించింది."

"అవును."

"నీ దృష్టిని కూడా."

"నేనూ మగాడ్నే కదూ."

వాళ్ళలా మాట్లాడుకుంటూ వున్నప్పుడే ఆ ఇద్దరి గొడవా తారస్థాయి నందుకుంది.

అందులో ఒకడు జేబులోనించి పిస్తోలు బయటకు తీశాడు.

ప్రయాణీకులు భయపడ్డారు.

ఇంతలో టాయ్‌లెట్ రూమ్‌లోకి వెళ్ళిన ఆ అందాల సుందరి అప్పుడే బయటకు వచ్చింది.

సరిగ్గా అదే సమయంలో ఏర్ హోస్టెస్ ఆ మనుషుల మధ్యకు వచ్చింది.

ఒకే ఒక్క నిమిషం.

కెవ్వుమన్న అరుపు.

ఏం జరుగుతుందో తెలుసుకునే లోపుగానే అందాల సుందరిని ఓ నల్లగా కర్కశంగా వున్న మనిషి తన సీట్లో నించి చివాలున లేచినిల్చుని వెనుకనించి ఆమె నడుం చుట్టూ చెయ్యివేసి గట్టిగా బిగించాడు.

అప్పుడా యువతి కెవ్వున అరిచింది.

వెంటనే క్షణంలో నల్లగా నిగనిగలాడుతున్న పిస్తోలు ప్రత్యక్షమయ్యింది అతని చేతిలో.

అదే క్షణాల్లో—

గొడవపడుతున్న యిద్దరిలో ముందుగా పిస్తోలు బయటకు తీసిన మనిషి ఏర్ హోస్టెస్‌ను కూడా వెనుకనించి గట్టిగా పట్టుకుని "ఎవ్వరూ· కదలకండి" అని ఓ ఆజ్ఞ జారీచేశాడు.

అందాల సుందరి — ఏర్ హోస్టెస్ ప్రాణభయంతో గిలగిల్లాడిపోయారు.

ప్రయాణీకుల మధ్య అప్పటివరకూ ఏదో ఇంగ్లీష్ మేగజైన్ చదువుకుంటున్నట్టు నటిస్తున్న ఓ పొట్టిగా వున్న బట్టతల మనిషికూడా ప్యాంటు జేబులోనించి పిస్తోలు బయటకుతీసి యెవ్వరికీ కనపడకుండా పట్టు

కున్నాడు.

"జాగ్రత్తగా వినండి.... మేము విమాన దొంగలం. మిమ్మల్ని దోపిడీ చెయ్యటమే మా ధ్యేయం. దయచేసి మీరు మాతో సహకరించి మీ దగ్గర వున్న విలువైన వస్తువులను మాకు వెంటనే యిచ్చేస్తే మా పని పూర్తి అవగానే ఈ ప్లేన్‌ను ఎక్కడో ఒకచోట ఆపుచేయించి మేము వెళ్ళిపోతాం. ఎవరైనా ప్రతిఘటించినా, ఎదురు తిరిగే ప్రయత్నం చేసినా ముందుగా ఈ అందాలసుందరి ఏర్ హోస్టెస్ ప్రాణాలను పోగొట్టుకుంటారు. ఆ తర్వాత వరుసగా మా దగ్గర వున్న పిస్తోళ్ళ గుండ్లకు బలి చేస్తాం."

ఆ హెచ్చరిక వినగానే అందరికీ ప్రాణాలు ఎగిరి పోయినట్లు అనిపించాయి.

ఊహించని పరిణామం.

వాళ్ళిద్దరూ దొంగలే. ఒకరికొకరు గొడవపడి తిట్టు కుంటున్నట్టు నటించి అందరి దృష్టినీ ఆ వైపుకు మర లించి ఆ అందాల సుందరిని పట్టుకున్నారు.

ఇప్పుడేమిటి చెయ్యటం?

వాళ్ళు అడిగినట్టుగా విలువైన వస్తువులన్నింటినీ ఆ నలుగురు దొంగలకీ ఇచ్చెయ్యటమేనా?

"భారత్."

చిన్నగా పిల్చింది స్టెల్లా.

"ఊ."

"వజ్రాలు."

"ష్. అరవకు ప్రమాదం."

చిన్నగానే కసురుకున్నాడు భారత్.

అతని ఆలోచనలన్నీ ఆ వజ్రాల గురించే వున్నాయి.

లక్షలు విలువచేసే వజ్రాలు తన దగ్గర వున్నాయి. వాటిని ఆ విమాన దొంగల బారిన పడకుండా దాచటం సాధ్యమవుతుందా? వాళ్ళకు అనుమానం వచ్చిందంటే మనిషిని ముక్కలు ముక్కలుగా కోసి అంగుళం అంగుళం వెతుకుతారు.

అలాంటి దొంగల గురించి ఇంతకుముందు తను ఎన్నో సార్లు విన్నాడు.

కాని—

వాళ్ళను ప్రత్యక్షంగా కలుసుకోవటం ఇప్పుడే.

ఆలోచిస్తున్నాడు.

సెల్లా ఆలోచిస్తోంది.

ప్రయాణీకు లందరూ ఆలోచిస్తున్నారు.

దొంగలు కూడా ఆలోచిస్తున్నారు.

"షాంకీల్" అందాల సుందరిని పట్టుకున్న దొంగ కంఠం ఖంగుమన్నది.

అప్పటివరకూ మేగజైన్ చాటున పిస్తోలు పట్టుకుని కూర్చున్న పొట్టిమనిషి చివాలున లేచి నిల్చున్నాడు.

"స్టార్టు యువర్ వర్క్" అర్చాడతను.

వెంటనే దోపిడీ మొదలయ్యింది.

షాంకీల్ పెద్ద సూట్కేసు తీసుకున్నాడు.

ఒక్కొక్కరి దగ్గరికీ వెళుతున్నాడు.

ఈ లోపుగా మరోసారి అందరికీ హెచ్చరిక విన పడింది.

"దయచేసి యెవ్వరూ ప్రాణాలు పోగొట్టుకోకండి. ప్రాణాలు తీయటం మాకు సరదా. వినా మీరు బుద్ధిగా ప్రవర్తిస్తే మీ ప్రాణాలకు ప్రమాదంలేదని మీకు హామీ ఇస్తున్నాము."

ఆ హెచ్చరిక చేసిన మనిషి అందాల సుందరిని మరింత గట్టిగా నొక్కాడు.

ఆమె కెవ్వుమన్నది మరోసారి.

పెద్దగా నవ్వాడతను.

నలుగుర్లో ఒకడు కేబిన్ రూమ్‌లోనించి యెవ్వరూ బయటకు రాకుండా పిస్తోలుతో కాపలా కాస్తున్నాడు. ఓ యాభై యేళ్ళు దాటుతున్న స్త్రీ దగ్గరకు వచ్చాడు షాంకీల్.

ఆమె వేలికి వజ్రపు ఉంగరం వుంది.

"ఊ....ఇవ్వు" పిస్తోలు వూపుతూ హుంకరించాడు అతను.

"నో. ఐ వోంట్ గివ్ దిస్ డైమండ్ రింగ్. దిస్ వాజ్ ప్రెజెంటెడ్ బై మై హజ్బెండ్. బిసైడ్ మై లైఫ్ ...నో... నో" పెద్దగా యేడ్చింది ఆమె.

అంతా చూస్తున్నారు.

ఆ దృశ్యం చూస్తుంటే చాలామంది కళ్ళల్లో నీళ్ళు వచ్చాయి.

"వాటీజ్ దట్ నాన్సెన్స్."

షాంకీల్ పిస్తోలును ఆమె కణతలకు నొక్కి పెట్టి "యూ ఓల్డ్ బగ్. ముందు ఆ ఉంగరం తీసివ్వు. లేకపోతే నువ్వూ నీ మొగుడి దగ్గరకు వెళతావ్" కర్కశంగా అన్నాడు పళ్ళు బిగబట్టి.

"ఇవ్వను. ఇవ్వను" పెద్దగా అరవబోయిందామె.

అంతే.

షాంకీల్ పిస్తోలు వెనక్కు తిప్పి ఆమె తలమీద గట్టిగా కొట్టాడు.

చిన్నగా మూల్గి తల వాల్చింది ఆమె.

ఆమె వేలికి వున్న డైమండ్ రింగ్‌ను బలవంతంగా లాగేశాడు.

ఇదంతా చూస్తూ మిగిలిన ప్రయాణీకులందరూ గజగజ వణికిపోయారు. షాంకీల్ ఒక్కొక్కరి దగ్గరకూ వస్తుంటే అంత ముందుగానే వాళ్ళ దగ్గర వున్న విలువైన వాటన్నింటినీ బయటకుతీసి రెడీగా వుంచుకున్నారు

భారత్ మెదడులో ఆలోచనలు విమాన వేగంతో ప్రయాణిస్తున్నాయి.

ప్రయాణీకుల దృష్టి అంతా షాంకీల్ మీదా ఏర్ హోస్టెస్‌ను పట్టుకున్న మనిషిమీదా నిమగ్నమై వుంది. వాళ్లెవ్వరూ అందాల సుందరినీ, ఆమెను పట్టుకున్న మనిషినీ గమనించలేదు.

కాని—స్టెల్లా ఎందుకో ఆ యువతిని చూసి ఉలిక్కిపడింది.

అతను ఆ యువతిమీదకు తలవాల్చి చిన్నగా ఏదో అంటున్నాడు. ఆమె నడుంమీద చేతితో నిమురుతున్నాడు.

ఆమె నవ్వుతోంది.

చిన్నగా యేదో గొణుగుతోంది.

"భారత్" పిల్చింది స్టెల్లా.

"వూఁ...."

"ఆ బ్యూటీని చూడు" చిన్నగా అన్నది.

"చూస్తున్నాను. ఆమెకూడా ఈ దొంగల ముఠాలో మనిషే. అంతా నాటకం."

"ఐతే ఏర్ హోస్టెస్ కూడా ఇందులో మనిషేనా?"

"ఏమో.... ఐవుండొచ్చు."

విమానం గాల్లో దూసుకుపోతోంది.

లోపల ఇంత దోపిడీ జరుగుతున్నా కేబిన్ రూంలో వున్న మనుషులకు కొంచెంకూడా తెలీదు.

సముద్రంమీద ఎగురుతోంది విమానం.

షాంకీల్ — భారత్ దగ్గరకు వస్తున్నాడు.

మధ్యలో ఇంకో ఇద్దరు వున్నారు.

ఓ ముసలాయన అయనే స్టెల్లాను 'ఏమిటా గొడవ' అని అడిగినాయన.

ఆయన షాంకీల్ తన దగ్గరకు రావటంతోనే "టేక్ దిస్.... టేక్ దిస్" అంటూ తన దగ్గరవున్న రెండు బంగారు వుంగరాలు, ఇంకొంత కరెన్సీ ఇచ్చేశాడు.

తర్వాత మరో మనిషి.

ఆ మనిషి వంతుకూడా ఐపోతే ఇక మిగిలింది భారత్.

అతని గుండెలు అదురుతున్నాయి.

ఎంతో కష్టపడి సేకరించిన విలువైన వజ్రాలు. అంతే కాదు. చివరి క్షణాల్లో — కెరోన్‌ను హత్యచేసి ఆమె సూట్కేసులో వున్న గోల్డు కాయిన్స్, వజ్రాలుకూడా ఇప్పుడు ఈ విమాన దొంగలు, హైజాకర్స్ దోపిడీకి గురి కాబడుతున్నాయా?

ఆలోచిస్తుంటే మెదడు పేలిపోతున్నట్టు అనిపించింది.

ఇప్పుడేమిటి చెయ్యటం?

తనదగ్గర పిస్తోలు వుంది.

దాంతో ఆ దొంగలను ప్రతిఘటిస్తే?

సాధ్యమేనా? తను వాళ్ళను ఎదిరించగలడా?

తనకు తోడుగా స్టెల్లా వుంది.

స్టెల్లా!

అవును. స్టెల్లా సాధారణమైన ఆడదికాదు.

ఆడపులి.

తెగువ—చొరవ ఉన్న మనిషి.

గురితప్పకుండా పిస్తోలు పేల్చగలదు.

ఐనా—స్టెల్లా ఏమని ఆలోచిస్తోంది? ఇలాంటి పరిస్థితుల్లో స్టెల్లావంటి ధైర్యం — తెగువ వున్న ఆడది చూస్తూ వూరుకోదు. ఆమెకు తెలుసు. తన దగ్గర వున్న లక్షలు విలువచేసే వజ్రాలు—బంగారం గురించి.

మాట్లాడుకోటానికి వీల్లేదు.

షాంకీల్ దగ్గరలోకి వచ్చాడు.

ఇక ఆలోచించటానికి వ్యవధిలేదు. మొత్తానికి తను ఏదో చెయ్యాలి. తన సంపదను ఈ విమాన దొంగలకు అప్పగించటానికి వీల్లేదు.

ఆ సమయంలో హఠాత్తుగా భారత్‌కు కెరోన్ గుర్తుకు వచ్చింది.

కెరోన్.

చావబోతూ తమని శపించిన ఆడది.

కెరోన్ శాపం నిజం అవుతుందా? లేకపోతే తను ఈ విమాన దొంగలబారిని పడతాడని వూహించగలిగాడా?

దీనికంతటికీ కారణం కెరోన్ శాపమేనా?

ఓ కెరోన్....నన్ను క్షమించు.

అతని ఆలోచనలు ఇలా వున్నప్పుడే ఒక్కసారిగా స్టెల్లా చిన్న జర్కుతో కదిలినట్లు అనిపించింది.

మెరుపు వేగంతో ఆమె చెయ్యి పనిచేసింది. పర్సులో గుండెల మధ్య వున్న రివాల్వర్‌ను బయటకు లాగి అందాల సుందరిని పట్టుకున్న వాడిచేతికేసి గురి చూడ

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే వి.పి. ద్వారా మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

అయితే, ఈ స్కీము అసన ఏజంట్లు వున్న ప్రాంతాలకు వర్తించదు. మీరు హోమ్ డెలివరీ సభ్యత్వము పంపే ముందు మీ వూరిలో మా ఏజంటు లేడనే విషయం నిర్ధారణ చేసుకోండి.

కుండా నే పేల్చింది.

ఢాం.... ఢాం....—ఆమె గురి తప్పలేదు ఐనా.

• • •

బాధతో అరిచాడు వాడు. వాడి చేతిలో వున్న పిస్తోలు కిందపడిపోయింది.

ప్రయాణీకులంతా ఉలిక్కిపడ్డారు.

షాంకీల్ ఎలర్టు అయ్యాడు. అతని చేతిలో వున్న సూట్ కేసును బిగించి పట్టుకుంటూనే స్టెల్లా వెపు తిరిగాడు.

ఐతే—అప్పటికే భారత్ క్షణంకూడా వృథా చెయ్యకుండా ప్యాంటు జేబులోనించి రివాల్వర్ బయటకు లాగి షాంకీల్ కేసి కాల్చాడు.

పక్కకు తప్పుకున్నాడు షాంకీల్.

గురి తప్పింది.

రివాల్వర్ మోత విని కేబిన్ రూంలోనించి ఓ మనిషి బయటకు వచ్చాడు. అంతే, అక్కడే కాపలా ఉన్న మనిషి పిస్తోలు పేల్చాడు. కెవ్వుమని బోర్లా పడిపోయాడు అతను.

వెంటనే కాపలా మనిషి లోపలకు పరుగుదీశాడు.

అంతా గొడవగా మారిపోయింది వాతావరణం.

స్టెల్లా మరోసారి రివాల్వర్ పేల్చింది. అందాల సుందరి గుండెల్లోకి దూసుకుపోయింది గుండు.

కసిగా నవ్వుకుంది స్టెల్లా.

మొదలు నరికిన చెట్టులా కూలిపోయింది అందాల సుందరి.

"డర్టీ డెవిల్ .... నువ్వు అందాల సుందరివా .... నీ అందం నీతోనే అంతమైపోతోంది. ఈ ముఠాతో కలిసి

నాటకం ఆడతావా?" మరోసారి రివాల్వర్ పేల్చటానికి సిద్ధంగా వుంది సెల్లా.

బోర్లా పడిన వాడు లేవబోయాడు, కాని సెల్లా వాడికా అవకాశం ఇవ్వలేదు. ఈసారి గురిచూసి వాడి తలకేసి చూసి పేల్చింది.

మళ్ళీ ఆమె గురి తప్పలేదు. వాడి తల్లో దూరిపోయింది బుల్లెట్.

పెద్ద ఆర్తనాదం చేశాడు.

పక్కకు తప్పుకున్న షాంకీల్‌ను మరోసారి కాల్చాడు భారత్.

కాని—వూహించని విధంగా ప్లేన్ ఓ పక్కగా ఒరిగిపోయింది. ఒకరిమీద ఒకరు పడ్డారు.

కేబిన్‌లో మూడుసార్లు పిస్తోలు పేలిన చప్పుళ్ళు వినిపించాయి. వెంటనే ఓ యిద్దరి ఆర్తనాదాలు వినపడ్డాయి.

"మై గాడ్ పైలెట్‌ను కాల్చేశారు" ముందుకు పడిపోతూ సెల్లాను పట్టుకుంటూ అన్నాడు భారత్.

సెల్లా ఏదో మాట్లాడబోయింది.

కాని అప్పటికే ప్లేన్ కంట్రోల్ లేకుండా ఒరిగిపోతుండటంతో బోర్లాపడిపోయింది.

అంతా గోలగా అరుస్తున్నారు.

ప్లేన్ ఒరిగిపోతోంది.

ఉన్నట్టుండి ఒక్కసారిగా మంటలు పైకిలేచాయి.

పెట్రోలు టాంక్ అంటుకుంది. బుల్లెట్లు టాంకుకు తగిలి వుండాలి.

(సశేషం)

